కం॥ అనవినుచునానృపాలుం డనఘరరత్నమువతోడ నర్ఘ్యంబిడఁగాఁ
జనుదెంచి దేవయర్ఘ్యము గొనుమని ప్రార్థించెనన్ను గురుతరభక్తిన్॥ 203

కం॥ నీమర్యాదకు మెచ్చితి నీమణులేలయ్య మాకు నీవలచినమా
గోమాతనిమ్ము కాదనుచో మఱినీబాహుబలము చూపింపుమనన్। 204

చ॥ కనలి యఁలంతినవ్వుదొలకన్ జలుకన్నుఁజూచిచూచి యి
ట్లనియెనునాడుమాటవినుమా! కనుమా! దయచేసి యోఁదు వి
ప్రనికరమున్నఁ బేర్మిఁ దనరన్మణిరంజితవస్తువీయఁగాఁ
బనుపడు రాచవారిపటుబాహులు సాహసమొందు సేయునే। 205

ఆ॥వె॥ ఎంతచక్రవర్తి నేనిఁ బోషింపఁగా వలఁతివలయువాని వెలయునిచ్చు
గోవునూకుఁగాక కోనలఁగానల ముక్కుమూసికొనెడి మునులకేల॥ 206

కం॥ నీవైనవినుము చెడకుము గోవులఁబదివేలనిత్తుఁ గొమ్ము దురాశన్
బోవకుము రిత్తయాగ్రహ మావేశము చూపఁబోకుమా! మాయెదురన్॥ 207

మ॥ అనినన్ గ్రోధవిఘూర్ణమాన నయనవ్యాప్తాగ్నికీలల్ నను
మునుకల్పెట్టగనేమి యేమిబళిరా! మూర్ధన్య! రాజన్య! మా
కినుకంజూచెదు బాపశాపముల నీకృత్యమ్ము నాకృత్యమున్
గనుమా! మాకు దురాశయా? నిలుము నీగర్వంబఖర్వంబుగాన్। 208

శా॥ శాపమ్మంటెదొ చాపమంటెదొ వృథాచాలించుగర్వోక్తి నే
శాపమ్మంటిన విప్రుఁడన్న వెఱపా చాపమ్మె రానిమ్ము నీ
రోపమ్మున్నఱకోపమున్ జలమునీరోసమ్ము మీసమ్ము నీ
చాపంబద్దసహస్రబాహువుల యాశౌర్యమ్ము వీక్షించెదన్॥

కం॥ మాయింటఁగుడిచిపదపడి మాయావుందోఁచికొన్నమాయావివి నిన్
మాయింపకుండవిడుతునె హాయిగఁగునుకెల్లువట్టురా? యటులైనన్॥ 210

మ॥ అనినన్ దిగ్గనలేచియానృపతి వంశాంగారుఁడుద్యద్ధను
ర్ధ్వానులన్ జక్కఁగనిల్పినాకునొసఁగెం బ్రత్యుత్తరమ్మిట్లు మా
రొక్కనివర్షించె నిశాతఘోరశరముల్ రుద్ధారుణాభ్రంబులై
ననుముంపన్ జెయివీచెసైన్యములకున్మర్దింప దుర్దాంతుఁడై॥ 211

శా॥ ముట్టన్వచ్చుశరమ్ములందునిమి యమ్మూర్మికల్ చికాకెత్తి ప
ర్వెట్టందోలితిదిట్టవైసలిచినన్ బిట్టాడికొట్టాడిచూ
పెట్టన్ రాకచరించునన్నుగనుచున్ బిట్టుల్కికట్టల్కచే
నెట్టన్ దాఁకెనుగాత్రవీర్యుఁడు బలానీకమ్ము నేకమ్ముగాన్॥ 212

శా॥ వారింద్రుంచుచునారిఁద్రుంచిధనువుల్ పట్టంగఁజేయాడనీ
కారాజన్యసహస్రబాహువులఁ జక్కాడంగగ్రుక్కాడకా
భీకుల్ వీగలుపాఱిరానృపతి కుంభిస్వామిపైదూఁకినా
బీరమ్మెక్కఁగుఠారధార కెఱగాబిట్టేసితిన్ మూర్ధమున్॥ 213

శా॥ డొల్లంబోయి యతండు త్రెళ్ళిపడె నాటోపంబు దీపింపఁదాఁ
జెల్లెన్నేఁడు గృహఘ్నభావమనుచున్ జేయెత్తి యెగ్గెత్తి నా
వల్లన్గ్గొను ధేనువున్విడిచి యంభారావ చైత్రధ్వనుల్
పెల్లైమ్రోయ దిశాదశస్థలములన్ బెల్లుబ్బియుల్ సేరితిన్, 214

కం॥ ఒడలెల్లఁగనులుగా నా వెడలిన పోడిదాగిఁ జూచు పితరులు సఖులున్
జడదారులావువెంబడి, బడివచ్చెడి నన్నుఁజూచి పరమ ముదమునన్, 215

ఆ॥ వె॥ ఆవుముద్దుగొనుచు నంగరక్షలు వెట్టి, దిష్టిఁదీసి నన్నుఁ దేర్చి రపుడు
సార్వభౌము నేఁడు శాసించినాఁడు మా, పరశురాముఁడనుచు బంధుజనులు 216

వ॥ ఇట్టు పరమోత్సాహంబునం బ్రవర్తిల్లుచున్న నొక్కనాడ కార్తవీర్యనందనులు వనాం
తరగతుండగు నాకుఁ గురుద్రోహంబు సేసిన వొదవిన కోపంబునంజేసి వారల నెల్లర
వెదకి వెదకి వధియించి, 217

చం॥ ఇరువది యొక్కమాఱులు దహించితి రాజకకాననంబు వి
స్ఫురిత కుఠారధార బుణశుద్ధినొనర్చితి శాంతిఁ జెందితిన్
గుఱు వనభూమియందు నొడఁగూర్చి శమంతక పంచకమ్మునీ
ధరణి సమస్తమిచ్చితిని దక్షిణగా నలకశ్యపర్షికిన్. 218

## — రామావతారము —

గీ॥ వెలయ భృగుకులమందు నేనొలసి నాఁడు తొల్లి భృగుపత్నిఁ జంపిన దుడుకుతనము
రాపనక్లిన్నలోకసంప్రార్థనమ్ము ఫలము దశరథ రామరూపమ్ముగంటి. 219

శా॥ మాయాకర్మవిశారదుండయిన యమ్మారీచుఁ బ్రోచి పె
న్మాయన్ సీతనుదొంగిలించు దశకంఠచ్ఛేదసంపాదనో
పాయాన్వేషణతత్పరుండనయి యేనందందు వేసారి సు
శ్రీయోదాయకుఁ గాంచిఁ గాంచితిముని శ్రేష్ఠున్ దపోనిష్ఠునిన్. 220

ఆ॥ వె॥ పదవిభంగనహుష పదవీవిభంగుఁడు భ్రుకుటిదమితవింధ్యభూధరుఁడు
శుద్ధజలవిధాయి చుళికితాంభోరాశి కుంభభవుఁడతండు కూర్మివెలయ. 221

కం॥ కొనుమంచుఁ బాశుపతదీక్షను దయసేసెనుజయింపుశత్రులననుచున్
దనుమాడితి రావణు నామునివరుదివ్యోపదేశమునన్ శ్రమతన్. 222

గీ॥ బ్రహ్మమునిమనుమఁడగురావణునిఁజంపు పాపపుంజమ్ములవి వటాపంచలుగను
దక్షిణాంబుధియుత్తర తారమునను శివునిఁబలుచోట్లనేఁ బ్రతిష్ఠించినాఁడ. 223

## — కృష్ణావతారము —

కం॥ కంసాది దనుజసంఘము, హింసింపఁగ బుట్టినాఁడఁ గృష్ణుఁడ నగుచున్
కంసుని మేనల్లుఁడనై, కంసార్థము యాదవీయ చరితముగాఁగన్. 224

ఆ॥వె॥ హరుని కంటిమంట కాహుతియైనయా, మదను గాంచినాఁడ మరలనపుడు
హిమగిరీంద్రమందు నీశ్వరునర్చించి, పదియు రెండునైనవత్సరములు. 225

ఆ॥వె॥ వేదరక్షణమ్ము విబుధపాలనమును, భక్తపోషణమ్ము పాపహింస
బ్రహ్మచర్య మేకపత్నీవ్రతము రాజ, తంత్ర కుశలతయును ధర్మబోధ. 226

కం॥ వెలయింపఁ దలచి వెలసితి, నిలలోఁ బలుమాఱులేను నీశ్వరుకరుణన్
వెలయించితిఁ దద్భక్తిని, వెలయుజగంబెల్ల నభవు వీక్షణ మహిమన్. 227

వ. అనుటయుఁ బ్రమోదమానమానసంబులఁ గందళితానంద బిందుసందోహ మరంద
స్యంద తుందిలిత నయనారవిందులయి, 228

ఉ॥ శ్రీపతి నాగలింగ బుధచిత్త సరోరుహ రాజహంసు స
ద్దేవలి సోమనాథ గురుదేవ మనఃప్రియుఁబండితేంద్ర తా
డేపలి వెంకటప్పయ పటిష్ఠ వచోల హారీనిధాను వి
ద్యాపతి సంగమేశ్వర హృదంబుజబంభరు మల్లికార్జునిన్. 229

కం॥ శ్రీశైలపతిప్రియతా రాశిని శ్రీ కాశినాథ బ్రహ్మయలింగా
భ్యాశ ధృతవిమలదీక్షుని, శ్రీ శంకర భక్తఘటిత చిన్మయదీక్షున్, 230

ఆ॥వె॥ ఆవుముద్దుగొనుచు నంగరతులఁ బెట్టి, దిష్టిఁదీసి నన్నుఁ దేర్చి రపుడు
సార్వభౌము నేఁడు శాసించినాఁడు మా, పరశురాముఁ డనుచు బంధుజనులు 216

వ॥ ఇట్లు పరమోత్సాహంబునం బ్రవర్తిల్లుచున్న నొక్కనాఁడ కార్తవీర్యనందనులు వసాంతరగతుండగు నాకుఁ గురుద్రోహంబు సేసిన వోదవిన కోపంబునంజేసి వారల నెల్లర వెదకి వెదకి వధియించి, 217

చం॥ ఇరువది యొక్కమాఱులు దహించితి రాజకకాననంబు వి
స్ఫురిత కుఠారధార, ఋణశుద్ధి నొనర్చితి శాంతిఁ జెందితిన్
గురు వనభూమియందు నొడఁగూర్చి శమంతక పంచకమ్మునీ
ధరణి సమస్తమిచ్చితిని దక్షిణగా నలకశ్యపర్షికిన్. 218

---

## — రామావతారము —

గీ॥ వెలయ భృగుకులమందు నేనొలసి నాఁడు తొల్లి భృగుపత్నిఁ జంపిన దుడుకుతనము
రావనక్లిన్నలోకసంప్రార్థనమ్మ ఫలము దశరథ రామరూపమ్మగంటి. 219

శా॥ మాయాకర్మవిశారదుండయిన యమ్మారీచుఁ బ్రేరేచి పె
న్మాయన్ సీతను దొంగిలించు దశకంఠచ్ఛేదసంపాదనో
పాయాన్వేషణతత్పరుండనయి యేనందందు వేసారి సు
శ్రీయోదాయకుఁ గాంచిఁ గాంచితి ముని శ్రేష్ఠున్ దపోనిష్ఠునిన్. 220

ఆ॥వె॥ పదవిభంగనహుష పదవీవిభంగుఁడు భ్రుకుటిదమితవింధ్యభూధరుఁడు
శుద్ధజలవిధాయి చుళికితాంభోరాశి కుంభభవుఁడతండు కూర్మి వెలయ. 221

క॥ కొనుమంచుఁ బాశుపతదీక్షను దయసేసెను జయింపు శత్రులననుచున్
దనుమాడితి రావణు నా మునివరు దివ్యోపదేశమున నస్త్రమతిన్. 222

సీ॥ బ్రహ్మమునిమనుమఁడగురావణునిఁజంపు పాపపుంజమ్ములవి పటాపంచలుగను
దక్షిణాంబుధియుత్తర తీరమునను శివునిఁబలుచోట్లనేఁ బ్రతిష్ఠించినాఁడ. 223

---

## — కృష్ణావతారము —

కం॥ కంసాది దనుజసంఘము, హింసింపఁగఁ బుట్టినాఁడఁ గృష్ణుఁడనగుచున్
కంసుని మేనల్లుఁడనై, కంసారిమ్మ యాదవీయ చరితముగాఁగన్. 224

ఆ॥వె॥ హరుని కంటిమంట కాహుతియైనయా, మదను గాంచినాఁడ మరలనపుడు
హిమగిరీంద్రమందు నీశ్వరునర్చించి, పదియు రెండునైనవత్సరములు. 225

ఆ॥వె॥ వేదరక్షణమ్ము విబుధపాలనమును, భక్తపోషణమ్ము పాపహింస
బ్రహ్మచర్య మేకపత్నీవ్రతము రాజ, తంత్ర కుశలతయును ధర్మబోధ. 226

కం॥ వెలయింపఁ దలచి వెలసితి, నిలతోఁ బలుమాఱులేను నీశ్వరుకరుణన్
వెలయించితిఁ దద్భక్తిని, వెలయుజగంబెల్ల నభవు వీక్షణ మహిమన్. 227

వ. అనుటయుఁ బ్రమోదమానమానసంబులఁ గందళితానంద బిందుసందోహ మరంద స్యంద తుందిలిత నయనారవిందులయి, 228

ఉ॥ శ్రీపతి నాగలింగ బుధచిత్త సరోరుహ రాజహంసు న
ద్దేపలి సోమనాధ గురుదేవ మనః ప్రియుఁబండితేంద్ర తా
డేపలి వెంకటప్పయ పటిష్ఠ వచోల హరీనిధాను వి
ద్యాపతి సంగమేశ్వర హృదంబుజబంభరు మల్లికార్జునిన్. 229

కం॥ శ్రీశైలపతిప్రియతా రాశిని శ్రీ కాశినాధ బ్రహ్మయలింగా
ఖ్యాశ ధృతవిమలదీక్షుని, శ్రీ శంకర భక్తఘటిత చిన్మయదీక్షున్, 230

వసంతతిలకా॥ ఆరాధ్యవంశ తుహినాం శుమనోజ్ఞమూర్తిన్
ధీరాళి సన్నుత కృతిస్థిరచారు కీర్తిన్
గౌరీశ పాదభజన ప్రవణాంత రంగున్
దూరీ కృతతుషితదుర్గుణ జాల సంగున్. 231

మ॥ స్థిరవిశ్వేశ్వర పాదపంకజయుగ శ్రీ భావనాసంగతాం
తర విద్వత్పదపద్మభృంగ మధుర ధ్వన్యాత్మ కాంచీపురీ
శ్వర మాహాత్మ్యము నందు రెండవది యాశ్వాసంబు దీనిన్మహా
శ్వగుఁ డాకృష్ణము నా హిమాలయమును న్వర్ధిల్లఁ బాలించుతన్. 232

—♦—



# శ్రీ కాంచీ ఖండము.

## తృతీయాశ్వాసము.

కం॥ శ్రీరామలింగ విద్వ, త్పారీంద్రాంకిత మహాప్రబంధ విశేష
శ్రీరూఢ సహజభక్తిస, మారాధ్యుని, మల్లికార్జునారాధ్యు గురున్, 1

వ. అట్లు శివకథా కథన చతురుండైన యన్నారాయణుని, 2

కం॥ కని వారలెల్ల ముదమున, వనజాక్షు! భవత్కృపా ప్రభావము వలనన్
వినఁగంటిమివియు నింకన్, వినిపింపవె మీ విచిత్ర విభవములనినన్, 3

చం॥ దరదరవింద నేత్రుఁడు సుధారసధార సహోదరమ్ములై
పరఁగు మృదూక్తులన్ బరమ పావనముల్ శుభకారణమ్ములున్,
దురిత కుఠారముల్ చటుల దుఃఖహరమ్ము లనంత మంగళా
కరములు పల్కెనా శివునిగాథలు లక్ష్మియు మానులున్వినన్. 4

కం॥ హరయన్నన్ భవబంధము, హరియించు హరించుఁబాత కావళినెల్లన్
వరియించు ముక్తికాంతయు, హరునకు నీడెవ్వరయ్య యమరులలోనన్, 5

### — త్రిపురాసురుల మహిమ —

శా॥ అంభోరాసి మథించువేళ నుదయంబయ్యె న్మహాలింగమై
శంభుండీశ్వరుఁడ మ్మహేశ్వరు దయన్ సాధించి సాధించి రా
యంభోజాసనసృష్టిదుర్లభము లుద్యత్స్వర్ణరౌప్యాయసస
ద్గుంభమ్ముల్ త్రిపురమ్ములం బ్రబలి రక్షోనాథులక్షోభ్యులై. 6

వసంతతిలకా॥ ఆరాధ్యవంశ తుహినాంశుమనోజ్ఞమూర్తిఁ
ధీరాళి సన్నుత కృతిస్థిరచారు కీర్తిఁ
గౌరీశ పాదభజన ప్రవణాంత రంగుఁ
దూరీకృతతపితదుర్గుణ జాల నంగుఁ. 231

మ॥ స్థిరవిశ్వేశ్వర పాదపంకజయుగ శ్రీ భావనాసంగతాం
తర విద్వత్పదపద్మభృంగ మధుర ధ్వన్యాత్మ కాంచీపురీ
శ్వర మాహాత్మ్యము నందు రెండవది యాశ్వాసంబు దీనిన్మహే
శ్వరుఁ డాకృష్ణము నా హిమాలయమును స్వర్థిల్లఁ బాలించుతన్. 232

—•—



# శ్రీ కాంచీ ఖండము.

## తృతీయాశ్వాసము.

కం॥ శ్రీరామలింగ విద్యా, త్పారీంద్రాంకిత మహాప్రబంధ విశేష
శ్రీరూఢ సహజభక్తిస, మారాధ్యుని, మల్లికార్జునారాధ్యు గురున్. 1

వ. అట్లు శివకథా కథన చతురుండైన యన్నారాయణుని. 2

కం॥ కని వారలెల్ల ముదమున, వనజాక్ష! భవత్కృపా ప్రభావము వలనన్
వినఁగంటిమివియు నింకన్, వినిపింపవె మీ విచిత్ర విభవములనినన్. 3

చం॥ దరదరవింద నేత్రుఁడు సుధారసధార సహోదరమ్ములై
పరఁగు మృదూక్తులన్ బరమ పావనముల్ శుభకారణమ్ములున్.
దురిత కుఠారముల్ చటుల దుఃఖహారమ్ము లనంత మంగళా
కరములు పల్కెనా శివునిగాథలు లక్ష్మియు మానులున్వినన్. 4

కం॥ హరయన్నన్ భవబంధము, హరియించు హరించుఁబాత కావళినెల్లన్
వరియించు ముక్తికాంతయు, హరునకు నీడెవ్వరయ్య యమరులలోనన్. 5

### — త్రిపురాసురుల మహిమ —

శా॥ అంభోరాసి మథించువేళ నుదయంబయ్యె న్మహాలింగమై
శంభుండీశ్వరుఁడ మ్మహేశ్వరు దయన్ సాధించి సాధించి రా
యంభోజాసనసృష్టిదుర్లభము లుద్యత్స్వర్ణ రౌప్యాయరస
ద్గుంభమ్ముల్ త్రిపురమ్ములంబ్రబలి రక్షోనాథులక్షోభ్యులై. 6

శా॥ ఆకాశాంతర ధీర ధీరచరముల్ నాకాది లోకావళీ
భీకృత్యమ్ములు సత్యలోక సమముల్ విస్ఫార సౌఖ్యక్రియా
వైకుంఠమ్ములకుంఠభక్తి జనతావాల్లభ్యలభ్యాంతర
శ్రీకైలాసములీశ్వరార్చనకళాసిద్ధమ్ములిద్ధమ్ములై. 7

కం॥ పరఁగెడునా పురములలో హరివిక్రములీశ్వరార్చనాఢ్యులు త్రిపురా
సురులన జగత్ప్రసిద్ధులు పరగర్వితులఖిలవేదపారగులగుచున్. 8

కం॥ సమధనముసమబలమ్మును సమబుద్ధిసమానరూప సౌభాగ్యమ్ముల్
సమవిక్రమములవెలయుచు సమానులసమానులైరి సకలమునందున్. 9

కం॥ తమకెదురులేక యెయ్యెడ నమర్త్యపరిపంథికోటి యధిగర్వమునన్
దమునెదిరి నెఱుఁగకుండన్ సమస్తలోకములఁగలఁచిచరియించిరొగిన్. 10

ఆ॥వె॥ కాన నెండకన్ను వానకన్నెఱుఁగని వారలున్ననుండవచ్చుఁగాక
దివిజవర్గమందుఁద్రిపురాసురులచేతఁ బరిభవింపఁబడనివాఁడులేఁడు. 11

చం॥ రణమునవారలన్ గెలువరాదనుమాట శిలాక్షరమ్మె మా
రణమెదియో యుపాయమున రక్కసిమూఁకలకైనఁ దత్సతీ
మణులపతివ్రతాత్వమహిమన్ దరియింపనశక్యమిన్నిటన్
గణనకునెక్కురక్కసుల గండడఁగింపనసాధ్యమేరికిన్. 12

కం॥ శివభక్తులైనవారికి దవుదవ్వులఁదొలఁగిపోవు దండధరుఁడున్
శివభక్తాగ్రేసరులు దైత్యవరులవధియింపఁగల యుపాయముగలదే. 13

వ॥ అని చింతించి సురలెల్ల నన్నుంజేరి ప్రార్థించిన నేనుం బెద్దతడ వాలోచించి యొక్క
మార్గమ్ము నిశ్చయించి తదనుసరణమ్ముగా. 14

## బుద్ధావతారము

కం॥ ముని వేషమూని బుద్ధుం డనునామము వెలయ శిష్యుఁడయి నారదుఁడున్
వెనువెంటఁ గొలిచి రాఁగాఁ జనినాఁ డను త్రిపురదనుజ సౌధమ్ములకున్॥ 15

గీ॥ అర్ఘ్యపాద్యాదివిధుల మమ్మధికభక్తిఁ గొలిచి యర్చించిరా వీటి కువలయాక్షు
లధికగర్జితభీషణమయిన నీలమేఘమిడు జీవనము మించు మెఱుపుతోడ. 16

మ॥ తముబంధించెడు త్రాళ్లమం చెఱుఁగరా దైత్యాంగనల్ మమ్ము ను
త్తమభక్తిన్ భజియించిరే దివిజకాంతల్ సాటిగావత్తురా
కమనీయత్వమునన్ గళాపరిచితిన్ గళ్యాణభావమ్మునన్
శమమందున్ దమమందు శౌచము నెడన్ దాక్షిణ్యధర్మమ్ములన్. 17

కం॥ ఒకయనసూయకు లోఁగితి మొకట త్రిమూర్తులము గూడియును ననసూయల్
క్రకచకరాళవ్రతలా యకలన్ వంచించు టెట్టు లసురాంగనలన్. 18

గీ॥ రాక్షసేశ్వరజీవనరాజధాని పుణ్యజనవీరకేసరుల్ పుట్టుచోటు
అసురసామ్రాజ్యలక్ష్మికి నంగరక్ష దానవాంతఃపురము పుణ్యధర్మభూమి. 19

మ॥ ఒకకొన్నాళ్లు వసించి యే మచట నెల్లో వారిచిత్తమ్ము లిం
చుక మా బోధలపాలు చేసితిమి యా శుద్ధాంతసీమంతినీ
ప్రకరమ్ము న్నమ్ముఁ దోడఁబుట్టులనుగాఁ బ్రత్యక్షదైవమ్ముగాఁ
బ్రకటాత్మీయపురాకృతోజ్జ్వల మహాభాగ్యమ్ముగాఁ జూడఁగా. 20

కం॥ పతిభావ మొకటి విడి యా పతివ్రతలు దలఁచి రఖిల భావములందున్
గతిమాకన్నను లేదని చతురతరమదీయవాక్య సంగతివలనన్. 21

వ॥ మఱియు నమ్మహిళామణులకే నొక్కొక్క సమయంబున. 22

## బుద్ధుఁడు త్రిపురాసురులకు బోధించుట

క॥ శక్తిస్వరూపలగుమీ శక్తియె మూలమ్ము దనుజ సంపదలకును
వ్యక్తలయియుండఁదగదీ పాతివ్రతధర్మమ్ము మిమ్ముఁ బాపోసరించెన్. 23

క॥ పురుషులకంటెను మిక్కిలి వెరవరు లంగనలు ధైర్యవిభవములందున్
సరిలేనివారలయ్యును దరుణులు గృహగర్భములను దాఁగఁగనేలా. 24

క॥ తలకెక్కు హృదయమెక్కున్ బలికించున్ దనదుమాట బడసిని త్రిమూర్తుల్
వలచి తమవెంటఁబడఁగా వలపించెడుజాతి సాటివారలు గలరే. 25

గీ॥ మీరు కనిపెంచఁ బెద్దలై వీరులైన వారు గాకెట్లు వచ్చినవారు వీరు
పురుషసింహులమంచు వాపోదురకట తలఁపరింతయు మీజాతిఁ గలుగు గొప్ప.

క॥ లలితాభట్టారిక పదముల గొలిచెడివారెగా త్రిమూర్తులనంగాఁ
గలజగము సృష్టియెల్లను గలుగును మీ మధురమైన కనుబొమలసుడిన్. 27

మ॥ వివిధోగ్రాహవవైరి మారణకళా విఖ్యాతుఁడౌ వీరుఁడే
యవుఁగాకింద్రియకుంభికుంభదళనవ్యాపారపారీణుఁడే
యవుఁగా కూర్జితసర్వశాస్త్రనిగమవ్యాసంగనిష్ణాతుఁడే
యవుఁగా కెవ్వఁడుఁ గాలిబొమ్మలు గదమ్మా మీదు వాల్గంటికిన్. 28

మ॥ జలధిప్రావృతమా విశాల ధరణీసామ్రాజ్యముం గూడ జం
చలయుష్మత్ప్రణయ ప్రసూకటిల వీక్షాకాములై వీడు దు
ర్బలులన్ దైనములంచు నీ పురుషులన్ బాటింతురే చేతిలో
పలికీల్బొమ్మలుగారె యెవ్వరయినన్ భావింప స్త్రీజాతికిన్. 29

క॥ మిము మీరెఱుఁగక పురుషుల, సమధికభక్తిని భజించి సహజమ్మగు మీ
దు మహిమఁ గోల్పోవుటకన్న, మానభంగమ్మ కలుగునా! సతులారా! 30

క॥ అనుమాన బాధమగు సుఖ, మునకయి ప్రత్యక్షసుఖము పోవిడుచుటకం
టెను మౌర్ఖ్యమున్నె యిఁకన్నై, ననుగనువిచ్చెదరుగాక నా మాటబడిన్, 31

క॥ ఉన్నంతలోనె సౌఖ్యము, నెన్నోవిధమ్ములను జెందుటే మోక్షము గా
కున్నదె బ్రహ్మానంద, మ్మన్నది వేఱొక్కటెందు నైనఁదలంపన్. 32

క॥ కేవల సుఖానుభవమున. కై వసుధం బుట్టియుండి యదిగాదని యీ
జీవమ్ము తనువుడయ్యం, గావించు వ్రతమ్మ లీయఁగలవె సుఖమ్ముల్. 33

క॥ పురుషులకుఁ జెల్లుబాటఁట, తరుణులఁ బదునాలు వేల దమిఁ బెండ్లాడన్
దరుణికఁట పాపమగునఁట, పురుషాంతరయోగమేమి పుణ్యము చెడెనో, 34

గీ॥ సామ్యమన్నంటఁ గోరురాక్షసులకకట, మీరు గృహలక్ష్మలైతిరే మేలు మేలు
వారిసామ్యమ్ములిటఁ జెల్లుబాటుగావొ, స్వార్థపరులను గొలిచిన ఫలముగలదె!

ఉ॥ రక్కెసవందులంత రుదురాకలు దాల్చిరి నేమి కెంపులా
చిక్కని మేనబూది గయిసేసిరి దెక్కడి మంచిగంద మీ
చిక్కిరి బిక్కిరి న్నెగటు చిన్నెల వన్నెలఁ జేసియొక్కొ యీ
రక్కసి పేరువచ్చెఁ జతురప్రియమూర్తులు మీకు నక్కటా. 36

మ॥ ఒకనాఁడు న్గనరాని దేవుఁడెవఁడో యున్నాఁడు శిక్షించు నం
చకటా సౌఖ్యములెల్ల రోసి కడుదవ్యమ్మైన ప్రాయమ్మ కొం
చక యీ దుర్భర ఘోర నిష్ఠలకు వెచ్చంబెట్టుచున్నారె వెం
డిఁకనైన న్గనుగొందు మేల్కనుఁడు మీరీ దుఃఖదూరాత్రముల్. 37

చ॥ ఎవరికివార యీశ్వరు లహింసయె ధర్మము కర్మబంధముల్
దవులవు పూర్వజన్మ మనృతమ్మ నిరంతర సౌఖ్యసంగతుల్
భవమునసారముల్ క్షణికభావ విశిష్టము విశ్వవిశ్వమున్
వివిధములైన వేదము లవిశ్వసనీయము లెల్లవారికిన్. 38

మ॥ అని బోధించెడి నాదుపల్కుల నమర్త్యారాతి జీవమ్ములా
వనితాలోకముల న్వయోవిభవ దర్పల్గొందఱుగ్గించిరన్
విని కోపించెడి వృద్ధురాంధ్ర పలుకుల్విన్నారు లేరైరి నా
చనుమానమ్మట చెల్లెనెల్లరు నను న్శ్లాఘించి రొక్కమ్మకిన్. 39

శా॥ నా మాటల్దలపోయుటల్ సతతము న్నా బోధలాలించుటల్
నా మేధన్ గణుతించుటల్ మనమున న్నా రూపెచింతించుటల్
సామాన్యమ్ముగ నిత్యకృత్యమయి యా సాధ్వీజనుల్ భర్తృసే
వా మాంగళ్యమునం బ్రమాదపడుచు న్వర్జించి రాచారముల్. 40

ఉ॥ ఎక్కడి భిక్షుకుండె యడియెక్కడి చక్కదనమ్మె మాటలా
చిక్కని తేనెలన్ జిలుకు చిమ్మెన గ్రోవుల తేటలా సెబా
సిక్కడి కేగుదెంచె నది యెట్టి పురాకృతపుణ్యమోసి య
మ్మక్క తదీయమంగళ కటాక్షమున న్దరియింప నేరమే. 41

క॥ అమ్మంగళ కరవిగ్రహు, నెమ్మనముల యందునెపుడు నిలుపఁగనఁగృతా
ర్థమ్మగు జన్మమ్మని, నిత్యమ్మును భావింతురచటి దైత్యమదవతుల్. 42

క॥ ఎక్కడి సన్యాసియొ వీఁడక్కట మనధర్మమెల్ల నణగించెను దా
రిక్కితవుఁగొలిచిచెడి రమ్మక్కలు మనవారలందు రందలివృద్ధుల్. 43

మ॥ సరసాలాపవిభంగముల్ మృదుమనస్స్పర్ధల్ స్ఖలద్గోత్రముల్
వరుసాలోకనముల్ దరస్మితములున్ బ్రౌఢాంగ విక్షేపముల్
కరణీయ ప్రియకార్య విస్మరణముల్ శయ్యాంతర స్వీకృతుల్
మురిపింపం దలపోయరాదితిసుతుల్ ముగ్ధేక్షణాద్రోహముల్. 44

మ॥ వటబీజమ్మయినాఁడె నా పలుకు దేవద్రోహికాంతామనః
పుటభూమిన్మొలకెత్తెఁ బెట్టెఁ జిగురుల్ పూచెన్ ఫలించెన్మహా
వటమైయూడలు వేళ్లుపాదుకొనియెం బ్రాకెన్ సురారాతి వి
స్ఫుటసామ్రాజ్య గరిష్ఠ సౌధతలముల్ చొచ్చెన్విపాటించుచున్ 45

గీ॥ నాస్తికత్వమ్ము బోధించినాఁడనాఁడు త్రిపురదైత్యులనెల్ల వధించుకొఱకు
వారికున్నట్టి యాదైవబలము చెఱచి చేటుకాలమ్ము వారికిఁ జేరుటెఱిఁగి. 46

వ॥ వారదుండు సేవింప నొక్కనాఁడమ్మునుల నీక్షించితద్విరహాసహనమ్మునటించుచు. 47

కం॥ నేఁడెల్లివత్తుననియా చేడెలకున్నచ్చఁజెప్పి శివునిబ్రసన్నున్
వేఁడితి నట చనియమరుల గోడెల్లఁదలఁగన భవుఁగోరితినంతన్. 48

---

## శ్రీ విష్ణు రాయబారము

ఆ॥వె దుర్జయాత్ములయిన నిర్జరారాతుల, బారిసమరగల యుపాయమరసి
చెడ్డదారిబడిరి శిక్షింపవలెనింక, నసురకోటిననుచు నాత్మఁదలఁచి. 49

కం॥ నను రాయబారమునకై, పనిచెను శంభుండు దైత్యపతులకడకు నే
నును జని పరమేశ్వరు నా, జ్ఞను వారికిఁదెలిపినాఁడ సర్వము నిట్టుల్ 50

గీ॥ అక్కచెల్లెంద్ర బిడ్డలేయయ్యు మీర, లక్కవమ్మునఁ బోరాడుచుంట మేలె
వారిస్వారాజ్యమిచ్చి యవ్వారి చెఱల, నిపుడ విడిపుచ్చనలయు మీరింకమీఁద, 51

గీ॥ కలసిమెలసియె బ్రదుకుట కర్జమయ్యె, యేలనిటు వేసటలను జేసి తూలపుత్త్రు
రమరవరులను వారు మీయంతవారు, కారె! నిరసింతురే కండకావరమున. 52

కం॥ విడుఁడీ సురకోటిచెఱల్, విడుఁడీ లేకున్న యాస విభవములందుఁ
బడిరారందర చేతుల నిడి పాణము కదనమునకు నిఁక జాగేలా. 53

మ॥ అను నా పల్కులు ముల్కులై కలఁప దైత్యశ్రేష్ఠులత్యంత కో
పనులు గ్రాఁతువినిర్గమద్దహనులై, ప్రాజ్యైకసామ్రాజ్య పా
లనగర్వమ్మునఁ గ్రిందుమీఁదుఁ గనకేలా! రాయబారమ్ము లిం
కను రానిమ్మవఁ డేగుదెంచినన రే, కన్గొందు మా శౌర్యముల్. 54

మ॥ నిటలాక్షుండిట కెత్తివచ్చినను రానీ! రాజ్యమీ నేర్తుమే
పటుదోస్సారము చూపువేళ యిదిగో వచ్చెన్మహాపర్వమీ
భటసంఘమ్ములముందు నెవ్వఁడయినం బ్రాణమ్ములన్గల్గ వాఁ
కిటఁ గాల్వెట్టఁగలాఁడె రుద్రుఁడయినం గ్రేడింప నాడింపమే. 55

ఉ॥ దూతవుగాన నీ పలుకు తుంటరిమాటలు చెల్లిపోయె మా
చేతులతీటవో సమరసీమకు సిద్ధముగమ్ము పొమ్ము మీ
నీతులుగట్టిపెట్టి యని నిల్వ సుధాహరణప్రగల్భ నీ
చేఁతలు టక్కుటెక్కులిటఁ జెల్లవు శంబరకర్మకర్మఠా. 56

గీ॥ ఎల్లకాలమ్ము సురలు దా మేలవలెనె నాకలోకాధికారమ్ము మాకులేదె
ఇదియునొక పెద్దతప్పుగా నెంచియేల, గుహనునిద్రించుహరుల మేల్కొలిపినారు.

కం॥ మా యేలుబడి నమర్త్యులు, నాయుష్మంతులయి బ్రతుకనాసింతురు గా
కీ యెడ వినాశకాలమ్మె యెదురుట కలిగెనేని యది మేలగునే. 58

ఉ|| పొమ్మిఁక నేటికిఁ బ్రదికిపోయితి రేపటనెల్లి మీఁద బీ
రమ్మును జూడమా! యనికి రమ్మనుమా బలవైరితోడు గై
కొమ్మనుమా! దిగీశ్వరులఁ గ్రొవ్వొకయింత యణంగ దేనియుఁ
రమ్మనుమీ దురమ్మునకు, రాకెటుపోయెదు వే జనార్దనా, 59

కం|| అగిరిభిదురము భిదురము నరికంఠవిదారణమ్మునగుచక్రము సో
దరులకుఁగలవని యెఱుఁగుదు మరుదెండీ! వానిమఱువకచ్యుతమునికిన్, 60

కం|| శివదేవునాజ్ఞగాదను నవివేకులుగారుదనుజు లయినదురమునం
దు వెనుకడుగిడరుసుమీ భవుచిచ్చఱకంటిమంటపైఁ గొననేనిన్ 61

కం|| హరుదయనె పెరిగినారము హరుడేహరియింపఁదలఁచునా! యటులైనన్
మరిభాగ్యమున్నె కాక యమరులకురాజ్యమ్మునిత్తుమా! తెక తేరన్, 62

వ|| అని యిట్లుబహుప్రకారమ్ముల దురాలాపమ్ములాడుచు. 63

మ|| సంపన్మత్తులు మత్తచిత్తులుదురాశాబంధితుల్ ధైర్యని
ష్కంపుల్ కంపితవిష్టపత్రితయులున్గర్వాంధులాదానవుల్
కింపాకానుభవమ్ముడగ్గఱు నెడన్ లెక్కింపలేరైరి మా
పంపున్వారల తెంపుఁగాంచి వెఱచెన్ బ్రహ్మాండభాండమ్ములున్, 64

వ|| అంత నేమను సముచితమ్ముగా వారలవీడ్కొని. 65

కం|| రజతగిరికరిగిశివునకుఁ ద్రిజగద్గురునకును దేవదేవునకున్సత్
భుజగునకెఱిఁగించితి నా త్రిజగత్కంటకులదైనవృత్తాంతమ్మున్, 66

కం|| నాపలుకు లెల్లవినివిని
యా పరమేశ్వరుఁడువలికె నంతకుఁగలరా
పాపాత్ములింక నేలా
శ్రీసతిరణ పరికరమ్ము సిద్ధముసేయన్, 67

గీ॥ కాదు శార్ఙ్గమ్ము చక్రమ్ము కాదు కాదు నా త్రిశూలమ్ము కాదు పినాకమైన
నా పురత్రయీదనుజ నిర్వాపణమున కితర సాధనముల మాట యెత్తనేల. 68

—* ఈశ్వరుఁడు త్రిపురాసుర సంహారమునకు సన్నద్ధుఁడగుట *—

వ॥ అని మందస్మిత తరంగితమ్ములగు నపాంగమ్ముల నన్నుం గృతార్థుం గావించు నా నిఖిలే
శ్వరుని సంకల్ప ప్రభావమ్మున. 69

సీ॥ సర్వ సర్వంసహా చక్రమ్ము రథముగాఁ దారాద్రి తద్ధ్వజ స్తంభముగను
హిమగిరి నొగలుగా నిరుసు వింధ్యముగాఁగ శ్రీగిరి పీఠమై చెలగుచుండఁ
గాలశతాంగ చక్రములు చక్రములుగా నుదయాస్తగిరిశంతు లొరసియుండ
వాసుకి నారిగా స్వర్ణాద్రి ధనువుగా దర్శనమ్ములు పట్టు త్రాళ్లుగాఁగ
గీ॥ వెలయ వేదాశ్వములఁ బూంచి నళినభవుఁడు ప్రణవతోత్రము చేఁబూని పడగ
మీఁది వృషభ భీషణగర్జలో వెనుకఁబడని నేమిఘోషార్భటులతోడ నిలచె
నెదుట. 70

కం॥ ఏణాంకధరుఁడు శరధిం, దూణీరముగాఁగఁ జేసి దొరలేని దయన్
బాణమ్ముగాఁగ నన్నుం, దూణీరమునందు నిలువ దొరయుచుఁ బ్రమథుల్ 71

మ॥ హయహేషల్ ప్రణవప్రచారములు శంఖారావముల్ భేరికా
జయఝాంకారములున్మద ప్రమథపజ్జ్యాజాత టంకారముల్
స్మయ దుర్వారభటప్రకాండ ఘటితోచ్చైస్సింహనాదమ్ములున్
జయఘోషమ్ములు మిన్నుముట్ట విజయోత్సాహమ్ము వర్ధిల్లఁగా. 72

వ॥ పరమేశ్వరుం బరివేష్టించి రాసమయమ్మున. 73

కం॥ కైదండ నొసఁగె హరునకు, వేదండాస్యుండు భద్రవేదండగతిన్
పాదుకలు దెచ్చి తొడిగెన్, గాదిలికొమరుండు గౌరి కనుపండువుగా. 74

ఉ॥ స్యందనమెక్కె శంభుఁడు జయాదృతమంగళ సర్వమంగళా
నంద విజృంభితమ్ములగు నవ్యనిరీక్షణ భృంగబృందముల్
మందగతిప్రచారముల మానసపద్మ మరందబిందు ని
ష్యందముగ్రోలఁగా మధురహాసవికాసి గభీరవక్త్రుఁడై. 75

సీ। నానాంబరపుష్ప నవవసంతవిరాజి శార్దూలవాసోవసానమధుర
గ్రీష్మభానూజ్జ్వలార్చిష్మదోజోమూర్తి కారుణ్యవార్షుక ఘనకటాక్షు
శారదకౌముదీసారవిగ్రహరమ్యు సీమంతహేమంత శీతకరుని
సింధువారాసేక శిశిరోత్తమాంగుని గర్వాణకోదండ కలితభుజుని
గీ। మధురగంభీరదరహాసమంజువదను, నీపదరుణితగండవిశేషకాంతి
భ్రుకుటికౌటిల్యవిస్పష్టపురవిదాహ, కోపరేఖాప్రకాశితాటోపుహరుని. 76

గీ॥ కాంచిభయభక్తిభావ విక్లబతనొంది, వడవడవడంకె భూతప్రపంచమెల్ల
జయమహాదేవ హరహరజయగిరీశ, పాహియంచునుజగములుప్రస్తుతించె. 77

సీ॥ మూషకవాహనమ్మును నెక్కివిచ్చేసి వెనకయ్యతనతండ్రివెనుకనిలిచె
మదశిఖావళమెక్కి ముద మొప్ప నేతెంచి క్రౌంచారిసవ్య భాగముననిలిచె
సారమేయము నెక్కి భైరవస్వామియా పరమేశుదక్షిణ పార్శ్వమలమె
సింహమ్ము నెక్కి గర్జితభీషణుండయి భద్రుండు ముఁగలివైపునిలిచెఁ
గీ॥ ప్రమథవీరులు సకలగీర్వాణపతులు, వచ్చినిలిచిరితమతముపట్టులందు
హరునిముఖభావమరసియాయజుఁడుప్రణవ, తోత్రమునుగదలించెనుత్సుకత
మెఱయ. 78

వ॥ ఇట్లు సకల సన్నాహంబులు మెఱయ దండువెడలి యుప్పరమేశ్వరుండు మారుతపథమ్ము నందొక్కచో విడిసి రణధర్మమ్ముఁదలంచి సర్వకార్యసమర్థుండగు దూతంబుత్తెంచు సంకల్పమ్మున నున్నంత సుబ్రహ్మణ్యుండు లేచి పితృచరణమ్ములకు మ్రొక్కి సవినయమ్ముగా నిట్లనియె. 79

—※ వినాయక దౌత్యము ※—

కం॥ ఈపీటనున్న వారలు, గోవిదులని వార్యవీర్య గురుతేజస్సం
భావితులార్యచరిత్రులు, నావారలకాక యెంచ నన్యులుగలరే. 80

వ॥ అయిననొక్కమాట వచింతునని సభ్యులఁ గలయం గనుంగొని. 81

కం॥ ఈయున్నవారిలోపల, మాయన్న గజాననుఁడు సమర్థుఁడటంచున్
నాయాత్మఁదోఁచు దౌత్యముజేయంగాఁ బిదపఁదమదుచిత్తమ్మనినన్. 82

కం॥ ఆరాజమౌళియిట్లను, హేరంబునిగూడినీవు నేగుకుమారా
పోరునకుఁ గలుదువ్వేని, వారిన్వారించు పధము వదలకుడెప్డున్. 83

చం॥ అనినను జిత్తమట్లయని యన్నయుఁదమ్ముఁడు భక్తిఁబెంపునన్
వినతశిరస్కులౌచు గురుపీడ్కొని తమ్మటుసాగనంపు మి
త్రినివహమున్మరల్చి పురదైత్యులవీటికిఁజేరునంత నా
దనుజులు వారివార్తవిని తాముస్వయమ్ముగవచ్చిభక్తితో. 84

వ॥ సముచితమ్ముగా వారలం బూజించి యిట్లనిరి. 85

కం॥ మేమెంతపుణ్యజనులమొ, నోములనవియెట్టివాని నోచితిమోకా
నీమీాదర్శనభాగ్యము, సామాన్యమె మమ్ముఁజూడఁజనుదెంచితిరే. 86

గీ॥ అల్లులముమాకు వాత్సల్యమధికమగుటఁ, బేరుగలిగింప వచ్చినవారుగాక
కాకపనియేమిగలిగినఁగాకిచేతఁ, గబురుబంపినరామె మీాకాళ్లకడకు. 87

కం॥ శివనందనులుస్వయమ్ముగ, నవరికిదర్శనమునిచ్చిరే యేయెడలన్
భువిధన్యులు త్రిపురాసురు లవుదురుగాకిటకు మున్నయటుగాకున్న. 88

గీ॥ ఏమివనిగల్గివచ్చితి రెఱుకపడద, యానతీయుఁడు చేయగానలవియగునొ
కాదొయనునంతవారలఁ గాంచిపలికె, విఘ్ననాథుండు మధురగంభీరఫణితి. 89

కం॥ పినతల్లికొమరులంచును, గనికరమునుగనక పెద్దగాఱించుటయే
ఘనముగఁ దలంచువారల, ననఘులుగా రనుచుఁ బలుకనగునా? మాకున్. 90

గీ॥ ఏలయమృతాంధసులపైనినింత కనలు, వారి రాజ్యమ్ము వారికిఁ బంచియిడుఁడు
పరమపాశుపతవ్రతపట్టభద్రు, లయినవారికి నిదితగినట్టిపనియె?. 91

గీ॥ ఎవనిసేవించి నేఁటికినింతవార, లయితిరో సుంతతలపోయుఁ డాత్మలందు
వానిశాసనధిక్కార పాపఫలము, మీకు రాకుండఁ గాత సుశ్లోకులార. 92

మ॥ అన రక్తాంధసులుల్కి చూచి తగునయ్యా! యిట్లు శాసింప శం
భునిగాదందుమె యెన్నఁడేని నెపుడీ ముల్లోకముల్ దేవతల్
గొని యేలంగను జూచుచుండఁగల మే గుర్కిళ్లలన్మ్రింగుచున్
మునుమమ్మెంతయు గాసిపెట్టుసురలంబోనిత్తుమా యింతటన్. 93

మ॥ ఎవరో యొక్కరె యేలఁ గావలయు గానీ! మేమునవ్వారు నీ
భువనమ్ముల్ పరిపాలనల్ సలుపుటల్ పొల్లౌచు గుర్తింపుఁడీ
యెవఁడాయింద్రుఁడు బ్రహ్మయెవ్వఁ డిటఁ దా నెవ్వండు విష్ణుండు నా
భవుఁడైన న్మము నేమిసేయు సురలం బాలింపఁ జేపట్టియున్. 94

సీ॥ శివునిపుత్రకులంచుఁ బూజించినార, మవుర క్రేలాడునీ చేట చెవులవాని
కాలు మోములకుట్టని కడలి కాదు, భండనము సేయగలదేని రండు వెలికి. 95

కం॥ అనఁ గినుకగదురునగవునఁ, దనయున్నను నాఁగి యపుఁడు దారకహరణుం
డను నోలుబ్ధకులారా, చనిపోదురె యుఱకమీరు సంగ్రామమునన్. 96

కం॥ కనుమూసి తెఱచులోపల, జనియించుహరించు సకలజగములు ఫాలా
క్షునితోడి కయ్యమనినన్, వెనుకాడరు మీరలెట్టి వెరవరులయ్యా. 97

కం॥ వెనుకటిరణపరికరమే, యనుకొంటిరొ కాక తెలిసియదిలక్షింపన్
బనిగొనరొ కాకయీశ్వరు, కనుమంటకుమిడుతదండుగఁదగవగునే. 98

కం॥ సిరిరామోఁకాలడ్డం, దొరకొను మూర్ఖులను గనలిదూఱఁగ నేలా
త్వరపడుకుతరుణమిదియే, హరుశరణముఁజెందిబ్రదుకుఁడసురులు వేగన్. 99

గీ॥ వెఱపుగల్పించియైన జీవితములిడఁగఁ, దలఁచిగావించెశంభుండు ధరణిరథము
మేరుకోదండమింకనమేమయుద్ధ, పరికరమ్ములనాబారి బ్రదుకఁగలరే. 100

వ॥ అని వెడవెడవొడము కినుకంజేసి యంతనుడుగక. 101

శా॥ తానైవచ్చు గణాధినాథునెమటం దర్పించిభాషించు మీ
మానప్రాణములింతదక్కె నిటుపై మన్నింపఁగావచ్చునే
తానైచంపఁగఁ జేతులాడకిటు వాత్సల్యమ్మునంజేసి యీ
శానుండిచ్చినయానతిం జెఱుపఁగా సంసిద్ధతం గంటిరే. 102

శా॥ విన్నన్నొమ్మన్నను గాళ్లవ్రేళ్లఁబడి మన్నీవైనమాత్రమ్మునన్
గన్నుంగానరుగాక దైత్యులిదె యీగర్వమ్ము దూలంగ నా
సన్నమ్మయ్యెనుయుద్ధ మీశ్వరశరజ్యాఘోరనాదమ్మునన్
విన్నఁబోదురొ, ఖిన్నులేయగుదురో, వీర్యమ్మిచాటింతురో, 103

వ॥ అటుచాలి నిలిచెదరుగాక, యని మఱియు. 104

శా॥ నన్నే మన్నసహింతుగాక తెగువన్నా ముందటం బూజ్యు మా
యన్నన్ సర్వకళాస్వరూపుఁ ద్రిజగద్వ్యాపారనిర్వాహున్నతా
భ్యున్నత్యర్ధసమర్పితాంఘ్రియుగు దంష్ట్రాదారధారావరి
చ్ఛిన్నగ్రీవగజేంద్రదైత్యు ననఘుం జేటాడ సైరింతునే. 105

శా॥ అన్నన్నప్పుడు వారలిట్లనిరి మీయన్నయ్య నేకాదు వే
నిన్నుం గూడ నొకింతయే మెఱుఁగమా నీతండ్రియా పౌరుష
మ్మెన్నం జేసియు విస్మరింపఁగలమా యీరోసమేలయ్య మీ
యన్నల్ వేవురు మీరు వేవురును రండయ్యా రణాగ్రమ్మునన్. 106

శా॥ దేవానాంప్రియ శాశనమ్మునకు భీతిన్ లోఁగు వారంచు మీ
భావమ్మందును దోఁచెనేమొ త్రిపురీపట్టాభిషేకక్రియా
శ్రీవర్ధిష్ణులు రాక్షసోత్తములు నిస్సీ! యెందుగుం దేటికిన్
గ్రీవమ్మిచ్చు నపారమేయశిశువుల్ గిట్టాడి పట్టాడ దే. 107

కం॥ వంకరటింకర గుణమా, యంకింపఁగరాని ధర్మమడి యొక్కటియా
జంకుటయు జమగలినపుం. బింకమ్మున కౌర యెట్టివింతలు పుట్టెన్, 108

ఆ॥వె॥ అరదమింతయింత యదుకులప్రోవంట, బడుగు తాతబండి గడుపునంట
నీటఁ జిలికియున్న మేటి బాణమ్మఁట, బ్రిమకవచ్చు నెటుల రాక్షసులకు. 109

ఉ॥ కోపము లేదు మీరు పసికూనలు గావున మీదు మాటకున్
రేపటసంగరమ్మునఁ వరింపఁగ రండు జయేందిరం బడా
టోపము లేల మెచ్చుట కుభుంతి వినాయక కావపూపముల్
పాపకుమార తాగ్రుటకుఁ బాలురుగావివి యస్త్రశస్త్రముల్, 110

వ॥ అని యల్లసమ్ముగాఁ బలికిన వారిం గనుంగొని. 111

శా॥ ఈషదోష్ఠవికంచితాస్యుఁ డరుణద్వీపాదరస్మేరుఁడై
భాషించెం గజవక్త్రుఁ డీశ్వరకృపావాక్యమ్ము లెల్లమ్ములో
ఘోషింపన్ ఫణిరాజసుందరఫణా కూరాత్మకుండాగ్రభా
గేషచ్చాలనపుష్కరధ్వనివచో హేవాకపాకమ్మునన్. 112

శా॥ ఈ యైశ్వర్యము నీబలమ్మీ విభవమ్మీ సర్వసౌభాగ్య సు
శ్రీయెల్లన్ హరుకంటినుంటగయి యర్పింపగనున్నారె మీ
శ్రీయమ్మంగణినుంచి చెప్పెదను నిశ్శ్రేయమ్ము వాంఛించువో
వేయేలా సమరాంగణమ్మున కికన్ విచ్చేయుఁ డిష్టార్థమై. 113

ఉ॥ ప్రల్లదముల్వచించుటకు బాలకుఁడీశ్వరశాసనమ్ము మీ
కెల్లనుసమ్మతమ్మగునొ యేర్పడఁజెప్పుఁడు కాదొ కానిచో
నెల్లయభీష్టముల్ సరిగనిప్పుడ మీరలుదీర్చికొందు రం
డెల్లిరణాంగణమ్మున సమీహితకార్యము నిర్వహింపఁగా. 114

కం॥ అనుటయునొండొరుమొగములఁ, గనుఁగొని పురదైత్యవరులు కలకలనగుచున్
వెనకయ్యతోడఁ బలికిరి, వెనుచూపును ముందుచూపు విశదముగాఁగన్. 115

శా॥ ఓవిఘ్నేశ్వర యెల్లభోగములయం దొక్కింతలోపమ్ములే
కీవిశ్వమ్మున నేక కల్పములు మే మేకాతపత్రమ్ముగా
శ్రీవర్ధిల్ల భవత్కృపావశత శాసింపంగఁ గన్నార మిం
కేవాంఛల్మదిలేవు నున్నదొకఁడే యేతెంచెనాకోర్కెయున్ 116

అద్ది యెయ్యది యంటేని. 117

ఫాలాక్షుండటులంత వాఁడుదమపై బ్రహ్మాండనిర్మూలనా
భీలమ్మైన మహాప్రయత్నమున దావిచ్చేయ యుద్ధార్థియై
తూలంబోరుపురాసురుల్ హరుని యాదోర్దండచండక్రియన్
మేలంచున్ సడిజెందిచచ్చు టయినన్మేలౌను మాబోంట్లకున్. 118

శా॥ సారూప్యమ్మను గోర మెవ్వరమునున్ సాలోక్యసామీప్య వాం
ఛారాగమ్మనులేదు మామనములన్ సాయుజ్యసంసిద్ధియే
కోరంబడ్డది యద్దిగూడ నిటుచేకూరంగనున్నప్డు ని
స్సారమ్మైన భవమ్మకై యెవఁడుచేసాఁచున్ గణాధీశ్వరా. 119

ఉ॥ మాటకుమాటవచ్చి యభిమానముపెంపున మిమ్ముఁబూజ్యులన్
నోటికివచ్చినట్లనిన నూతనదోషమునున్ క్షమింపఁగా
మాటికిమాటికియ్యవెనమస్కరణమ్ములు వోయిరండు మా
మాటగనిశ్చితార్థమును మాపతికిం దగవిన్నవింపుడీ. 120

కం॥ అనునాదైత్యప్రవరుల, వినిశ్చితార్థమ్ముఁదెలిసి విస్మయపడుచున్
దనమదిమెచ్చెఁ గుమారుఁడు, వినాయకుండును దదీయవిజ్ఞానమ్మన్, 121

ఆ॥వె॥ ఇట్లుమెచ్చివారలేకవాక్యమ్మగాఁ, బోయివత్తుమన్నఁ బుణ్యజనులు
వారిగారవించిపనుపంగఁ జేరిరా, హరునిసుతులు వేగ హరునికడకు, 122

ఆ॥వె॥ చేరివిషయమెల్లఁ జెప్పినసర్వజ్ఞుఁ, డేమి యేమియనుచు నెసనుమెచ్చె
విస్మయమ్మపడిరి విబుధులుప్రమథులు, దైత్యవరులనిశ్చితమ్మ తెలిసి, 123

—※ రక్కసిరాయబారము. ※—

వ॥ అంత నావీటివారెల్ల వారేయిఁ ద్రిపురవిశేషమ్ములు, వారిబలగౌరవమ్ములు, భక్తిభావమ్ములు, సదాచారసంపదలును, శివనందనవచోమృతమ్ములందని వారవిని, విని, విస్మయమాన మానసమ్ములు, నిట్టివారినారొక్కనఁగంటిమనితలంచి రంతవేసటయు సర్వసన్నద్ధులై, యథాచారమ్ముగ యుద్ధమ్మునకు వెడలునెడలఁ, ద్రిపురాసురుల యనుమతమ్మున నొక్కదూతవచ్చి సముచితమ్ముగాఁ బరమేశ్వరుసందర్శించి వినతుండై యిట్లనియె. 124

సీ॥ అర్థులయ్యునుమీకుఁ బ్రత్యర్థులయిన దనుజవరులను సైరింపఁ దలఁప మిమ్మ
వేడుచున్నారలీయుద్ధభిక్షనొసగ, ననుమతింపఁగనమిత్రోత్తమాంగులగుచు 125

శా॥ దైత్యధ్వంసియజస్రరక్షితసుధాంధశ్చక్రచక్రాయుధ
స్తుత్యాత్మీయపరాక్రమక్రముఁడు నాశుద్ధాంతసీమంతినీ
నిత్యారాధనతత్పరుండు త్రిజగన్మిథ్యాప్రచారుండు దా
నత్యుత్సాహముతోడవచ్చె నె రణవ్యాపారముల్ సేయఁగన్. 126

కం॥ ఏకడలిఁజొచ్చినాఁడో, యేకంబముదూఱినాఁడొ యేకలమయిదా
నేకొండకానడాఁగెనొ, వైకుంఠుండింక బ్రదుకవచ్చునెతనకున్. 127

వ॥ తుదినొక్కమాటగలదవధరింపుము. 128

కం॥ మిముఁగెలుచు భాగ్యమిదెవో మమునీలోఁజేర్చికొనుచుమన్నించెదవో
సనుమీారెఱుకను మాకని తమకోనరమునిరి త్రిపురదనుజులు దేవా 29

కం॥ ఆమాటలువినునెడలన్, నామేనుపడంకె శరధినలుగడఁదిరుఁగం
గామన్నన నమఁగైకొని, సోమకళాధరుఁడు వీరసుందరుడగుచున్. 130

వ॥ వానింగనుంగొని. 131

కం॥ నా శరధిఁజొచ్చియున్నాఁ, డాశరధిశయానుఁడితఁడెయసురకులప్ర
ణాశనగములఁగొనధర్మని, యాశుగరూపమ్ముబోని యాశుగమగుచున్. 132

కం॥ ఆశరులతోడననుమీా, యీాశరమునుగాంచి యయ్యెనిపుడనర్థ
మ్మీాశరధియుండుఁగొనునిది, యాశాచరులైనవారి యనువులనెల్లన్. 133

కం॥ చనుమిఁకనీవువారల, మనవినిమన్నింపవచ్చె స్మరహరుఁడనుచున్
వినుపింపుమనుచుఁ బలికినఁ, జనివినియాతండుదెలిపె వారికినెల్లన్. 134

ఉ॥ పూర్వసుపర్వులంతటనపూర్వపరాక్రమ వీర్యమున్యులన్
దుర్వహశౌర్యగర్వబలధూర్వహులార్యుల హార్యధైర్యులన్

గుర్వనుభావులెల్లరు, వినూత్నవధూగ్రహణాభిరాములై
పర్వ విలాససంపదలు వర్ధిలఁగా గుమిగూడియొక్కటన్. 135

మ॥ భవసందేశసమిజ్జ్వలద్దహన దుర్వారక్రుధాభీషణీ
భవదాస్యుల్ భవదాస్యబంధహరణప్రౌఢప్రభావోన్నతుల్
భవశంభోజయవాదముల్ సమరభూప్రస్థానభేరీధ్వనుల్
వివిధామ్నాయపదమ్ములొండొకటితో వియ్యమ్ముసంధింపఁగా. 136

మ॥ హరిహేషల్ గజఘీంకృతుల్ సుభట సింహారావముల్ నేమిని
ష్ఠురఘోషమ్ములు చాపటంకృతులు విస్ఫారజ్జత్కారాళ ప్రభా
తరవారి గ్రహణప్రకార జనితధ్వానమ్ములున్ మ్రోయ వ
చ్చిరి నాశీరముఖమ్ముఁజేర నసురశ్రేష్ఠుల్ పురాధిష్ఠితుల్. 137

వ॥ అంత. 138

— ✻ త్రిపురాసుర యుద్ధము ✻ —

కం॥ ఆసైన్యమునీసైన్యము. డాసెంగల్పాంత కటుపటహనా దమ్ముల్
రేసెంబరస్పరమ్మును. భాసిలెవీచీగభీర వారాన్నిధులై॥ 139

శా॥ మున్నెన్నండు నెఱుంగనా దితిసుతప్రోద్దామయుద్ధమ్ము లా
సన్నాహమ్ములు యుద్ధపద్ధతులు శస్త్రశ్రేణు లస్త్రమ్ములా
విన్నాణమ్ములు వింతవింతలగుచు న్వేయేల మాకెల్లనున్
గన్నుల్ చీకటిక్రమ్మె నొక్కత్రుటిలో గర్వమ్ముఖర్వమ్ముగా॥ 140

శా॥ ఆవేళన్గజ వక్త్రుఁడున్మదరణ వ్యాపారధౌరేయుఁడై
శ్రీవమ్మై త్రిపలాయమానసుభటశ్రేణిన్ విగర్హించి శుం

డావేగమ్మున ఫూత్కరించి నిలిపెన్నిలింపవిద్రోహులన్
దేవజ్యేష్ఠులు నిల్చిరా వెనుకమందీభూతచైతన్యులై॥ 141

మ॥ అదిసైరింపక రాక్షసప్రవరులుద్యత్సింహనాదార్భటిన్
మదహస్తీంద్రము లెక్కి సంకులశరామర్దమ్ము దుర్దాంతమై
చదుపన్విఘ్నవిభుస్ఘోరతర శస్త్రచ్ఛిన్నుఁగావించి స
మ్మదముంజెందియొనర్చిరంత మరలన్మత్తేభవిక్రీడలన్। 142

శా॥ ఆవిఘ్నేశుఁడు నాగజేంద్రములు శుండాఘాతభీతమ్ములై
పోవంద్రోలుచుఁగాలఁగేల రిపులంబోనీక మట్టాడుచున్
చేవంగ్రమ్మఱు వారలన్విసరివైచెన్ ఘోరవారాశి వీ
చీవిక్షోభగతాసులై చనయనిస్సీమప్రతాపమ్మునన్॥ 143

శా॥ అంభోరాశిని వేయఁగాఁబడియు మాయాదక్షులా రాక్షసుల్
కుంభీంద్రాస్యుని పైకిదూఁకిశరముల్గుప్పించి నొప్పించి రా
శుంభద్వీర్యము మెచ్చుకొంచు మదవచ్ఛండాసముద్బంధనన్
శంభుజ్యేష్ఠసుతుండు మించిసలిపెన్ శార్దూలవిక్రీడనల్॥ 144

మ॥ శివవిష్ణుప్రథితాంశసంభవుఁడు రాశీభూతకోపాగ్ని భై
రవుఁడుగ్రాహవపండితుండు నఖధారాచ్ఛిన్ననీరేజసం
భవమూర్ధానుఁడు భస్మసాత్కృతమహాబ్రహ్మాండభాండుండు
రవవాహమ్మును నెక్కి దావెడలెసంగ్రామక్షమాసీమకున్॥ 145

అ॥ వె॥ గ్రామసింహమెక్కి కదనమ్ముఁజేయుఁగా, వచ్చెననుచు దైత్యవారణేంద్రు
లొక్కపెట్టుదాఁక నుక్కడఁగించె సం, గ్రామసింహుఁడగుచు స్వామియంత॥ 146

శా॥ ఏకార్ధమ్మునవచ్చి పైబడిరి తారేమందు మాచందముల్
రాకాసుల్ లయభైరవాకృతిసమప్రజ్ఞాప్రతాపోన్నతుల్
మూఁకల్మూఁకలుగాఁగ వారిఁద్రుటిబోఁ గార్చి చేకూర్చెఁదా
నేకాంతమ్మును నాకలోకమనయుం దేకైకబాణమ్మునన్। 147

వ॥ ఆ సమయమ్మున మఱియుం గండుఁదనమ్మున మిగిలి మూఁగిన యారక్కసుల నుపలక్షించి. 148

కం॥ ముద్దాడు నరుమొగములఁ బెద్దయుఁ గోపమ్మ గదుర భీషణముఖుఁడై
యుద్దామశక్తి యీశ్వరు ముద్దుకుమారుండు తలకుమూఁపులుగడవన్॥ 149

ఉ॥ వచ్చెనో లేదో యాదెసకు వ్రస్సెడు డస్సెడు చచ్చునొచ్చునై
న్వ్యచ్చయమెల్లఁ జూచి వెఱఁగొందియొకించుక తేరి రక్కసుల్
మెచ్చితిమోయి నీబలము మేయము నిల్వుము పారిపోక నీ
యిచ్చినయప్పుదీర్చెదమిదే కైకొమ్మని యార్చిగ్రచ్చఱన్॥ 150

కం॥ మచ్చరము హెచ్చఁ బయిఁబడి గ్రుచ్చిరి పటుబాణ పటలి కొమరుతనువునన్
వ్రచ్చిరి శిఖావళమునది చెచ్చెఱ నఖతుండధారఁ జీలిచె వారిన్॥ 151

శా॥ ఆలోనం జనుదెంచె భద్రుఁడసురవ్యాపాదసంపాదనా
శీలమ్మైనమృగేంద్రవాహమున నవ్వీరున్నివారించుచున్
గేళీసుందర విగ్రహుండగుచు నాకేశధ్వజుఁడంతలోఁ
గూలంద్రోసె సురారులన్ శతసితక్రూరాత్మ భల్లములన్। 152

కం॥ ఒండొరులఁ బిలిచి రాక్షసశుండాలురు సింహవాహ క్షోభితులగుచున్
జండరయమ్మునఁ గవిసిరి, చెండాడఁగ భద్రునతని చేహతులయ్యున్॥ 153

కం॥ ద్విరదములరదములయ్యెను నరదములురదయ్యె హరులుహారములయ్యెన్
సురవైరియసురులాసం గరముఁగరమ్మగుచుఁగనదు కదనము నెందున్॥ 154

ఉ॥ చచ్చిరిచచ్చిరన్న నిశిచారులెక్కమ్మఁజి వచ్చుచుండఁగాఁ
నచ్చెరువయ్యె నాపురములందుఁగలట్టి సుధాసరస్సులో
జొచ్చెనుమాయధేనువయి చొచ్చిసుధారసమెల్లగ్రోలె నా
మచ్చులమాయలాడు బలమర్దనుఁడీశ్వరశాసనమ్మునన్॥ 155

చం॥ అలసెఁగుమారుఁడించుక గజాననుఁడుండల యోరగించెఁదా
సొలసెను గాలభైరవుఁడుచూపొక యింత మరల్చెఁభద్రుఁడా
కలకలమందు రాక్షసులు గర్వితులై మినుముట్టఁదాఁకుచోఁ
బలపలనయ్యె భూతభటవారములొక్కభుఁడు నంతనవ్వుచున్॥ 156

—※ త్రిపురాసుర సంహారము ※—

శా॥ రక్షోవీరులకామితమ్ము నెఱవేర్పంబూని, తానై, సమిత్
భిక్షాదానముసేయఁగానరిఁగె నుర్వీస్యందనారూఢుడై
చక్షుశ్శక్రూర సువర్ణచాపవిలసచ్చక్షుశ్శ్రవోజ్యాధ్వనుల్
రక్షఃకుక్షి విదారణమ్ములగుచున్ బ్రహ్మాండముల్ నిండఁగా॥ 157

సీ॥ కనుమూయఁగారాదు,కనుమూయజగమెల్లఁ,బ్రళయాంధకారనిర్మగ్నమగును
గనువిప్పఁగారాదు కనువిప్పబ్రళయాగ్ని మండునుబ్రహ్మాండభాండపటలి
చేసాఁపగారాదు, చేసాఁచెనేని, యు, నాశాగజమ్ములల్లాడిపోవు
హుంకరింపఁగరాదు, హుంకరించెనయేని, గళకాలకూటమ్ముకాల్చుజగము,

గీ॥ చిత్రిమే లోకమునుగస్తిఁజెందకుండఁ, ద్రిపురదానవ సహాయుద్ధకపటహోష
వేషభీషణుఁడయ్యెన శేషభువన, కందుకక్రీడనాగార గర్భభరుడు॥ 158

శా॥ ఘోరమ్మైన తదీయయుద్ధమున నా క్రూరాత్ములా రాచ్చరుల్
దోరుత్క్షిప్త మహాస్త్రశస్త్రనిచయుల్ దుర్వారవీర్యక్రముల్
వైరమ్మింతటఁదీరె పొమ్మనుచు శుంభద్వేగులై తాఁకిరా
శూరుల్ శాంభవవాహినిం దఱి రుధిరస్రోతమ్ముల న్దేలఁ జుమ్॥ 159

సీ॥ వేదాశ్వముల నెక్కి విటతాటనమ్ముగాఁ, దాండవమ్మాడెడు మండలీంద్రు
తాతగడ్డము దువ్వి, చేతితోత్రములాగి, పరిహాసించెడు పోటుబంటుమగలు
రథచక్రములు కూబరము బట్టి యాడింపఁ, బంతగించెడి వింత హాంతకారు
లా వేగమునఁ గేతనాగ్రమ్ముపై దూకిఁ, విలుగఁ ద్రొక్కఁగ జూచు మొఱకువారు

గీ॥ నయిన తిగప్రోలి రక్కసియా గడములు, గడపశక్యము గాదయ్యెఁ గలనిలోన
వీరవారమ్మునందు నెవ్వారికేని, శంభుఁ డేమంచుఁ దలఁచెనో స్వాంతమందు॥ 160

గీ॥ కానిపౌరుష మెక్కడ లేనిబలముఁ, బూనిమూఁగిరి యామూకఁ మొగ్గతిలగ
వీరభైరవహేరంబ తారకాఖ్య, లధికసంరంభకటుకోప విధురులగుచు 161

కం॥ సైరింపరించుకేనియు, నారింపరు వారిధాటి వరదర్పమునన్
గారింపరు దారించరు, వారలవీరమ్ము దైత్యవరులయ్యెడలన్॥ 162

కం॥ ఆదిమకోదండగురుం, డాదైత్యులబలము చలము నటు చెల్లంగాఁ
గాదని సువర్ణపర్వత, కోదండము నెత్తి కురిసె ఘోరశరమ్ముల్॥ 163

కం॥ కురిసినఁ బిఱుదివియకయా, గిరికోదండమ్ము నెక్కి క్రీడించిరియా,
పురదైత్యులెంత వారో, విరించనుఁడు నొగలిమీఁద వ్రేలెవివశుఁడై॥ 164

వ॥ ఇట్లు కుక్కి మిఁగిలిన యా రక్కసులను గంటిమి, మా కక్కజమ్మును వెక్కసమునయ్యె. నయ్యెడ ధనుశ్చాలనమ్మున వారిం దూరమ్ముగాఁ బడవైచి మెచ్చినచిత్తమ్మున, నొచ్చిన తనువున, మచ్చరమ్ము చ్చుపడు చూపులఁ దూపులఁ గయికొని. 155

కం|| దరహాససుందరుండై, యరదము పైనున్న యసుర లఱవఱఁబఱవన్
శరవర్షమ్ములఁ గురియుచు. విరించి లే నెత్తి, తేర్చి విభుహూళిదమున్|| 166

వ|| వేగంటి వింటిఁ జాఁటిచింటలాఁగి హాలాహలజ్వాలాపీలమ్ములగు శరజాలమ్ములం గుప్పిన,
విచ్చియు, నొచ్చియు, వెఱచియు బఱచియు, గనుకనిస్వేను వెనుకొఁదిగియు చీకాకైన నా
రాకాసి మూకలఁబోకార్చు నుపాయమ్ము నరసియమ్మహాయోగీశ్వరుండు. 167

కం|| హుంకారమ్మొనరింప స, హంకారముదక్కి చొచ్చిర సురులుపురముల్
టంకారభీషణుండై, శంకరుఁడా వేఁటఁదగిలె జయఁవెట్టసురల్|| 168

చం|| పురములఁజొచ్చి గొల్చిరల పుణ్యజనుల్ శరధిప్రభూత, మీ
శ్వరకరుణా ప్రసాదితము శాంకరలింగ మనంతభక్తిమై
పురదనుజాంగనల్ దమదు పుణ్యసతీత్వము రిత్తరయాటమున్
గరముభయమ్ముఁజెంది క్రతుఘస్మరు సంస్మరియించిరత్తరిన్|| 169

కం|| ఆవేళనొకటఁజేరిన, దైవద్రోహుల పురీవిదాహము సేయన్
భావించి నన్నువింటన్, గావించెను సజ్జమపుడు గరగళుఁడంతన్|| 170

చం|| పురములనుండి ఘోరశరపూరముఁజిమ్ముచు దానవేశ్వరుల్
గిరివరకార్ముకుంగదియఁ గేవలవీరరసోజ్జ్వలాకృతిన్
స్మరపరిపంథినేత్రితటజాజ్వలదగ్ని సమగ్రమున్ శివః
పరచితమూలమున్ దిగిచివైచెను మన్మయమైనబాణమున్|| 171

కం|| కోపమ్మొక్రతుఘస్మరు, కోపమొ చాపమ్మొ, వెడలి, కుటిలారిఘటా
టోపప్రతాపశమ, యమ, రూపమొ త్రిపురములఁగాల్చె రూపణఁగించెన్||

శా|| అందా రాక్షసపూజితమ్మగు నలింగాకారమొప్పెన్మధు
స్యందిశ్రీదళ కుందపుష్పతులసీ ప్రస్ఛంద నాలంకృతుల్

కంఠమ్ముల్ సఫలమ్ము సేయఁబురరక్షః స్సంఘ తేజమ్ము, నా
యిందూత్తంసుని యందుడిందెనపుడే యెంతేని మోదమ్మునన్॥ 173

కం॥ మంగళము సర్వమంగళ, మంగళవిగ్రహునకమృత మయమధురకృపా
పొంగునకు నంగజారికి, గంగాసంగోత్తమాంగ కమనీయునకున్॥ 174

సీ॥ మంగళం తేసర్వ మంగళాహృదయాబ్జ, మధుకరేంద్రాయ, నమశ్శివాయ
వందనమస్తు తే, వందారుజనబృంద, మందారతరవే. నమశ్శివాయ,
ఫణిఫణామణిరత్న భాసురదేహాయ, స్మరశాసనాయ, నమశ్శివాయ,
ముగ్ధేందుచూడాయ మునిమనస్సంగాయ, మద్రిశుకాయ, నమశ్శివాయ,
గీ॥ మత్తదనుజేభహారయే నమశ్శివాయ, మలినతామిస్రహరయే, నమశ్శివాయ.
మార్గణీభూతహరయే నమశ్శివాయ, సకటకేస్థితహరయే నమశ్శివాయ॥175

కం॥ నిట్టూర్పులుతురగములా, మట్టెయె. యరచమ్మ! కడపుమానిసితాతా
ముట్టినబస్సనుగుణమా, యెట్టుజయించితివి దేవ! యాత్రిపురములన్॥ 176

ఉ॥ పట్టినయట్టికొండయొక బంగరువిల్లయిపోయె, దానికిన్
గట్టిగనారిదు జిహ్మగజగత్పతియయ్యెను, నెక్కుపెట్టఁగన్
దొట్టునజిహ్మగమ్మదియు దనుజాంతకమైనలక్ష్యమా
పట్టణముల్ విభిన్నమయి భస్మముగావె పురాణధన్వికిన్॥ 177

కం॥ అచలరథమచలధనువును, నచలేశ్వరమైనశరము నాఘాతమునన్
బ్రచలత్పురములఁగాల్పఁగ, నచలేశ్వరు నిల్లత్రికపుటల్లునకెత్రగున్॥ 178

కం॥ వేదండాననగురుఁడవు, కోదండాగమపురాణ గురుఁడవు నగనీ
పాదాంభోజమరందా, స్వాదముదయ సేయఁగదవె శంకరమాకున్॥ 179

క॥ శరధిశరధియనియన, నం, బరాంబరుండనఁగ మదనమదనుండనఁగా
సరికాలకాలుఁడనఁ బుర, హ, హర, నీసాటినీవె యగుదువు రుద్రా॥ 180

క॥ స్తుతియింప నెంతవారము మతినాఁగనిసంతసంపు మాటలెకానీ
కృతసుర రక్షణునకు మా, కృతజ్ఞతాసూచకములు కేవలము శివా॥ 181

శా॥ సంప్రార్థింతుమజస్ర తావకపదార్చారూఢ వ్యాప్యాని రాట్
సంప్రాప్యమ్ములు, పుణ్యమైయుపరత వాస్యంతానవీచీయశ
స్సంప్రశ్నమ్ముల శేషలోకనుచిరశ్వ శ్రేయసమ్ముల్ నమత్
కింప్రార్థహరమ్ములౌ వెలుఁగులందింపంగ విశ్వేశ్వరా, 182

మ॥ సభరమ్ముల్భవసంగతుల్ శివనమశ్శబ్దార్థముల్గాఁడ దే
వ భవత్పాదము నందనిత్తుము యవప్రాయమ్ముగా మోహమో
యభవా! నీకు నిరంకుశోన్మదమనో వ్యాపార మత్తేభముల్
శుభవస్త్రార్థము పీనిఁగైకొనుచు మెచ్చుంజూపు సర్వేశ్వరా!॥ 183

శా॥ నీ యిల్లాలికిఁగాన్కలిచ్చెదముతండ్రీ! చిత్తశార్దూలముల్
మాయాక్రూరవిహారముల్ కృతమనోమత్తేభ సఖ్యమ్ములున్
శ్రేయఃకామగవీవిదారణములున్ శిక్షించిమన్నించుఁడీ
మీయంఘ్రిస్థిరపుణ్యసంగమిడిసామీ! మమ్ము మీదాసులన్॥ 184

గీ॥ స్వామిమీముఖచంద్రదర్శనమువలనఁ దనరుమాముఖకుముదకాననమువిడిచి
చెలఁగిమీపాదపద్మముల్ చేరుతేటి తేటగీతులుచిత్తాబ్జతృప్తినిడవె॥ 185

ఉ॥ చంపకనాస పద్మముఖి,సారసగంధి,నవోత్పలాక్షి, సే
వింపఁగమిమ్ము వచ్చె రసవిశ్రుతవృత్తి! భవన్మనమ్ము రం
జింపఁగఁజాలునావిబుధశేఖర! రాజవతంస! యైన మ
న్నింపఁగదయ్య మాపలుకు నిర్మలభక్తిభరన్ సరస్వతిన్॥ 186

శా॥ అంచుం బ్రస్తుతియించుచుమ్మదయతో నాశీర్వదించెం దథా
స్త్వంచునాత్రిక్షుసపూజితమ్మగుచుఁ బున్యామ్నలింగమ్మునున్
బంచబ్రహ్మమనుస్వరూపమనుచున్భాగించెనస్త్రమ్మునన్
బంచారామములందునిల్పియవియున్భక్తాళికల్పాళిగా॥ 187

కం॥ ఉపసంహారించెనీశుఁడు త్రిపురాసురహరణకృతపరికరము నెల్లన్
గపటముని వేషదోషము నపుడేఁగాంచీశుఁగొలువనడఁగెనుబిదపన్॥ 188

కం॥ ఇదిత్రిపురాసురవిజయము విదితమునిఖిలాగమాంతవిశ్రుతమగుటన్
జదువవినఁగనినవారల కొదవించునఖండవిజయమున్నతపదముల్. 189

చం॥ అమలినమానివృత్తినిగమాగమకోవిదలింగయూనధా
న్యమృతపయోధిజాతకమలాలయదార్ఢ్యచరిత్రదుర్గమా
విమలమనోంబువాహపదవీశరదాగమసారకౌముదీ
రమణునితోడభవ్యగుణరత్నమహోదధితో సుధీంద్రుతో॥ 190

కం॥ కింకవికరిపంచానన వేంకటసుకవీంద్రహృదయవీధీగగనా
లంకారశారదీయమృగాంకునితో మల్లికార్జునారాధ్యునితో॥ 191

స్వాగతము:-- శీలరమ్యగుణసింధునితోడన్
బాలచంద్రధరభక్తునితోడన్
శాలపేశలతనుభూసురలక్ష్మీ
శాలితో మతివిశాలునితోడన్॥ 192

మ॥ హరపూజాపరమేశ్వరుండయిన మల్లారాధ్యపౌత్రుండు, సు
స్థిరభక్తిం దమతండ్రిపాదములవాసింగూర్చి కాంచీపురీ
శ్వరమాహాత్మ్యమునందు మూఁడవడియాశ్వాసమ్మ దీనిన్మహే
శ్వరుఁడా సూర్యమునాసముద్రమును, శశ్వత్ప్రీతిఁ బాలించుతన్॥ 193



# కాంచీఖండము.

చతుర్థ ఆశ్వాసము — 224 పద్యములు.



కం॥ శ్రీమహితబహుళశిష్య, ప్రేమార్ద్రపదాంబు జాతరేఖాఘటిత
శ్రీమహితవిభవుతోడన్, శ్రీమల్లారాధ్యపుత్రసింహముతోడన్. 1

కం॥ అని హరిచెప్పినయీకథ, మునులకువినుపించు సూతమునిఁగనుఁగొని య
మ్మునివృషభులనిరి యనఘా. యనంతరకథావిధానమది తెలుపఁగదే. 2

కం॥ హరిచరితపుణ్యకరమగు, హరచరిత పవిత్రకరమునగు నుర్వర శ్రీ
కరచరిత మోక్షసామ్రాజ్యరమాలింగన విశేషసౌఖ్యమిడదే. 3

వ॥ అని యడగిన వారలకా కథికుండిట్లనియె. 4

చం॥ ఘనతరభక్తిఁబొంగుచు జగత్పతివిష్ణుఁడు శంభుగాథలన్
వనిచిన వేడ్కఁబల్కెనెడ, నవ్వుమొగమ్మున భక్తిభావముల్
మునుకొనవాహినీశ్వరునిముద్దులపట్టి. మునీంద్రసంఘముల్
గనుఁగొని యాత్మవల్లభుని కాంతచరిత్ర మెఱుంగవేడుచున్. 5

కం॥ వల్లభుఁగనిలజ్జారుణ, ఫుల్లాంబుజవదన మధ్యమున వెడలు నుడుల్
మల్లడిగొనుచూడ్కులతో, నుల్లాసము మెఱసి యింత యొదిగినయమునన్. 6

కం॥ పురుషోత్తమనామమ్మది, చరితార్థమునీదుపాల జగతీశ్వర నీ
పురిటాలితనము మెఱసిన, చరిత్రవచియింపఁగదవె జలజాక్షయనన్. 7

—◆ ❊ దారుకావన విహారము. ❊ ◆—

క॥ చిఱునగవు తెఱలుగ్రమ్మం, గిఱికొను చూడ్కులను మెఱసి కృష్ణుఁడు విష్ణుం
డఱమఁగ మగనాలగుతన, తెఱఁగిటు లెఱిఁగించెఁ దేట తెల్లము గాఁగన్. 8

చం॥ మునులకు మూలకందము తపోవిభవమ్ముల కాటపట్టు శాం
తినిధిగుణాలమురు తేజము రూపముగన్నచోటు ధ
ర్మనిలయమాగమశ్రుతి మరాళనివాసము దారుకావన
మ్మననొక యాశ్రమమ్ముగల దాశ్రయమైసకలర్షికోటికిన్. 9

క॥ కర్మప్రధానవాదులు, నిర్మోహులు విమలనిఖిలనిగమార్థగవి
మర్శజ్ఞులచటిమానులు, దుర్మదలలితులుతపో తిఘూర్వాహులగుటన్. 10

క॥ ఆఋషితృతీయధర్మా. చారాధాకలు పవిత్రచరితలు దారల్
దారలు వారికిపౌరయగు, వారలునహిరూపపుణ్యాభానములందున్. 11

గీ॥ ఎల్లవేదార్థముల యెల్లలెఱిఁగియెఱిఁగి, పరమశాస్త్రార్థసారమ్ము లరసియరసి
వివిధజపతపమ్ములఁజాలవిసివి విసివి, కర్మబంధమ్ముహానులు గడవరైరి. 12

క॥ కర్మములంఘ్యమ్మెవరికిఁ. గర్మమె సమకూర్చుసుఖము కష్టము నిందున్
గర్మమెదైవమ్మని కడు, దుర్మత్సరులయిరి దైవదూషకులగుచున్. 13

గీ॥ వారిబోధమ్ముతలపట్టి వారువరు, కర్మబద్ధులుదైవ ధిక్కారపరులు
ఘోరకర్మలు హింసాప్రకారులగుచు. విఘ్నముఁదెచ్చిపెట్టిరివిశ్వమునకు. 14

శా॥ వామాచారపరాయణుల్ నిజసుఖవ్యాపారకర్మప్రియుల్
కామక్రోధవికారవంచితులు దుష్కాముల్ వికారాకృతుల్

స్వామిద్రోహులు వంచనాత్ములు పరస్వ స్వార్థవిధ్వంసకుల్
సామాన్యప్రజనోంచిరంతమును రక్షసుల్ నిరాఘాటులై. 15

కం॥ అళికమునఁగన్నుగలయా, లలితా ప్రాణేశునైన శిక్షింపరు మా
కొలఁదులవియేల గుడిలో,పలి లింగముగుడినిమ్రింగు వానికిథరమా, 16

గీ॥ అమరమోహినులఁగేస్తురాండ్రుత ప్మ,వార్యవర్తనఁదమమాటవణఁగిమణఁగి
చెలఁగిగృహలక్ష్ములగుచు రంజింపమనము, బలసిలెక్కింపరటఁద్రిమూర్తులను
మనులు, 17

గీ॥ వారిగర్వమ్ముశోలోకబాధనణపఁ, దలఁచియీశుఁడుదనసన్నిధానమునకుఁ
జేరననువెంటఁగొనిదుర్విశిష్టమునుల,యాశ్రమమ్మునకొకయింతయంతలోన.18

గీ॥ ఏనుజూచుమనుంటివానింతలోన, సర్వపత్యాభిరమ్యమ్ముసత్త్వమయము
పురుషసుందరమోహనమూర్తిఁదాల్చె, సుందరేశుఁడుసుందరసుందరుండు. 19

గీ॥ అల్లదాక్షాయణింబెండ్లియాడునపుడు కోరిహిమవంతుకూఁతుఁజేకొన్నయపుడు
తనదుశిరమునగంగమ్మఁదాల్చునపుడు నెక్కడేనియులేదట్టిచక్కదనము. 20

గీ॥ ఎత్తినాఁడమసురలకైయేమమున్న, మోహినీరూపమునుజగన్మోహనమ్ము
నెన్నియవతారములుగన్ననేలయఁచట, నపిపదాఅవకళకైననగునొకావా, 21

గీ॥ ఎందుఁగనుఁగొన్నవాఁడు సుందరేశు, మదనమదనమ్మురూపసంపదలెతోఁచె
స్తంభమునఁగన్న నరసింహదంభమెల్ల, నుడిగెఁబురుషోత్తమఖ్యాతి యొదిగి
నిలిచె, 22

గీ॥ చెప్పశిగ్గగుమన్న దాచిన్నెలిపుడు, హరునియర్ధాంగిపుణ్యమేమా!యటంచు
నేటిపౌరుషమింకయుంచునెంతకొంటి, వింతకోర్కెలుమదివిజృంభించెనపుడు 23

కం॥ ఆకాననమపుడమ్మధు, రాకారము, ముద్దుగొనఁగనలరుచు రాగ
మ్మేకాగ్రమైనచిగురుం, జేకొనచాపుటలుతోఁ జెఁజిత్రమ్మగుచున్. 24

కం॥ అదిగని సైరింపనిమది, మదనోన్మాదమ్ము చెలఁగ మైమఱచివడిన్
గదియించిబిగువుకౌఁగిటఁ, బొదివితినాసుందరేశు ముగ్ధత్వమునన్. 25

గీ॥ ఒక్కకలకంఠపతిప్రియయొదిగియొదిగి, సేయువాలాపములుమదిఁ జేరనీక
యెగచిననుఁగాంచి కాంచిగొంతెత్తికూసె, మదనుపూచినపువ్విల్లు చెదరినట్లు,26

వ॥ అప్పుఁడా సుందరేశ్వరుండు. 27

కం॥ నగుమోమునశిరమంటుచు, మొగముంబయికెత్తితగును బురుషోత్తమ నా
మగువతనముఁ దెలిపెదనా, నిగనిగలన్మేనఁజూచి నివ్వెఱపడితిన్. 28

కం॥ కనిమగువతనముగంటినొ, కనకేయిబుట్టైతినేమొ, కనికౌఁగిటికిం
గొనివైచితినో, కొనకైతినొ మునువెనుకలనెఱుఁగనైతి మోహాపుఁబలిమిన్. 29

సీ॥ పరమపావనగంగాప్రవాహలలిత, ధవళధవళమ్ముశివునిసౌందర్యమందు
మలినయమునాప్రవాహసంపదయుఁబోలెఁ, దనివినిడదయ్యె నాదుసౌందర్య
మపుడు 30

గీ॥ ఉండుఁగాకేమిగౌరి తానుండుఁగాక, గంగయేనియుఁగాంతుఁడొక్కరిధనమ్మె
యామహేశ్వరునర్ధాంగినగుటకేను దగుదుననుకొంటి దాంపత్యధర్మమునకు 31

శా॥ మోహావేశము బొంగిపొర్లనపుడాముగ్ధేందుకోటీరు నా
బాహాబద్ధునొనర్చిపక్షముపయిం బాలిండ్లుహత్తించి, నా
మోహాబ్ధింతయుఁదీఱమింబలుమఱున్ముద్దాడుచున్నాథ, యీ
దేహమ్మున్ స్థిరముంబొనర్పుమని యర్థింపంగృపాశీలుఁడై. 32

శా॥ కాని మోహనపురుషోత్తమా! ప్రకృతమీఁగ ర[illegible]మునా, దారుకా
వానిద్రోహుల గర్వభంగము నొనర్పంబోము నీ[illegible]
నీనిష్ఠాపరధర్మపత్నులమన మ్మోహింపఁ జూతు, నా
పైనిన్నీదు నభీష్టసిద్ధియనుచుం బల్కెంబు రారాతియున్॥ 33

వ అంత నేమను. 34

—※ మోహిని దారుకామునిసందర్భిల వంచించుట ※—

సీ॥ జాఁగాదనఁగ రాని యాజ్ఞను దలఁబూని, విడియును విడనట్టి యొడలితోడ
నడుగు ముందుకు లాగ నెపఁదవెన్క కుఁదోయుచుఁ, దోడిబడుగ మనమ్మునుదులతోడ
నలచూపు వెనుబడన లచూపు మునుకొన, మెఱుఁగులీనెడు మోము తెలఁగుతోడఁ
గౌఁగిలి యెడ బాటుగనుట కోర్వ విరితిఁ, బరికించు చనుదోయి మురువుతోడ 35

గీ॥ మునుల మానస గాంభీర్యమును హరించు, మించు మెలనూపురవళితో నించు కాలి
యంచకల కలరవము కొంచెంచి పలుకఁ, దళుకుఁజూపుల మునులున్న తావుసారఁగ।

గీ॥ శివుని యెడ బాయుసైఁపనిచిత్తమంత, నభవుఁదలపోసి గీతమ్ము నాలపించె
నాథదయ నేలునీ దాననన్న ననుచుఁ, బులకరింతలనొడలెల్లఁ బలదరింప॥ 36

కం॥ నాగానమ్మును విను నెడ, రాగము మొలకెత్తి హృదయరంగము నెల్లన్
లోఁగొనుచుఁ బల్లవించిన, జోగులు విడితపముని క్కచొక్కి నిమదులన్॥ 37

కం॥ ఇది యెవతె దెయీ మామిడి, పొదరింటం బాడు పూవుబోణి యెవరిదే
మిదినన్ను నాథయని యెడు, నదియీ చెలి గొనని తపమునా! తమిదీఱన్॥ 38

కం॥ ఆడుదియనని దిగదయీ, పోడిమి మనయాడువారి పోలిక లేలా
యీఁ జేఱుఁగ ర్మఫలమిా, పాడిన పటమెయదార్థ భావమ్మోనన్॥ 39

క॥ తడఁబడుసడలచెడఁగునను, సుడిబడు వెడలింటి యేఁపుచూపుందూపుల్
వెడఁద యెడమిట్టిపడుపోగ, రుడుగని చనుగబ్బిగుబ్బ యొప్పిదమవురా॥ 40

క॥ అనినన్నుఁ దాఁకిమరలని, మనములు జడనైనచూపు మఱచినమాటల్॥
పనుపడని చెవులుననిచిన, తనువుల వారగుచునంతఁ దపసుఁ జేఁడుల్॥ 41

సీ॥ యోగదండము పైనినొఱఁగియూఁపలు మవ్వి యొయ్యారముగఁ జూచునొక్క మౌని
తనచంకఁగకపాలదగిలించి మొగమెత్తి, సిక్కి-దిక్కులు చూచునొక్క మౌని
మెడయెత్తి జడలొత్తి పెనఁజట్టి కేలూఁగ, నొడలావురించెడునొక్క మౌని
జపమాలఁ బెడకేలసవరించి త్రిప్పలాని, ముక్కునసిట్టూర్చునొక్కమౌని
గీ॥ గోచిసరిచూచుకొని లేచికొంకనొక్క డాఁచిమడుపుచి వెనుఁజూచి యొగనొకఁడు
పలుకనుంకించతడఁబడియులుకునొకఁడు మదనుమిడినేటఁబడ్డ యమ్మౌనివరులు॥ 42

క॥ ముసిముసినవ్వులరువ్వుల, మిసమిసమను మేనిసొగసు మిడిసెడు గుబ్బల్
గుసగుసమను పిలుఁదులపస, యుసురుసురనడుము బెడఁగు నబ్బురాగింపన్॥ 43

క॥ ఒకరొకరి నెఱుఁగకుండన్, వికలమతుల్ మునులు నాదు వెంబడిరంతన్
దెకతేరఁగ దొరకినయీ, వికచాక్షి గ్రహింతుమనెడి వెడఁగుఁదనమునన్॥ 44

క॥ ఈపొదరినియాపొదరి, నైఁపదమనికలికికన్ను సన్నల వారిన్
తేపుచుఁ దమిరెట్టించుచుఁ, జూపితిఁ బలువింతవింత సొగసులుగుఱు॥ 45

సీ॥ సరిదాఁకఁజనుదెంచి జడదారియొకఁడునా, పైఁటమీటినఁ జిటుకోఁవడియెఁ
జెయిఁబట్టఁజెయిసాఁచి చెనకినమునినాదు, చేతితామర వేత్రె వేఁతఁబడియె
నాలింగనముసేయ నభిముఖుఁడగువచ్చు, తపసినాచూపులఁదలపటించె
వెనుబాటుననుబట్టలేచి పొంచినమౌని, వేణితాఁకునకింత వెనుకకొదగె

గీ॥ నగవుమోమున వారలనవ్వఁజేసి యభినయమ్ములవారినాయట్లఁద్రిప్పి
యుబ్బునెడఁదలవారిఁదబ్బిబ్బుపరచి మించివగలాటపాటలాడించినాఁడు। 46

సీ॥ ఆలింగనముసేయ నఱిగినట్టుల్గ్రాలి, వలయితపాణిఁ గైవారమిచ్చి
యాసక్తిచెలిదండకరిగినట్టులపోయి, యొయ్యారిముగఁబ్రక్కకొసరిల్లి
వెడఁదయురమ్మొరవిచ్చి వెక్కసుఁజిక్కి, బెదరుచూపులగుబ్బలదరనిలిచి
కట్టినవెలిసన్నపట్టునించుకయెత్తి, పట్టుచుఁజక్రరూపమునఁదిరిగి

గీ॥ చుట్టివచ్చితిమునులురాచట్టులట్లు పెట్టుగుట్టులమురిపెంపుఁబెంపుసొంపుఁ 47
డెంపుఁగనలేనిచూపులఁగృష్ణమనుఁగు, మనులనాచేఁతలకుఁదెల్విమాటుమణఁగ

కం॥ ఒత్తిగిలివారిసటుచని, చిత్తరులగువారిమదులు చివురెత్తఁగనే
నొత్తెరముమీఱఁదొలినుడి, నొత్తుచుబిత్తరపుఁజూపులొలయంబాడన్. 48

కం॥ తత్తరపడియొత్తరపడి, చిత్తజవమ్మునను లేచి చిడిముడిపడుచున్
మత్తిల్లినచిత్తమ్ముల, నెత్తినతమినొకరినొకరు నెఱుఁగక వారల్. 49

సీ॥ ఇదెగావె మోహినీ! యెందుఁబో యెదవంచు, జడదాఁకినొకమునియొడసిపట్టెఁ
బట్టినఁజెలినాదుపజ్జనువచ్చితే, వెడలెదుసుమ్మని ప్రియముబలికె
పదవెబిత్తరియల్ల పొదరింటమనయాట, పాటనియొకఁడొకపాణిఁబట్టె
నాటపాటలకేమి యటుపోయివత్తమం, చతఁడాతనికరమ్ముహత్తిలాగె

గీ॥ రావెదకుచూడ వేలపరాకుపడకె యనుచుఁబలువింతపలుకులఁ బెనఁగికొనుచు
నొడలెఱుంగనిమదమున జడనుగొనుచుఁగలసితిరిగిరియాకోనకెలఁకులందు, 50

గీ॥ తాముపలికెడుశబ్దమర్థమ్ముగనుక, తలరివర్తించు కర్మసిద్ధాంతపరులు 51
మూఢచిత్తులుపొందుసంపూర్ణఫలము, మోహినీరూపమునమునుల్ పొందిరపుడు

వ॥ మాకెల్ల నక్కజమ్ముగా నొక్కకలస్వనమ్ము వీతెంచిన నిక్కన మెదలఁ గౌతుకమ్ము
కడలొత్తు చూపుల నలుగడలం బరికించు నెడల.

సీ॥ ప్రష్ఠౌహీగోధేనుపరివృతోన్మదమహా. వృషభసుందరదరప్రేంఖణమ్ము
కలభీసముహానుగమ్యమానాభ్రము, కలభమంథరగతివిలసితమ్ము
సింహీపరీవారసేవ్యమానమృగేంద్ర, సరభసగంభీరచంక్రమణము
హరిణీవిలోలనేత్రాంచలలక్ష్యసా. రంగచారణచారుభంగిమమ్ము
గీ॥ రాజహంసీవిశిష్టమరాళరాజ, గమనమధురమ్ములగు వింతగతులసతుల
వెంటనిడుకొనియంతంతవిభుఁడువచ్చె. దారుమునులున్న పూఁదోఁట చేరువకును 53

గీ॥ మధురగంభీరధీరమాన్మథమనోజ్ఞ. మూర్తి వలగొనివచ్చు నమ్ముద్దరాండ్రు
తమదుమోహినులంబట్టఁ దలఁచివచ్చు, నలజగన్మోహనులో యనియాత్మఁ
దలఁకి. 54

కం॥ దారుమునీంద్రులు మోహిని, తారకుతారకుమటంచుఁ దమకము వెఱఁగ౯
గూరుకొనబిగువుకౌఁగిటఁ, దారిచిరోఁడొసల వేఱుతలఁపనిమదుల౯. 55

కం॥ అదియెట్టిచిత్రమోయు, మ్మదనారింజూటియున్న మదవతులంత౯
బొదువుచుఁ బరస్పరమ్మును, బొదరిండ్లం దూఱితూఱి పొదలిరి వేడ్కల్. 56

కం॥ అంగనలంగనలటులా, లింగనములఁ దేఱితేఱి లీలలు మెఱయం
జెంగటఁబురుషులు పురుషులు, సంగతినాలింగనైకసౌఖ్యమునందర౯. 57

వ॥ వారలమ్మహేశ్వరుమాయాప్రభావమ్మునఁ దమతలఁచినచందమ్మున తమతమయాడుఁ
దనమ్ములు మగతనమ్ములు మారుటలనేర్పఱింపనేరని తమకమ్ములంబొదలి రట్టియెడ. 58

—※ మునులు మునిపత్నులు పరస్పరము భ్రాంతినందుట. ※—

కం॥ తమప్రక్కఁబూవుఁబొదరుల, సమదస్మరసమరస్మృమరఘూంకరణధ్వా
నమణితకలరవములువిని, తమలోనయ్యాలుమగలు తబ్బిబ్బులుగా౯, 59

మ॥ ఇదియేమా! యనిచూచి, చూచెనపుడో యిల్లాలుపాపిణేశునా
ప్పిదమున్విస్మయచిత్రిభావకుతుకా వేగాశుభ్రోపారుణో
న్మదవీక్షావళి, మోహినీకుచయుగోన్మత్తుం బ్రియాలాపునిన్
విదితోద్వృత్తుని, విస్మృతాఖిలసతీ విస్రబ్ధచారిత్రునిన్. 60

శా॥ ఆమానీంద్రుఁడుచూచియాసుదతిఁ దానల్లంత, నిల్లాలుగా
టామోముంగనియెంచి. యెంచికొనిక్రిధ్యద్వీర్ధ శార్దూలరే
ఖాముద్రమ్మగు రౌద్ర భీషణకటాక్షశ్రేణిఁ బర్వించియా
యేమీ! పాంసుల యెంతదానవయితోసీ యంచు గర్జించుచున్. 61

శా॥ లేవంబోయినమాని, బాహువులచే లేనీక కౌనూని, యో
పూవుంబోడిరో! యేమిదింతయి నీపోకల్ దురూహమ్ములో
నీవేలాయిటువింతరోసపడెదే మే దోసమిందయ్యెనా?
పూవుల్కానిశ్శైరెకలత్యమగునన్ బ్రోవంగదే, కోమలీ, 62

కం॥ అనియభిముఖముగనుండిన, మునియమ్మునిఁగదలిపిదలి పోనీకకడుఁ
బెనఁగినఁ బెనగుచునతఁడున్ దనమదిఁగలవంతనులువఁ దలఁకుచునుడికెన్. 63

సీ॥ ఆసతిపాణిశేసునదిమిపట్టినయల్ల, మోహినిరూపమ్ము సాహసమ్ముఁ
దనపతివిధమునుఁదప్పకగనుగొని, రోసమ్ముబెదరునురూపుగొన్న
మేనిచందముతోడ మెఱపుతోఁచినరీతిఁ, గాఁగిలిఁగొనుమనః కాంతు నెడఁగ
నెట్టుచునట్టెట్టుపట్టినఁబట్టిన, పట్టునుసాధించిబయలువెడలి

గీ॥ పట్టుదప్పినయలనాగ భామవోలెఁ, గట్టుదప్పినమిట్టుచ నట్టునెగయ
నెగచిముందడుగిడియెడునింతలోన, వెనుకకొంగూని పైకొని వెనుకఁదిప్పి. 64

శా॥ ఓప్రాణేశ్వర! యోమనోహర! వృథాయుద్యోగమేలయ్య, యీ
నాప్రాణమ్ములమీదనాన, యిటుకై, నన్నీవుగాదన్నచో
దీప్రమ్ముల్ స్మరబాణముల్ మిగులశోధించెం దయుప్రసమ్ము, నా
యీప్రాణమ్ములనిల్పు మంజలియిదే, యీయల్క చాలింపుమా. 65

మ॥ అనియాత్మేశ్వరి, బాహుబంధమునను ద్యత్ప్రేమముద్దాడు. న
య్యనఘాకారు మనోజ్ఞవేషుఁ బరకాంతాలింగనప్రౌఢునిన్
గనిక్రుద్ధుండయిమౌని రాజువిడుమా కల్యాణియీచెంత, నా
వనితం బట్టినవానిదుర్మద మడంపం బోదునం చాడినన్, 66

మ॥ ఎవరోపాపమదెట్టిజ తమ్మో వృథా యేనాథుఁడే నాతినిన్
దవులం బోయినఁబోవుఁగాక, తరుణీద్వయమ్ము నీకేల, యీ
యువురుం బోఁడలనమ్మరాదనుట యంతేసత్యమౌఁగాక నీ
వ్యవసాయమ్మును మానుమంచతనిఁదా నాఁగెం బ్రియాలాపియై. 67

మ॥ అపుడాకామిని యూరయీసౌదరిలో నావంకఁదా నెవ్వఁడో
యపురూపమ్ముగనొక్క కాంతఁదనతో నాడంగఁ బ్రేక్షించు, వాఁ
డిపుడే నచ్చెదనిందుఁదప్పెవరిదో యేర్పాటుగావించి, యా
కృపణస్వాంతు నదల్పఁగావలయు లేదేఁ గీడువాటిల్లదే. 68

చం॥ అనుటయు నాథ నీవుతమి నచ్చటికేఁగెదొ, యొట్టుసుమ్మి, యా
వనితయదెవ్వరోమఱియు వాఁడెవఁడో మనకేలయింక, నీ
మనమున నీసుదక్కి చను మానమునన్ననుఁబ్రోవు మంచు, నం
గనప్రియుఁ గౌఁగిలించె నిజగాఢకుచద్వయి హత్తిమెత్తనన్, 69

చం॥ అదిగని మౌని సైఁపకతివా! వినుపూరుషుఁడైనవాఁడు, దా
నెదుటఁబరాంగనన్ బలిమి నొత్తినవానిని సైఁచునెట్టులీ,

యదనునఁ బాపమాయనద కార్త్రిఁ దలంగ నెపంబు గల్గు, నీ
పిదెయటు మూడుమంచుఁ దనయింతికిఁ జూపన తఁడు చూచియున్. 70

వ॥ తనదండ చెలికి గాన్పించిన యమ్మిథునమ్ము స్త్రీపురుషభావములు దనకు విజ్ఞోదుపడంగా న్పించుట యుందదనుగుణమ్ముగా. 71

చం॥ సరిసరి నీమతిభ్రమము చక్కఁగనున్నది, కాంతయెవ్వరో
పురుషుని గాదు కూడదని పోవగనున్ననుబోవనీక, తాఁ
గదకరిఁ గౌఁగిలించినది, కాంతుబెడంగున కోడి నీవు, నా
సరసను బాయఁ జూచెదవు చాతురినొక్క నెపమ్ము పన్నుచున్. 72

కం॥ ఒకనిఁ గనియొకనిఁ దలచుచు, నొకనికిఁ జేయూచి మఱియు నొకనిఁ బిలిచి తా
నొకనికిఁ దలయూచుచు, వే ఱొకనిం గవగూడు కాంత లొక్కరివశమే. 73

మ॥ అనుచుం బెక్కులు పల్కుచున్న యెడ నయ్యబ్జాక్షి, యో మోహనా!
కనుమీ వైనను నొక్కనాతి నిటులం గారించు దుష్టాత్మ, నే
మనుమానించెదొ నేను బోవునెడ నంచా కాంతకుం జూపె, నా
విని యోద్వృత్తుల మానిదంపతులఁ దా వీక్షించి యబ్జాస్యయున్. 4

మ॥ మునియెవ్వండొ యొకండు పైకొని యెనమ్ముగ్ధాక్షి నొఁ గాఁకయ
మ్మునినింగాదన నేరదా యువతి యునోన్మోహమ్ము పెట్టింప, సీ
మన కేలా యిది చూడరాని పని యామల్లీనికుంజమ్ము చే
రను రారమ్మటుపోదమంచు సతిని నాథ్రిఁగొంచుఁ బోఁజూచినన్ 75

మ॥ కని కోపించి యతండు చూడు సుదతీ గర్వించి యూకోమలిన్
గొని పోఁ జూచెడి నింక వాసిసయిపన్ బొమ్మంచు హుమ్మంచు మతే

చినమానింగనియోసిమామడికి వచ్చెన్నిదుకార్యమ్ము, నా
ఘనునింగాంతయెతోడికొంచుఁ జనెకీన్గన్మచు రెట్టిచినన్ 76

కం॥ ఆడుదియెవరోయటమగ, వాఁడెవరో తెలియనట్టె వల్లభవిఁకనీ
పోఁడిమి తెలియన్వచ్చెను, జూడుమచూడుమయటంచుఁ జూపిననతఁడున్, 77

కం॥ కదులెస్సబలికితిదెనీ, గడుసరిమగతనము తెలియఁ గావచ్చెనిఁకన్
నడునడుమీయీచిత్రము, నెడదృష్టింజెదరనీక యీక్షింపవలెన్, 78

కం॥ అడియాడుదిగ కున్ననో, యిదిమఁగదియుఁగాకయన్న నేమీయొపందె
మ్మది తెలియకడుగుపెట్టను. బదరింపకముందెచెప్ప వలెననిపలుకన్, 79

కం॥ అదియాడుదిగాకున్నం, బోదలుఁడుదంపతులు కాఁగఁ బురుషుండైనన్
బోదలుఁడుదంపతులుగనని, మదిమదిరెట్టించికఅను మాటలతోడన్, 80

కం॥ పరిహాసమ్మ్మగవారలు, పరస్పరమ్మ్మటులపలికి పంతముమిగులన్
బొరసిరియయ్యుభుజంటలు, సిరస్తనిమిషాత్ములగుచు నిలిచిరియంతన్, 81

గీ॥ వారుమోహనరూపభావములయందె, స్త్రీత్వపుంస్త్వమ్మ్ము తెలియనిసిగ్గకాక
పిలువఁబడియునుబలుమాఱుపలుకులందు, నెఱుఁగలేరైరి భేదమ్మ్మకింతయేని, 82

గీ॥ సాఁగియేనంతసుందరేశ్వరుని జేరి, దేవయీబన్నమిఁక (జాల దేమటన్న
నగుచుగరమూనిచూడు మోమగుఁవయింక, వచ్చుచిత్రమ్మువిస్మయావహము
ననియె, 83

వ॥ అట్లు నిలిచినయమ్మ్మనిదంపతులు పరస్పరమ్మ్మనుబరికించి పరికించి తమతముచందమ్మ్ములకు
వెఱగుపడుచు నిక్కమ్ము నిర్ణయింపనేరక పలువిధమ్ములగు మోహమ్ములకు బాల్పడుచు. 84

మ॥ కలయంజూచెడిమౌనిదంపతుల కాకానన్ జగన్మోహినీ
కలితుల్ సు దరసుందరుల్ నవనవాకారుల్ జగన్మోహనుల్
తిలకింపంబడవిస్మయమ్మునపడుచుం దృష్టుల్ మొగుడ్పంగ ని
శ్చలులై చిత్రరులై యొకింతకలుగన్ జ్ఞానమ్మునంతంతటన్. 85

కం॥ తనపతినిజగన్మోహిని, కొనెననిగుర్తించెనొక్క కులకాంతయటన్
గొనెసతినిజగన్మోహనుఁ, డని యెఱిఁగెను మౌనియొక్కఁడతికష్టమునన్. 86

కం॥ ఎఱిఁగియు మఱియేపలుకుల, కుఱుకకతమపంతములకు నులుకుచుమిగులన్
వెఱఁగుపడియుండిరెంతగఁ, దఱచినఁదమదివ్యదృష్టి తపముఱగాఁగన్. 87

కం॥ కులసతియొక్కతెతనపతిం, గలిసినమోహినినిజూచి గాసిలియోసీ
తులువతినమ్మననెంతకుఁ, దలపడితే నిలుమునిలుము దర్పమ్మనుచున్. 88

కం॥ గమకించిననామోహిని, రమణీసరిచూడుమీ! పరాకునబడకే
రమణునిగూడితినేయ, క్రమమునమోహినిది, తప్పుగాఁబలుకుదువే. 89

కం॥ అనునెడనొకయంగనదాఁ, గనలుచుముందునకువచ్చి గయ్యాళిగదే
మునువెనుకకనకనాపతి, ననియెదెమోహినియటంచు నటుచూడుమనెన్. 90

కం॥ వసితలువనితలుతమపతు, లనునెఱుఁగుచుమిగులమదుల లజ్జించియుఁదా
మొనసిరికమ్యముదములో, ననచిత్రవిచిత్రవాక్యనైపుణ్యములన్. 91

కం॥ మునులున్సతులజగన్మో, హను లెంతయుఁజెఱచిరనుచు నాగ్రహపడుచున్
మునువెనుకఁగనకయొండొరు, లనుగదిసిరిమోహవివశ లఘుతరవృత్తిన్. 92

కం॥ వల్లభులుపోరుచుండఁగ, వల్లభలడ్డమ్ముసొచ్చివారించిన, వా
రెల్లరుమనెట్టకేలకు, నల్లంతనపోరువిడిచి యాగిరియంతన్, 93

శా॥ ప్రత్యక్షస్థితమోహినీశ్వర వపుఃప్రాగల్భ్య మాధుర్యమ్మునన్
స్మృత్యాగూఢకులాంగనాప్రియవచోరేఖావిశేషమ్మునన్,
బ్రత్యేకప్రథనమ్మునల్పునెడలన్ భావించియున్నట్టివై
యాత్మల్వారలు విక్రముం దెలియలేరైరంత నొక్కింతలో. 94

కం॥ ఉడుగని మోహమునను వా, రొడఁబడి యొడఁబడక ప్రియల యుపలాపములన్
గడు జృంభించిరి తిరిగియు, జడదారులు సతులఁ గొనెడి సంరంభమునన్. 95

సీ॥ పిడికిలించుచు నొక్కజడదారి నా సతి, మునసె దేమని యూడు పురుషుఁ బోదివెఁ
బోదివినఁ దత్ప్రియపోదువకు నాప్రియు మోహినీయుని పతి నోర్మహరించె
నోసి! నీ ప్రియుఁడెట్టుగో వీఁడుచూచెద, నాఁగ కాఁగకుమని తూఁగివచ్చె
వచ్చిననడ్డమ్ము వచ్చెయొత్తెలిపట్టి, ప్రియ నెట్లు నీవనో వెలది యనియె 96
గీ॥ అంతనే యేమిచిత్రమో యడఁగెనపుడ, నారిమాయా స్వరూపముల్ వారు సతోడఁ
గలుఁగు జ్ఞానమ్ము గోలఁగ నిక్కమ్ము గను మహానిదంపతులధిక విస్మయము పడుచు

మ॥ కలయో, మాయయొ, సత్యమో తమదు దుష్కర్మప్రభావమ్మొ, మా
నలుగా నోటు పతివ్రతామణులును నోర్మహమ్ము లిల్లుండునా
తెలియన్నేలగుఁగాక తట్టు వదకెం దేనిన్ యథారీతిగా
మెలఁగం గాఁదల తెత్తు రెట్లు పనులన్నే ళమ్ము గావింపదే. 67

మ॥ అనిలజ్జించుచు ఖిన్నలౌచును బ్రియావ్యాపారము ల్మెచ్చరా
మునులున్ దివ్యపతివ్రతల్ సడలనామోహమ్ము మందాత్ము, భా
రనతాంగుల్ వినతాస్యలై మునిసతుల్ ప్రాణేశ్వరాంఘ్రిద్వయా
వనతల్ చిత్తరులౌచు నిల్చిరట నిర్విణ్ణైకచిత్తమ్ములన్. 98

శా॥ కూసెందానట ధూర్తకోకిలము లేఁగొమ్మన్ ప్రియాచంచు,లీ
లాసందానితమర్ధభుక్తముకి సాలగ్రాసముం గ్రక్కుచున్
డాసెన్మోనియొకండువెంటనె ప్రియన్ డాకేల నేకమ్ముగాఁ
గసిల్లంబడి మన్మథోద్ధృతశరాఘాతమ్ము సైరంపమిన్. 99

శా॥ మానుల్గాంతలు నెల్లరొక్కత్రుటిలో మదాత్మమందాత్ములై
సూనాస్త్ర ప్రథమాన బాణపటలిం జొక్కంగనా వెంటనే
యోనాథాదయ నేలఁ మన్ననుడుల య్యోంకారఘంటాధ్వనుల్
వీనుల్ చూడినయట్లుగా వినఁబడన్విభ్రాంత చేతస్కులై. 100

మ॥ చకితక్రోధ విషాదహాసభయ లజ్జామజ్జదాస్యోన్నమత్
భ్రుకుటిస్ఫూర్త కరాళవీక్షణములన్, మోహమ్ముగల్పించి, కొం
చకతమ్మట్లులగాసి వెట్టుఖలులన్ శాసింతుమన్నట్లు లూ
రక దిక్కుల్ నలుమూలలున్గనిరి నేత్రమ్ముల్ పిసాళించుచున్. 101

సీ॥ ఎవరి నెందునుగాన కెల్లరు నౌరయే, మూలనోయీపాడు మోసకత్తె
యేమయ్యె నేగంటయీమూలవినవచ్చె, వచ్చెనామనయింటిబిచ్చగాఁడు
యీమనయిల్లా డ్రినింతింతయన రాని, గాసి పెట్టె నెవండుగాన రాఁడె
యింతింత వారలనింత చేసినజంత, యెంతకుఁ గాదిపుడెందుఁబోయెఁ

గీ॥ బదఁడుపదఁడింక వారలఁబట్టవలయుఁ బలుకుసవ్వడిఁబట్టియాకలికితనము
బిలుకుమార్చుదమంచునుబలసి వెడలి, వెదకి రాకానయెల్లెడవినుఁగుగొనక. 102

గీ॥ ఎంత వెదకినఁగనరారువింత వారు, మనలనింతలు చేసిన చెనటి వారు
వారుభూతమ్ములో యెట్టి వారలైన, విడువవచ్చునె విడుతు మేకడకుమట్ల. 102

—✻ మునులు మోహినీ మోహనుల జంపనెంచుట ✻—

కం॥ మనమాటయటుండఁగనీ, మనకాంతుల మోసపుచ్చి మనవచ్చునటే
మనకాంతలపరిభవమును మనదేగద దాని సైప మగతనమగునే. 104

వ॥ అని కోపించి యమ్మునీశ్వరులు దమకాంతల వంచించినవారలం బరిమార్పందలంచి ఘోరమ్ములగు నాభిచారకహోమమ్ములం గావించుటయు నందుండి. 105

మ॥ ఒదవెన్ భీషణభీషణమ్ము, గజదైత్యోగ్రమ్ము దిఙ్నాగభీ
ప్రదముం జాలితఘుంఠి,ఘంటిత జగద్భద్రమ్ము నుచ్చైస్స్రవ
న్మదధారాపరిశమత్కృపీటభవసన్నాహమ్ము, స్వాహారవో
న్మదమానీశ్వరచోద్యమానమగుచు న్మత్తేభముగ్రాకృతిన్ 106

వ॥ అట్లొదవి యమ్మహాగజమ్ము. 107

మ॥ ఘీంకారించినఘూర్ణిలెన్ జలధులుద్రీవోత్థ శుండాహతిన్
జంకెం దారకమండలమ్ము పదవిన్యాసాతిభారమ్మునన్
గ్రుంకెం దివ్యపురాణభోగిఫణముల్ గోపమ్ము రూపమ్ముగా
ఘీంకారించుచు వెండియుం గదలె విక్షేపించి వాలమ్మొగిన్. 108

వ॥ అంతట నయ్యుపశమనమ్మునకు శంకించుచువారు వెండియు హోమమ్ములు గావించుటయు గ్రమమ్ముగా. 109

శా॥ సాధీయస్సమిదుగ్రమంతకలనాజాజ్జ్వల్యమానాగ్ని మ
ధ్యేధామమ్మున,వక్త్రగహ్వరచలజ్జిహ్వామహాభోగి, భూ
యోధస్తాడితవాలమగ్నిదృశ ముద్యద్దర్శ శార్దూలి తత్
క్రోధమెల్లను మూర్తిమంతమనఁగాఁగుప్పించె మిన్నందుచున్. 110

శా॥ ఆకాశాంతరలీయమానపటుకీలాటోపధూమావళీ
నీకాశమ్ముల నేకభోగములు వహ్నికూర నిర్యద్విష

వ్యాకీర్ణాఖిలకాననమ్ములు సముద్రాంతర్లుఠద్ఘోర, వీ
చీకమ్ముల్వడలె నరియమ్మున ఫణిశ్రేణుల్ బుసారించుచున్, 111

శా। మానీంద్రాసురనిష్ఠలుం దపములున్మానమ్ము లాకారభా
గ్యైనఃపుంజములేకమై వెడలెనా, వ్యాళమ్ములే కార్థముల్
నానాకారములుగ్రసంహరణ సన్నాహమ్ము,దీపింప నా
లోనన్ డగ్గఱఁజూచి బెగ్గడిలి కల్లోలన్మనోవృత్తులన్, 112

శా। సామీ! కావవెదీనురాలిననుచున్ సాష్టాఙ్గనమ్రాననన్
గామధ్వంసుని శుభ్రదభ్రతను రేఖన్ జంచలాకారతన్
నా మేనింబొదివించినిల్చు నెడల న్మందస్మితజ్యోత్స్నకా
రామమ్మైనకృపాపయోధికి వళీరమ్యమ్ములౌ చూపులన్, 113

కం। వెఱవకు వెఱవకుమనుచున్ దరఁగంగొనుకడలిబోలెఁ దన మేననున్
నెఱినిఱికికొనుచుఁగ్రచ్చఱ జుఱచుఱనా వ్యాళములను జూచినయంతన్. 114

శా। సాహంకారతవచ్చిపైఁబడెడు నా వ్యాళమ్ములేమయ్యెనో
త్రాహి త్రాహియటంచు నమ్మనులుదత్పత్నుల్ పరిధావన్మృగ
వ్యూహమ్ముల్ వడిఁబాఱిపాఱి యెటకుంబోనీని యా వ్యాళసం
దోహమ్ముంగనిభీతభీతులయి యుత్క్రోశించి రుద్బాహులై, 115

శా। దీనత్రాణపరాయణుండు శివుఁడర్ధిన్వారి మన్నింపఁగాఁ
దోనన్గర్జనసేయఁ జచ్చెగజశార్దూలమ్ములా సర్పముల్
మానివ్రాతముఁజుట్టితుళ్ళిపడియె న్మందాత్మ చేష్టమ్ములై
మానుల్గాఁడఁగ విస్మయంపడితి నామాహాత్మ్యమూహించుచున్, 116

మ॥ మధురాలాపముఁ జేసె నీశుఁడు శ్రిహోమద్యమ్మునన్వేళ సం
శిథిలమయ్యెను నాగబంధములు నాస్త్రీలున్మనుల్గాంచి ర
వ్విధుమౌళిన్రమణీయ విగ్రహుఁ గృపాబ్ధిన్మోహ నున్మోహినీ
మధురాలాపనివిష్టమానసు, జగన్మాంగళ్య మాంగళ్యునిన్. 117

కం॥ ఆపరమేశ్వరుఁ గనుటన్, బాపమ్ములపటలిపంచ బంగాళముగాఁ
దాపసులెల్లరునంతటఁ బ్రాపింపనపూర్వబుద్ధి పరిపాకమ్ముల్. 1.8

కం॥ మాద్రోహము మన్నింపుజ, గద్రక్షక పేర్మిననుచుఁ గడుభక్తిమెయిన్
రుద్రునిననుఁ బ్రార్థించిరి, భద్రశ్రుతివచనవిమల పాండిత్యమునన్. 119

గీ॥ వచనపరిపాటికందఁగావలనుగాని, రూపధేయమ్ము మహిమమ్ము రూపుగొన్న 120
మిమ్ము నొండుగఁదలఁచు పాపమ్ము కర్మ, మణఁగ వేడెదమయ్య సాష్టాంగములను.

సీ॥ శారదకౌముదీసారాభిరామమ్ము, కోమలేందీవరశ్యామలమ్ము
రాజతగిరిపుణ్యరాజీవిరాజమ్ము, నింద్రనీలోజ్జ్వలదిందిరమ్ము
కలహంసకహ్లారగంగాప్రభాసమ్ము, కోకిలాళీకేకినీకలమ్ము
సౌదామనీచ్ఛటాసర్వసర్వస్వమ్ము, కాలనీలాంబుదనీలిమమ్ము

గీ॥ క్షీరపాథోధిదర్పణస్నిగ్ధబింబ. గగనసంకాశమగుమూర్తిఁ గాంచఁగలిగె
నెల్లపాపమ్ములణఁగె మమెల్లఁ బేర్మిఁ గావగదరయ్య మీదాసగుణముఁ జేర్చి. 121

శా॥ కర్మజ్యేష్ఠులమంచు నెంచి మిగులన్గర్వించి లోకమ్ములన్
దుర్మోహమ్మునగాసివెట్టితిమి మాద్రోహమ్ము సామాన్యమే
నిర్మోహాత్మ మొసంగిమమ్ము మనుపన్విచ్చేయుటే కాక యీ
కర్మందుల్ భవదుగ్రశాసన పరీక్షన్నిల్చి సాధింతురే. 122

శా॥ ఆభీలమ్మగు నొక్కహుంకృతికె యీవ్యాళమ్ములిట్లయ్యె దు
ర్లోభగ్రస్తుల మత్తచిత్తులమమున్ రోషింపకీ కాచుటల్
నీభక్తస్థిర పాదసేవనమునింతే నీయఁగాఁగోరి కా
దా, భావింపగ నెంతవారికి భవద్వ్యాపారవిజ్ఞానముల్. 123

కం॥ చెడుగులె చేసిన మేమును, బెడఁగుఁదనంబిట్లుకలిగి వెడలఁగనసురుల్
పుడమింబడి మీకరుణం, బొడఁగంటిమి యొందుజన్మమును బుణ్యమ్ముల్, 124

శా॥ మాదుష్కర్మమె మమ్ముఁగొట్టుననుచు నమ్మాటల్ యథార్థమ్ములై
యీదృశ్యమ్మున స్పష్టమయ్యెఁ గలఁడా యీశుండు శిక్షింపఁగాఁ
గాదంచుం గరుణింపఁగాననుచు మాకర్మమ్ము బ్రుంగించి మా
యీదౌష్ట్యమ్మును సైచి కావఁగదరె యీశానులీదాసులన్. 125

సీ॥ ఈమోహినీరూపమే నాటఁగంటిమే, యెఱుగమే కాంతలు నిట్టివారె
యీజగన్మోహను నెందేనిఁగంటిమా, మాసతీత్వము పేర్మి మనిచెఁగాక
యీరూపములతోడ నిందుండి యేవేళ, మమ్ము మన్నింపరే నెమ్మితోడ
నేమీయఁగా నేర్తుమే నేఁడు మామనః, పద్మముంచుతమీదు పాదసవిధి 126

తే॥ ననుచు బహురూపముల భక్తిననిచివారు, కొలిచి యర్చించిరట మమ్ముఁదలచితలఁచి
యంతనొకకాంత వెఱపడియచటుఁ జూచెఁ బాలుకాఱంగఁదన చిన్నిపాపకొఱకు.

దారుకామునుల నీశ్వరుఁడనుగ్రహించుట.

వ. అంత నాజగన్మోహనుండు చిఱునవ్వు మెఱయ వారలం గనుంగొని. 127

శా॥ పాతివ్రత్యనిధుల్ సతీమణులు నిష్పాపల్ మనమ్మందుమ
త్పాతివ్రత్యము గోరిరీమునులునున్ భావించిరీ మోహినీ
చాతుర్యమ్ములు వారిలోనిదె యభీష్టమ్మందుఁడీ వెన్కమీ
రీతుల్ సర్వముసిద్ధమై నిజనిజప్రీతిం దదర్హమ్ముగా. 128

కం॥ నాగవ్యాఘ్రాజినములు, నాగమ్ములు మీఁదియొసంగునవి కాన్కలు మా
కీగాథ శాశ్వతమ్ముగ, నేఁగొనియెదననుచుఁ దాల్చినిజదేహమునన్. 129

కం॥ మునిసంతానముఁ గొనుడఁని, మునిసంతానమ్ము మనిచి పురహరుఁడంతన్
దనునటు సాసూయముగాఁ, గనుజూచెడినన్నుఁ జూచి కనలకుమనుచున్. 130

కం॥ ధర్మము విడువకుఁడనియా, కర్మందులఁగఱపి హరుఁడు గను మొఱగిననా
దుర్మదమడఁగివారలు. శర్మముగ నిరఖిలజగము సంతుష్టిగనన్. 131

వ. ఇవ్విధమున నమ్మునీంద్రుల గర్వమ్ము డంచి యప్పరమేశ్వరుండు తిరోహితుండగుటయు 132

— అంధక జలంధర సంహారము. —

కం॥ వడిననువిడిచను నీశ్వరుఁ, బొడఁగానక యెంతమోసము నుజేయుఁ దొడం
బడితను వెడవెడకినుకన్, వెడలితినచ్చోటువిడిచి విపినమ్ములకున్. 133

కం॥ ఎదఁగల్గుమదనునణఁపఁగ, మదనారింగోరి వెదికి మఱుఁగుమనమునన్
దుదకపుడు నిశ్చయించితి, సదయుండగునతఁడు తపముసంగతిననుచున్. 134

వ. అట్లు నిశ్చయించియే నక్కాననొక్కకోన నాశ్రమమ్ము నిర్మించి, విమలకఠోరమ్ముగు
తాపసీవ్రత మ్మనుష్ఠించు నెడల. 135

గీ॥ అలహిరణ్యాక్షుకొడుకంధకాసురుండు, పెక్కువరములఁగనిచాలనుక్కుమెఱసి
విష్ణువధియింతు ననినన్ను వెదకికొనుచు, వచ్చెనొకనాటిసంధ్యాప్రాంతమునకు.

గీ॥ వచ్చినఁజూచి వాఁడంత ఱిచ్చనడుచు, ఁబచ్చవిలుతునిపూవులనొచ్చినొచ్చి
యిచ్చనను దేర్పవే మోహినీయటంచు దాసెదాసిన నేనంతగోసపడుచు. 137

కం॥ తొలఁగుముతొలఁగుమనంగాఁ దొలఁగెదలెమ్మనుచు వాఁడు దుడుసుతనమునన్
బలిమిన్నను గైకొనఁగఁ, దలఁచియు వెనుకడుగు వైచి తలకుఁచు నిలిచెన్. 138

మ॥ వినవచ్చెన్ శ్రుతిభేదనమ్మగుచు గంభీరస్వరమ్మొండు, మో
హినిభీతిల్లకు మేనువచ్చితిని దే యీరక్కసుం డున్మదన్.
సనుఁ జేపట్టుమటంచు నట్టిపడియె న్నామధ్యనొక్కండు. దు
ర్జనుఁ డెవ్వాఁడో యపూర్వరూపవిభవ శ్లాఘ్యుండుగర్జించుచున్. 139

మ॥ అతసింగాంచిజలంధరాయుడుఁగురా, యాయింతినాయింతి, నీ
చత రాఁబోకుమటన్న వాఁడు నగుచున్ శాంతించి యో యంధకా
యితరుండంచుఁదలంచినాఁడ నెపుడీవిచ్చోట కిన్వచ్చితీ
వ్సితమేమయ్యెను నీవిరోధియగునా విష్ణుండు కాన్పించెనా. 140

మ॥ అనినన్వాఁడొక వెఱ్ఱినవ్వునగి పోమామాట కేమింక నీ
చను కార్యమ్మది యేమియయ్యె హరునిన్ సాధించితే యన్నవాఁ
డనె లేడా హరుఁ డేమియయ్యె హరియో, యాతండు లేఁడంచు నం
తనిశాటుల్ ననుఁజూచి నవ్వికొనుచున్ దర్పమ్ముదీపింపఁగా. 141

కం॥ హరియును హరుఁడును లేరట చరాచరజగమ్ము నేలు శక్తులమఁటయీ
తరుణియుట మనకుదొరకెట, యురుతరపుణ్యమ్ముగాదె యోజింపంగా. 142

కం॥ అనినన్నుఁడాయవచ్చినఁ, జనుచనుఁడీయుఱకమీరు చచ్చెదరనుఁడీ
నను,హరునర్ధాంగినిజే, రనువచ్చిన.ననిన నగుచురక్తాంధసులున్. 143

కం। నినుబలిమిఁబట్టికొన్నం, జనుదెంచెడిహరునిశక్తి సర్వమ్మునిదే
గనుగొందుమనుచునన్నం, జెనకుటకును వారొకింత సిద్ధముపడఁగా. 144

మ॥ వినయ్యెంజెవి కేదొబుద్ధియదియున్వేపించె నాకృష్టముల్
గనులయ్యెంబులకించె దేహము మదింగల్గెన్మహాహర్ష, మొ

య్యనగర్జద్వృషభేంద్రకంఠ మణిఘంటారావముల్ మ్రోయఁబె
ల్చననుగ్రాకృతి సుందరేశ్వరుఁడటన్ సాక్షాత్కరించెందయన్. 145

వ॥ అట్లుసాక్షాత్కరించి యవ్విశ్వేశ్వరుండు చిఱునగవు చూపులనన్నుంగటాక్షించుచు. 146

మ॥ ననుఁజేసాఁచిపదమ్ము నూత్రి యిడుచు న్రిమ్మించు నెక్కించెనో
య్యన హైమాచలసానురమ్యమగు నయ్యాఱేని పృష్ఠాగ్రభూ
మినిఁబాణిగ్రహవేళ గౌరి పదముంబెట్టింప లేనవ్వుతో
సనికల్ నొక్కుటలయ్యె నాకదరలజ్జాహాసముల్ దాటిలన్. 147

కం॥ ఎక్కించియేమఱకుమీ, రక్కసికయ్యమ్మునందు రమణీయనుచున్.
దక్కఁగొనిపాణిభుజములఁ, జొక్కించుచువిడువకనుచుఁ జూచెనసురులన్. 148

కం॥ తమువెదకెడుపరివారము, సమకూఱఁగ దైత్యవరులు సన్నాహమునన్
గ్రమమెఱుఁగకెదురునడచిరి, సమయింపఁగహరునివిపుల సంరంభమునన్. 149

వ॥ అన్నిశాటుల యాటోపమ్ము లెక్కింపక యప్పుడమ్మహావృషభమ్ము. 150

శా॥ ఱిక్కించెం జెవులింతలింతలుగనుల్ ఱెట్టించె వాలమ్మున్గిన్
నిక్కించె న్మెడగంగడోలు మెఱయ న్రిట్టించెఁ జంద్రార్ధమౌ
నక్కుంగొమ్ములు ప్రక్కటిల్లుతలతో నుంకించి గుప్పించెమై
యొక్కింతోరఁగవంచి రక్కసులపై హుమ్మంచుగర్జించుచున్. 151

శా॥ ఆటోపమ్మునవచ్చునమ్మద వృషవ్యాపారముల్ సైపకా
స్ఫోటించెందితిసేన, నందినతడుంబ్రోత్క్షిప్త వాలాగ్రుఁడై
పాటించెన్నిజఘాటలన్ ఖురహతిన్ వజ్రాగ్ర శృంగాగ్రముల్
కోటుల్ద్రొబ్బుచునస్రపాస్రిజ మహాకూలంకషల్ పాఱఁగా, 152

క॥ ఈయెద్దుపై గరుసౌనటకు, నీయయ్యలుచాలరనుచు నీసునరోస
మ్మామత్తమైరాకాసులు, కాయములుపొంగ వెడఁబకాలుననగుమఁ. 153

వ॥ అయ్యంధక జలంధరులొక్కమ్మడిం బరాక్రమించిన సహింపక యమ్మహోక్షమ్మరవడి మెఱవడి నొక్కయుమటువంబర సాధింపనుంకించి బ్రహ్మాండ విదారణమ్ముగ ఘర్షిల్లని ఱంకించిన నప్పరమేశ్వరుండు నిజవామ హస్తమ్మున నవ్వృషభేంద్రము నంజనగిరి శిఖరమ్ము నుంబోని మూఁపురమ్ము నిమురుచు. 154

శా॥ విల్లెత్తెన్ సమరాగ్రభీషణము చాపెన్ రోపమ్మెక్కించె, నా
యుల్లాసమ్మునఁబొంగి నేఁ బుజము పైనూదన్మదాస్యమ్ము, భే
దిల్లం దిక్కులు బాణమున్విడచె సందీప్తాగ్నికీలమ్ము, వా
రుల్లమ్ముల్ చొచ్చియు ద్రెళ్లఁబోయి ధరఁగాలూఁదించి నక్తంచరుల్. 155

క॥ పెల్లుబ్బఁబోకుమిదెయీ భల్లమ్ములకాఁగుమనుచు బరవస మొప్పం
దుర్లక్ష్యము విసరిన వానిని జల్లులుగావించె హరుఁడు శితవిశిఖములన్. 156

వ॥ అంత మహాదారుణమ్మగు సమరమ్ము ప్రవర్తిల్లుటయు నా దానవులు సకలసైన్యములు ఱెప్పపాటుకాలమ్మున మంత్రించి వైచినటుల మహీతలమ్మునం దొరగుటయుం దమయ మోఘాస్త్రశస్త్రజాలమ్ములు మంటఁజొచ్చిన మిడుతలమాడ్కి రూపఱుటయు నుపలక్షించి రోషమ్ము వేషమ్ము దాల్చిన చందంబున యుగపత్సంజాత యుగాంత దండధర యుగళమ్ముం బోలె విజృంభించి. 157

మ॥ పరిఘంబూని జలంధరుండును గదాబాహుండు నయ్యంధకుం
డురువేగమ్మున శంభువక్షమునఁ దారొక్కమ్మడిన్ వ్రేచి రా
హరుఁడొక్కించుక సొమ్మసిల్ల నపుడే యాత్మీయ బాహాంతర
స్థిరపర్యంకునొనర్చుచున్ రయమునన్ జైకొంచుఁ గోదండమున్. 158

చం॥ నిలునిలుఁడేమదాంధులని నిష్ఠురచాపము గ్రక్కుతూపులన్
గళుకుతళుక్కుఁజూపున ను దైత్యులగుండెలు నీరుసేయఁగం

పొలసినలేతనవ్వుసరియొప్పుచు నెత్తురుటేరుపాఱె, నా
బలియులునేటియాటదివి బాణములాయని దద్దరిల్లుచున్. 159

ఉ॥ ఒప్పులకుప్పయీామగువ యుద్ధముసేయుచు మారుబాణముల్
చొప్పడఁజేసెదీనిమది చొప్పునెఱుంగక మారుబాణముల్
గుప్పగరాదటంచు నటుగుప్పకయుండిన తెప్పపాటులో
నొప్పరికించునే యసురులాడ్పకయుంచును దస్త్రమ్ముల౯. 160

ఉ। ఎత్తినవిండులెత్తినటులే తునుమాడెను చేతినేర్పు కెం
పెత్తినవవ్వుమోము చెమరెత్తులలాటముగ్రమ్ము ముంగురుల్
యొత్తరికించు చన్నుఁగవయొప్పసియాడు బెడంగుకొనుసున్
జిత్తముచూఱవెట్టి హరునిందముకించుచు నాతఁడత్తఱి౯ 161

గీ। ఓతలోదరియెుడుగుమీాయుద్యమమ్ము, మెచ్చవచ్చితివనినన్నుఁగ్రుచ్చికొనియెఁ
జనవునాకిమ్మ యీానిశాచరులఁ దునుమ, నంచువేఁడితిశివునినే నంతలోన 162

ఉ। ఉగ్రతనొప్పుబాణముల యోజనసేయుఁగ విష్ణుఁడంచుఁ గ
ర్ణాగ్రముదూసి పోఁబఱపె నంధకుఁడొక్కశరమ్ము నాపయి౯
దృగ్రుధిరప్రవాహములనించి జలంధరుఁడెత్తె శక్తి నా
యుగ్రుఁడువారిఁజూచి వృషభోత్తమునించుకతట్టఁ దట్టిన౯. 163

శా। గర్జించెన్ సహపత్రమేరుగిరి రేఖ దూకె నయ్యంధకు౯
స్ఫూర్జద్వజ్రకఠోర ఘోరఖురల౯ గ్రుచ్చెన్ మొగమ్మెత్తి యా
దుర్జేయుండు జలంధరుందునుమఁగా దూఁకె౯ హరుండంతలో
నిర్జించె౯ వృషభమ్మటంచును నసుర్వీక్షించె నా రాక్షసు౯ 164

శా। వాఁడా శక్తిని వైవ శృంగములచేఁ బాటించెను త్వమ్ము వాఁ
డేడంబోవక యొండు శక్తిఁ గొనఁగా నీ వుండుచక్రమ్ము చే
వాడిన్ వైచిన వాఁడు త్రెళ్ళిపడెఁ బుష్పశ్రేణి వర్షించి వే
నాడెం దైవతవారయావతము చిందం గానమాధుర్యముల్. 165

వ. అంత సమస్తకల్యాణనిలయుండగు నాకల్యాణధనుర్ధరుండు. 166

మ। నిజవాహమ్మును నన్నడించి దిగుచున్ మేవ్రాల్చియుతమ్ము పై
నిజమూర్ధస్థితజాహ్నవీలహరుల స్నేలించి ముద్దాడుచున్
ద్రిజగన్నాథుఁడు భద్రవాహనము నర్థిన్నీరు దార్చించి నీ
నిజవాంఛాఫలసిద్ధి నందుమని యన్నన్నుఁ జేపట్టుచున్. 167

మ॥ తరుణీవల్కలధారణమ్ము తగునే ధమ్మిల్లమింపీచిక్కులన్
బూరయం ధర్మమె యింత కంటె రముల్ మోమెంత గాసిల్లె మే
మరయన్నేరము కార్యభారమున నీయాతప్పు సైరించి మ
మ్మరయంగఁదగునంచు నన్నుఁ దమితో నందందు ముద్దాడినన్. 168

కం॥ మునుసతులగాము మేమా, మునిసతులనుకొంటి రేమి మోహాము పెఱుగన్
జెనకకు చెనకకుఁడనియా, మును వేలుపునెసగఁదలఁగి ముట్టెరిఁబదముల్. 169

ఉ। ముట్టినగుచ్చియెత్తికొని మోహినినీకిటులాడఁ జెల్లునే
గట్టిగనట్టితాపసునిగా ననునెంచి తెయుంచుఁ జెక్కిలిం
గొట్టుచుఁ గందెనేమొ తనికుందు నెపమ్మున ముద్దువెట్టుచున్
బట్టిపెనంగు నన్ను నెదఁ బాయఁగనీయక హత్తిపట్టుచున్ 170

మ। అవియేలావచియుంపనీశుదయ నేనా నాఁడుగంటిన్మనో
జవమున్ భైరవుజాతహావనుని, శాస్తన్ మోహినీరూపమున్

దవులం బాఱెనుబిడ్డనింగనెడి నా తాత్పర్యమూహించి, శం
భువుసేకూర్చెను వానికంతటమహాభూతాధిపత్యమ్మొగిన్. 171

శా॥ ఏనంతంజని కాంచికాపురికి నయ్యేకామ్రనాథున్ మదీ
యానూనస్థిరపూర్వపుణ్యవిభవున్ ధ్యానించి యాదేవతా
సేనానాయకు దక్షిణమ్మునఁ బ్రతిష్ఠింపన్నను న్మెచ్చి, యీ
శానుండిచ్చెను గృష్ణజన్మమునఁ దత్సౌభాగ్యసంపత్తులన్. 172

కం॥ అనిపలికి హరియుఁ దనసతిఁ గనుఁగొని వెడనవ్వుతోఁ గమలాక్షి రోనీ
యనుమానమేల బాసెను, యయని మ్మునివరులఁ జూచి యలరుచుఁ బలికెన్. 173

కం॥ మోహమ్మునడఁచుఁ గలివి, ద్రోహమ్మునడఁచుఁ దోలఁచు దురితార్థమ్ముల్
భీహరమగు నీహరకథ, యీహార్థము లెల్లనిచ్చు నీశ్వరుకరుణన్. 174

కం॥ ఒకొక్క కల్పమందుల, నొకొక్క మెయిఁ గ్రీడసలుపుచుండు హరుని నే
నొకొక్క క్షేత్రమునం గని, తక్కఁగఁ బూజించియిట్టి ధన్యతఁ గంటిన్. 175

గీ॥ నిగ్రహానుగ్రహమ్మున ననుగ్రహమ్ము, నాడు నవతారదశకమున న్మహేశు
వలనఁ గాంచితిఁ సివిగాక పరమశివునిఁ, బెక్కు తెఱఁగుల నేను సేవించుచుందు. 176

కం॥ పరమాద్భుతములు హరకథ, లరయఁగ నిదమిత్థమనఁగ నగు నెవ్వరికిన్
జరితమిది యెల్లనాదగు స్మరణకుఁ దోఁచినది జెప్పఁ జాలితి ననిన. 177

గీ॥ సంయమీశ్వరులెల్ల విస్మయముపడుచు, నెఱుఁగమీకథ యిది యిట్టులింత దాక
కలిగె నీను భాగ్యమి [illegible] వలన మాకు నను చునుతియించి రప్పుడా యనఘమతుల.

వ॥ అంత సయ్యిందిరాదేవి స్వలజ్జాదరహాసారుణితకపోలయగుచు కరమ్ముల మొగిచి,
మహాత్మా! సుందరేశ్వరుండు దారుకావనసతులతో వచ్చుటచెప్పితి రది తుదగామిము

వీడుట మొదలుగా జరిగినవృత్తమ్ము నింబాకనకు నవసరమ్ము కలుగద యిప్పుడానతీ వలయుననుటయు నమ్మునీంద్రులం నవియెట్టివనుని యన్నారాయణుం బ్రార్థింపనతం డల్లన నగుచు నిట్లనియె. 179

## శివుఁడు మునిపత్నుల వంచించుట.

క౦॥ దైవద్రోహులగర్వముఁబో వెడలఁగ నడఁచు నెడలఁబురసంహారు సం
భావన నెఱిఁగితినామది, కేవలమాశివునియంద కీల్కొనుకతనన్. 180

ఉత్సాహము॥ సుందరేశ్వరుండు భువన సుందరుండు పార్వతీ
సుందరుండు దారుకవన సుందరీహృదంతర
స్పందనప్రభావిభావ భావసుందరాత్ముఁడై
మందమందమధురగతుల మౌనిపల్లెఁ జేరుచున్. 181

చౌపదము॥ సిగ్గఱికముదము చెందియుఁ జెందని
నిగ్గులు దేఱెడి నిద్దపుఁరూపుల్
డగ్గఱుసొగసుతడంబడుకన్నెల్
ముగ్గులు వెట్టెడి ముంగిలిచెంతన్. 182

వనమయూరము॥ బారులగుపౌన్నలును బ్రాకినలతాశా
ఖారచితచీర లఱగాలికసియాడన్
జేరిమృగశాబములు చేకొనఁగదూఁకన్
గేరికొను బాలకుల క్రీడలొకవంకన్. 183

చౌపదము॥ కనుచునుగుమ్మము కడనిలఁబడిచే
తనుగల పనివిడి తనయులయూటల్
తనయుల తేటల్ తమకమునిడఁజెం
గునఁబఱఁబడు పసికూనలఁ బేర్మిన్. 184

వనమయూరము! చంకనిడిచన్గుదుపు సారసదళాక్షుల్
వంకనిడిలోనఁజను పద్మమధుగంధుల్
అంకమున గ్రొక్కొనుచునార్చు మృదుగాత్రిల్
బొంకితమకార్యమునఁ బోవుహరిమధ్యల్, 185

కం॥ మెఱసెడుకుటీరములఁగడుఁ, దఱచగుమునిపల్లెనడిమి దారినిజనుచి
చ్చఱకంటిమేటిదేవర, కుఱుకుఱఁగనిలిచియొక్క గుమ్మమునొద్దన్. 186

కం॥ ప్రణవస్వరూపమాయం, గణమునశంఖమ్మనొత్తి కడుఁలలితముగా
ఘణఘణమనఁ జేగంటన్, గణగణవాయించెఁబసిఁడి గంటన్మఱియున్, 187

గీ॥ బెదరెఁ బెంపుడు లేడియా బెదరుచూపు, తోడవచ్చినదాయింటి తోయజాక్షి
నక్కిగెంతిడు నెమలినానొక్కయడుగు, గడపదాటించి గుమ్మమ్ము కమ్మినొఱఁగి

వ॥ అట్లొఱఁగి యొయ్యారమ్ముగ నిలిచి వింతవింతచూపుల నుపలక్షించుచున్న. 189

కం॥ అతివంగనుఁగొని దేవర, మతిమెత్తన చుఱుకుపలుకు, మధురపుచూపుల్
సతిమతిఁజొఱఁబాఱంగ భ, వతీభిక్షాం దేహియనుచుఁ బలికెఁబలికినన్. 190

గీ॥ అబలమంచెందుఁదనచూడనట్టివాఁడు అందమునడెందమందల్లఁజిందువాఁడు
పలుకుపలుకునఁ దేనెలుచిలుకువాఁడు, ఏమియుత్తరమిచ్చుటో యెఱుగఁదయ్యె,

గీ॥ బిచ్చగాండ్రెవ్వరచ్చటవచ్చుజాడ, యెఱుగదాబాలశిశిరమ్ము లెన్నియేఁగె
నిల్లుఁగ్రొక్కుచువచ్చినయల్లవాని, కెల్లమర్యాదసేయుటో యేమియెఱుఁగు 192

సీ॥ పోయివచ్చెదఁబొద్దెక్కిపోయెనపుడె బిచ్చమేదేనిగొందునీయిచ్చినంత
కాకనాపాటవిననీకుఁగలదొయేమొ యనియెఁజిరునవ్వుతోఁ హరుఁడప్పుడబల,

కం॥ ఉలికిపడియతనిపలుకులఁ, దెలిసియునొకకొంతకలఁగి తెలియక పైఁగ్రొం
బులకలు చెలంగ గద్గద, గళమున్ సవరించుకొనుచుఁ గడకిట్లనియెన్. 194

గీ॥ ఏదిమీయూరు పోయెదవెచటికిప్పు, డేమికావలె నీబిచ్చమేమి? చెప్పుమ
బిచ్చమిడరెవ్వరిచటనీయిచ్చయేని, యివియెగ్గొమ్మనీవెయీయిల్లుగుల్ల. 195

వ॥ అని తన్నెఱుంగనీయని మనోవికారమ్మున. నమ్మెలంత పలుకుటయునమ్మాయాభిక్షుకుండు. 196

కం॥ జడదారిపడఁతినుసుగుం, దడబాటుకుగబ్బిగుబ్బ తడబాటునకున్
వెడనగి పిడికెడుబిచ్చ, మ్మిడబోయెడినాకునీదు నిల్లేలనుచున్. 197

కం॥ మొఱకుఁదనమ్మునబోమముడి, గిఱుకున వెనుదిరిగిపోవఁ గెరలినయట్టుల్
చఱచఱరెండడుగులుముం, దఱికిదుసాగసరినిజూచి తత్తరపడుచున్. 198

కం॥ పఱవకుపఱవకుమోయీ, యఱవకునీయిచ్చవచ్చి నట్టులెయనుచున్
గఱకంఠువెనుకకొంగును, బిఱబిఱఁదరళాక్షిపట్టి వెనుకకులాఁగెన్. 199

కం॥ లాఁగిననాఁగినయట్టులె, యాఁగుచుఁదలఁద్రిప్పినన్న నంటకుమనుచున్
రాగిల్లునెలఁత మోమునఁ, దోఁగెడుభావమ్మురసము తొట్రిల్లంగా. 200

కం॥ నీవిచ్చుబిచ్చమేమియు, నేవలవను నేనుబోక నిముసమ్మైనన్
నావల్లభ,గినియును.నా, తావల్లదె తెల్లకొండ, దాటినసుమ్మీ. 201

గీ॥ అనినఁజాఱుచుఱఁజూచి యల్లంతయొఱఁగి, కనులఁదడివెట్టి పెడకేలఁగబరిఁజుట్టి
జాఱుపయ్యెదఁజనుకట్టుసందడింప, ఁబదనుమించినతొడుకయిభామపలికె. 202

కం॥ నీయిల్లిదెకాకున్నదె, పోయెదననితల్లడిల్లి పోయెదవేలా
నీయిల్లాలనబెదరెద, వాగయ్యాళివిడిచి బ్రదుకగఁలేవా?. 203

కం॥ రారమ్మిదె సైఁపఁగఁగడు, భారమ్మీ మదనబాధ పలుకకుమనుచున్
గేరుకొనుచుఁ దరుణిబలా, త్కారమునఁ గుటీరముఖము గాఁ దిప్పె నెడన్. 204

కం॥ విడువిడు తరుణీమనలన్, బెడవారలు చూచినవ్వ విధమిది యేలా
నడునడునని నడపించుచు, నడబెడఁగున నడగ విడిచి నవ్వుచు ననియెన్. 205

ఆ॥ వె॥ ఇంటివారు వచ్చిరేని దిమేలౌనె, తోడివారలేమి యాడికొనరె
రమణి చిలుక, కోటరమ్మునఁ జూడుమీ, చిత్తగించె మనదుచేష్టలెల్ల. 206

కం॥ అనవినికనితనమనమున, వనితయు బలపడినమదన భరమున ననియెన్
ననుఁ గొనిచనుమిఁకఁ బదపడి మనయునికికి వెలవకచట మనియెద మనుచున్ 207

వ॥ అనుటయు నాకుహనాభిక్షుకుండు గరువంపు నగవు చెన్నున వింతయొఱుపగు మొగము
నొకింత మలంచి యెత్తి. 208

ఆ॥ వె॥ వెలఁది నీకు నింతగలదె ధైర్యమ్ముగ, యెవ్వాళిగంప నాదు వాలిపుమ్మ
చెప్పలేదటంచు దెప్పెదవో యేమొ, కొండదొరలబిడ్డ చండికాళి. 209

మ॥ అనియుం కేమియొ పల్కుచున్న యెడ నయ్యాట్యాక్షి వారించి, నా
చనవింతైనను జెల్లనిమ్మది యెమీ స్వాంతమ్ము బాధింప, నా
యనుమానమ్మను మానుమన్న నగియెన్ సరే దీనికై
కొనుమంచుం దనసంచియామె మెడఁ గీలొత్తెన్ హాసవ్యక్తిఁగాఁడై. 210

కం॥ నాసంగతిగాదనిఁ దా, నాసంగతనొప్పి వెంట నటుగొనిపోఁగా
నీసొద లెనపుడు నామది నాసంగతి యిపుడు చెప్ప నదిసిగ్గయ్యెన్. 211

కం॥ అటులా కుటిలాలకదన, నటనకు లోఁబడుచు వెంట నడచెదు నెడలన్
బటునట నామటనాలం, పటుఁడౌపయి వలయుపనియుఁ బరిపూర్తిగనన్. 212

శా॥ ఆలాపించెనురాగ మాశ్రమమువారా బాల గోపాలముల్
గేలొక్కించుకయెత్తివీనులను జిక్కింపంజలింపన్మ్రతుల్
వేలందాకెదు వార్ధివీచికలటుల్ విచ్చేసి రచ్చోటికా
వేళంగొందఱుభాగ్యలాత్మ గృహకుంభీపాక మందుండినన్. 213

సీ॥ జాఱుకోకలవారుమాఱుపైఁటలవారు, తేఱిచూచుచునోరుతెఱచువారు
చంకబిడ్డలవారులంకెపేరులవారు, ముక్కున వ్రేలిడితక్కువారు
సగమునిచ్చినపాలనెగ చేపుతల్లుల, వెంబడుపసులకదంబములును
నాలవెంబడిలేడికాలితొ్రక్కులవచ్చి, యత్తఱిచూచువనాంతరులును

గీ॥ చిత్తరువులట్లునిల్చి చూచెదరెకాని, పూనియొకరైన నాబిచ్చగానిఁగాని
వెనుకనిల్చినమునిపత్నివిధముగని, కనరు తలఁపరు నౌనుగాదనరు చనరు. 214

గీ॥ అదిజగన్మోహనమునిత్యమద్భుతమ్ము, సత్యమానందజడము నిష్కంపసుఖము
నేమిపుణ్యమ్ముచేసెనో యేమొకాని, తోఁటిమునిపత్నిమూలమీపంటకెల్ల. 215

సీ॥ తమభర్తలనెకాని తక్కినవారిమో, మెఱుఁగనివారలే యెల్లవారు
నాశ్రమమ్మునువీడి యడుగటుపెట్టని, యతిసుకుమారలే యచటివారు
పుణ్యమ్మునకుబిచ్చమును బిల్లికేనియుఁ, బెట్టనివారె యావీటనెల్ల
వసమానలసమాన కుసుమాస్త్రశస్త్రసం, పదలెయాయున్న సౌభాగ్యవతులు

గీ॥ వీరికెల్లరకెల్లలైపేరుమీఱు, వారలెల్లరునిండ్లనున్నారు వారి
వెంటఁగొనిరాఁగవీరలువెంటరాఁగ, నేఁగెఁబరమేశ్వరుఁడువారియిండ్లకపుడు. 216

సీ॥ తనమతిచెడకుండఁ దలుపువేసినసాధ్వి, దొడ్డిపై మదుమూఁకి దూఁకివచ్చెఁ
దనచెవిఁబడకుండఁ దలచుట్టుకొత్తడి చూచువారలునవ్వఁ దోఁచివచ్చెఁ
దనసోయగముమూలఁ దాఁచినయెలనాగ, ముడిపీడువలువల ముందునిలిచెఁ
దనపేరుగాపాడికొన డాఁగుభామిని, బట్టబయలుగవచ్చి నిట్టనిలిచె

గీ॥ నెవ్వరెవ్వరుసుకృతమ్ము నెంతచేసి, రంతకంతయెకాకింక నంతకంత
కతిశయమ్మయి ఫలియించెనపుడుహరుని, కపటభిక్షుక వేషసంఘటనమందు. 217

గీ॥ ఉన్నవారున్నయటు లింటనున్నపనుల,విడిచి రోఁకలి,పిడులు,దువ్వెనలు,జడలు
విడకవచ్చిరి వంటింటిపడతులుదుకు,తడుపుమడిబట్టలటుచుట్టితడలికొనుచు,218

ఉ॥ వచ్చిరియత్త కాశినులు వైశమ పచ్చడిసేయుబండలన్
గ్రుచ్చియ ఛీత్కృతుల్ వెలయఁగొప్పవిడం జిఱుగందు మేనులన్
బచ్చిఘటమ్ము నీరుబుకివచ్చసరీతిఁ జలత్కుచమ్ములన్
దచ్చనలాడునప్పిఱిఁది తల్కుతళుక్కులు పిచ్చలింపఁగా. 219

వ॥ ఇత్తెఱంగున వెలువడిన యత్తలోదరులా సుందరేశ్వరుని వెంపడిం దారుకామునీంద్రులఁ
జేరుటయాదిగాఁ గడమవృత్తాంతమ్ము మీ విన్నయది కాదె యని పలుకుటయు నమ్మహా
మునులచ్చెరువంది పలువిధమ్ముల నాగోవిందు నుతించిరంత. 220

మ॥ అసిధారావ్రతశీలశాలికి శివధ్యానైకసంసీలికిన్
వ్యసనాస్పృశ్యపవిత్రవృత్తునకు నిత్యప్రౌఢసారస్వత
వ్యసనాధీనునకుం గవీంద్రగురుదేవామోఘదాశీర్వచః
ప్రసవోత్తంసితకావ్య సంతతిమహాభాగ్యైకవిభ్రాజికిన్. 221

కం॥ శ్రీమరాంబానందనునకుఁ, గుమారకవితావినోదగోష్ఠీనిరత
ప్రముదిత చిత్తాంబుజునకు, సమస్తకల్యాణనిలయ సౌజన్యునకున్. 222

మంజుభాషిణి॥ రమణీయ భవ్యగుణ రాజధానికిన్
సుమనశ్శిరస్సుమితసూక్తిధానికిన్
గమనీయ దుర్గకును గావ్యకన్యకన్
రమణుండుతండ్రికవిరాజమౌళికిన్, 223

మ॥ వరదుర్గాపద పూజనాకలితసౌభాగ్యాబ్ధియౌతల్లి యా
పరదుర్గాంబికపట్టి భక్తినొనరింపంబూను కాంచీపురీ
శ్వరమాహాత్మ్యమునందు నాలవది యాశ్వాసమ్ము దీనిన్మహే
శ్వరుఁ డాచంద్రము నాహిమాలయముగ న్వర్ధిల్లఁబోషించుతన్ 224



# కాంచీఖండము.

## పంచమ ఆశ్వాసము — 147 పద్యములు.



కం॥ శ్రీవిశ్వనాథనరపతి, సేవితునకు మధురరసవి స్ఫూర్తిరకవితా
ప్రావీణ్యునకును సంతత భావితశివపాదభక్తి పరతంత్రునకున్. 1

వ॥ అమ్మహావిష్ణునకు నమస్కరించి, యాలోకమాత. 2

ఉ॥ చెప్పఁగరానియప్పలుకు చెప్పకయుండుట లెస్సయెంతయున్
జెప్పక చెప్పుచున్నదటఁ జెందినయట్టిమహత్త్వ మెల్లమీ
యిప్పటిరూపు రేఖవచియింపుఁడి, యాపయి నేమిసేసె, మీ
యప్పసిపాడు వానికథ లద్భుతమంచును విందునెప్పుడున్. 3

వ॥ అనియడిగిన, నన్నారాయణుండు శాస్త్రభైరవకథా శ్రవణకుతూహలుల నూరులంగనుం గొని, సకౌతుకమ్ముగా నిందిరను పలక్షించి యిట్లనియె. తొల్లి మేరువున ముంచమంతమ్మను పర్వతమ్మున మునులు ఘోరమ్ముగ తపమ్మొనరించుచున్నవారికిం బంచముఖుండగు బ్రహ్మ సాక్షాత్కరించిన వారలయ్యనఘు యథార్థమ్ముగఁ బూజించి. 4

— ✻ బ్రహ్మకు వేదమునీశ్వరుమహిమ చెప్పుట ✻ —

కం॥ ఎవ్వఁడుసృజించుజగముల, నెవ్వనియందణఁగు,ముక్తి నిడుటకునీసుం
డెవ్వఁడుపరాత్పరుండగు, నవ్విభుఁదెలియంగఁబలుకుమయ్య మహాత్మా. 5

వ॥ అని యమ్మహాత్ముం బ్రార్థించిన. 6

కం॥ నాయందకలుగునిఖిలము, నాయందయణంగు,లేదు నాకన్నఁబరుం
డేయెడలనన్నుఁగొలిచిన, బాయున్ భవబంధమనియెఁ బంకజభవుఁడున్. 7

వ॥ వారలప్పలుకులాదరింపక వేదమ్ములనర్థించుటయు నవిమూర్తిమంతమ్ములై. 8

కం॥ కేవలరాజస,మోహసు మావిష్టములజునినుడులు మన్నింపక, తా
మావిర్భవించి వేదము, లావిధికింబల్కె విమల మగునర్థమ్ముల్. 9

గీ॥ అందుఋగ్వేదమనియెవిశ్వాధిపుండు, నధ్వరమ్ములువేల్పులకతఁడువిభుఁడు
నీశ్వరేశ్వరుఁడగునమ్మహేశుకనుల, ముందునినమొన్నఁబుట్టినబుడుతవీవు. 10

గీ॥ వేదములలోననాపేరువెలసెనద్రి, మందుశివదేవుఁబలుకుపుణ్యమ్ముకతన
నంశములచేతశాసించెనఖిలమతఁడ, విశ్వకారణుఁడనియజుర్వేదమనియె. 11

గీ॥ ఎవనియాజ్ఞాబలమ్మునకెదురుపలుక, వెఱచునీపంచభూతముల్ వినతుఁడయ్యె
వజ్రియొకగడ్డిపోఁచకాపరమశివుఁడు, విశ్వకారణుఁడనిసామవేదమనియె. 12

గీ॥ ఆకసమ్మునుజర్మమ్మునట్లుచాల్ప, నయినయప్పుడుమోక్షమ్మునందవచ్చు
హరునివిడనాడియితరులనర్చచేసి,యనుచుహసియించెనపుడథర్వణమువిధిని 13

వ॥ ఇట్లువేశ్వరఁబలికియుందొలి చదువులొక్కమొగి నప్పితామహుంగని యొక్కటిగా నిట్లనియె. 14

గీ॥ వేదశాస్త్రపురాణముల్ వెడలియెందు, నెవనిబోధించుసకలమ్మునీశుఁడనుచు
నాతఁడొక్కఁడయారాధ్యుఁడగునుగాదె, చేరమోక్షార్థులైనయెవ్వారికేని. 15

కం॥ జ్యోతిర్మయుండుబ్రహ్మము, ఖాతుఁడుపరతత్త్వమాదికారణుఁడమరుం
డాతండయీశ్వరేశ్వరుఁ, డేతన్మాత్రులకుమనకు నిట్లనదగునా!, 16

వ॥ అనినవెఱనవ్వునగి యహంకారవిమోహితుండై యయ్యజుండు. 17

గీ॥ ప్రణవరూపమ్మునిమ్మశిబ్రహ్మమేడ, తామసుండునుసకలవిధ్వంసకుండు
రుద్రుఁడెక్కడపామ్మనిరోసపడియె, నంతనొకవింతతేజమత్యంతమగుచు. 18

క॥ ప్రాదుర్భవించిప్రణవము, కాదనిబోధించెఁగమల గర్భునివలఁదుగ్
గాదసియె నేనుఁజని,యు, వ్వాదముగాదన్నఁబట్టు వదలఁడయింతన్. 19

—※ భైరవుఁడు బ్రహ్మశిరము ఛేదించుట. ※—

క॥ ఆదిత్యజాతవేదో, వేదింబటుజాతరూపవిగ్రహము మహా
వేదార్థమఖిలనేత్రము, ప్రాదుర్భావమ్ముఁజెందె భాసురమగుచున్. 20

క॥ ఆరూపమ్మనుబుత్రిక, రారమ్మనిపిలిచె విధియుఁగ్రచ్చఅవచ్చెన్
ఘోరమ్మశూలముంగొని, భైరవుఁడందుండిభయదభాంకారమునన్, 21

శా॥ బ్రహ్మాస్త్రమ్మనువైచె వానిపయిననాత్రిజీవగర్భుండు నా
బ్రహ్మాస్త్రమ్మనుమ్రింగి వాఁడుఆశపై పైవచ్చిచేగోట నా
బ్రహ్మద్రోహిశిరమ్ముఁద్రుంచె నచటంబ్రత్యక్షమై యీశుఁడా
బ్రహ్మన్ మృత్యువుబారినుండి తలఁగన్వారించి యాభైరవున్. 22

శా। మోహమ్మెల్లనడంగి సాఁగిపడియాముక్కంటిపాదమ్ములన్
బాహిద్రోహిణమంచు వేడుద్రుహిణుం బాలించియాభైరవున్
సాహంకారులరక్తభిక్షఁగొని రమ్మాయంచు శాసించె నా
స్వాహానాథలలాటుఁ డాతఁడుచనెన్ బ్రహ్మాండముల్ద్రిమ్మఱన్, 23

మ॥ ఒకలిప్తంజనుదెంచె వాఁడుమరలన్ హమ్మంచుపెక్కుల్ విరిం
చికపాలమ్ములుదండలై వికటవృత్తిమన్నంటింపం గుభి
తకరాస్వీకృతరక్తభాండ భరణోచ్చానాంసతుంగాకృతిన్
వికటాంఘ్రిన్యసనమ్ములన్ ధరణికంపింపంగ నర్తించుచున్, 24

గీ। రమ్మపుత్రిక! రమ్మరారమ్మటంచు, వానిఁదనకౌఁగిటికిఁజేర్చి పట్టుకొనుచుఁ
గాలభైరవకోపమ్మశాలుననుచు,నుగ్రరూపమ్మహరియించెనుగ్రుఁడపుడు,25

గీ॥ అనుపమానమ్మదివ్యమత్యద్భుతమ్ము, బ్రహ్మగర్వాపహరణముగ్రమ్ము శాస్త్ర
భైరవునిలీలఁగాంచిసంభ్రమముతోడ, నేనువలఁగాసిశివదేవు నలమిమ్రొక్కి. 26

గీ॥ నీవ భవుఁడవునీవల్లనిఖిల మొదవు, నభవుఁడవునీవుజనిమనీక భ్రమమము
హరుఁడవఖిలమ్మునకుమృత్యుహరుఁడవీవు శంకరాభిఖ్య నీయందెసార్థకమ్ము. 26

సీ॥ అంగీకృతుండుననంగీ కృతుండయ్యె, మదనుఁడెవ్వనిచూపుఁ గదియ నంత
శ్వీకృతమ్ములును నశ్వీకృతమ్ములునయ్యె, నిగమమ్ములెవ్వాని నికటమందు
స్త్రీభావమందియు స్త్రీభావమందితి, నేనువున్నవని నిరీక్షణమునఁ
బరమవాగర్థప్రపం చోపమేయమ్ము, దాంపత్యమెచ్చోటనింపుమీఱు 28

గీ॥ మెట్టుగుట్టలుదాను జేపట్టుకొండ, లయినఁగలధౌతమయములౌనట్టివిభుని
శివునివామాంగజానినచింత్యమహిము నిన్ను సేవింతుమయ్యయోనిటులనయన.

కం॥ అనిమునులునజుఁడు నేనుఁగ, వినుతించితిమభవుఁ బెక్కువిధములశివుఁడుఁగ
గనికరముచిలుకుచూపుల, ననుగ్రహించుచునుమమ్మనటఁగనుఁదోలఁగెన్. 29

మ॥ అపుడాభైరవుఁడేగి కాంచిపురికేకామేశ్రుఁబూజించి వి
శ్వపతిఁ శంకరునాదిదేవునిప్రతిష్ఠంగొల్చియయ్యాశు సత్
కృపకుంభాతుఁడునై వసించెనచటం దివ్యాబ్దముల్ భక్తులన్
గృపరక్షించుచునుండువాఁడె నిజశాస్తృత్వమ్మమోఘమ్ముగా. 30

గీ॥ అంటనేరవుర్స్వప్నమందైనఁగాని, చోరవిషవహ్నితస్కరకౄరజంతు
శాకినీగ్రహబాధలెచ్చటనుగాని, భైరవస్వామిభజియించుభక్తులకును. 31

కం॥ దాక్షాయణీవినోదికి, దక్షిణభుజమతఁడు విశ్వదహనమునందున్
శిక్షింపుట రక్షించుట, భిక్షించుట వానిపనులు విశ్వప్రజలన్. 32

గీ॥ ఆదిభిక్షుకునకు నాకునల్లనాఁడు, దారుకావనిఁబుట్టినవీరుఁడగుటఁ
దెలుపుమైచాయ నెత్తెఱితిరిపెమునను, హరిహరాద్వైతరూపశుద్ధాంతమతఁడు, 33

వ॥ కాలభైరవుండు, వటుకభైరవుండు శాస్త్రభైరవుండు, నివిమొదలుగాఁ బెక్కునామమ్ములం
బెక్కురూపమ్ముల భక్తాభీష్టప్రదుండై వెలయు. 34

చం॥ అనుటయు మునిచంద్రులు, మహాత్మ కడుంగడు విస్మయావహ
మ్మనితరసామ్యమాఁగ్రిరసమంచుఁ బ్రసిద్ధము నైన వీరభ
ద్రునిచరితమ్ము చెప్పఁగదె దుందుడు కేమియొనర్చె దక్షుఁడా
తనిమనుజనమ్ము భగ్నమగు తత్క్రతుమెద్దియనంగ వెన్నుఁడున్, 35

కం॥ కమలెస్సయడిగితిరినా, సుమలకుశక్యమ్ముగాదు నోడువఁగదీనిన్
దడఁబడకుండఁగనయినన్, నోడివెదమీకోర్కెకయి వినుఁడనిపలికెన్. 36

—※ దక్షునికొడుకులకు నారదుఁడు శివభక్తి బోధించుట ※—

గీ॥ బ్రహ్మవనుపున, దక్షుండు ప్రజస్సృజింపఁ నానవెట్టెనుసుతులహర్యశ్వముఖుల
వారలొకచోటసర్జనోపాయమరయ, మదివిచారించు నెడల నారదుఁడువచ్చి, 37

గీ॥ బ్రహ్మమనుమలుసభఁదీర్చి పరమనిష్ఠ, దేనిసాధింపఁదలఁచిరో తెలియఁగోరి
యడిగెఁజెప్పుడిమీరలోయయ్యలార, చెప్పఁదగు నేనిమీ చేయుచింతనమ్ము. 38

గీ॥ అనినవారెల్లరతనితోననిరిమమ్ముఁ, బ్రజలసృజియింపమాయయ్యపనిచెనదియు
మొదలుపెట్టంగనొకచోటమూఁగిదాని, కగునుపాయమ్మునరసెదమయ్యయిప్డు.

గీ॥ ఒకనిమార్గమ్మునచ్ఛదింకొకనికిందు, నరయగర్తవ్యమిదమిత్థమనఁగరాదు
పేర్మిదయగలవేనియావిధము సెప్పి, మమ్ముఁగరుణింపుమన్న నవ్వానినగుచు, 40

కం॥ ఓహోహోదక్షునిసుతు, లాహా మీాయంతవార లరయనియదినే
నూహించిచెప్పదొరకొన, సాహసమాఁగాదె బ్రహ్మచారులకరయన్. 41

గీ॥ ఎల్లలోకమ్ములనుబంచకృత్యుఁడైన, హరునిచేఁబరుచేఁబరాత్పరునిచేత
నగునుమీా కేలలేనియాయాసపడుట, యడుగుత్రొక్కఁగనేల కాల్గడుగనేల. 42

గీ॥ బంధమునుండి వేఱొక్కబంధమునకుఁ బాలుపడునట్టిమూర్ఖులెవ్వారుగలరె
యల్లశివపూజవిడిచినన్నల్లయవియు, బంధకారణములుగదా ప్రాజ్ఞులార. 43

కం॥ పురుషార్థమ్ములయందుం, జరమముపరమమ్ము మోక్ష సంగతియగుటన్
బరికించిదుఃఖకారక, మురుతరకర్మమ్ము విడుచుటొప్పగు నెందున్. 44

గీ॥ ఒక్కయనృతమ్ము నిలుప వేఱొక్కయనృతమాడు దుష్కర్మ కట్టుల పాడితప్పి
యపుర మీాయంత వారలునరయకుఱక, కర్మబంధమ్ముదవులుట కార్యమగునె 45

కం॥ శివకరము శివతరమ్మును శివరూపము చిన్మయమ్ము శ్రీకరమగుటన్
భవముడుఁగమీారలునమ, శ్శివాయమంత్రమ్ము నెఱిఁగి చేరుఁడు శివునిన్. 46

కం॥ అనునారదువచనమ్ములు, వినివారలుసృష్టిపథమువిడిచి, శివధ్యా
ననిరతులగుటను విని కడుఁ, గనలుచుదక్షుండుపిలిచి కశ్యపుఁదపసిన్. 47

— దక్షుఁడు నారదునిశపించుట —

శా॥ ఓరీనారద క్రొవ్వినానుతుల కేదోమంత్రముంజెప్పి సం
సారస్ఫారసుఖమ్ములుం జెడ నిటుల్ సన్యాసమిప్పించి,నా
వేరా, దిమ్మరి దీనికిన్ ఫలము నీకీజీవితమ్మందిఁకన్
నారీసౌఖ్యములేక కుందుమనుచున్ శాపమ్ముసంధించినన్. 48

కం॥ కలకలనగియతఁడిట్లను నలుకంగొనియలుకవడెను నంత లెమీరల్
తెలియఁగనాతప్పిదమిం, దులవమ్మునుగలదె పలుకుమురుసులు తగునే. 49

ఉ॥ తిట్టినఁదిట్టవచ్చు గురుదేవులుమీరలు నాకుఁగాన మీ
తిట్టినతిట్టె నాచరితదిద్ది కళంకము బాపి యెంతయుం
బెట్టనికోటయయ్యెఁ దనపెంపుగణించెడి పెద్దలొక్కటం
దిట్టినతిట్టులుం దిరిగి దీవెనలౌఁగద పిన్నవారికిన్. 50

గీ॥ ఆశ్రయాశునిబోలిమీ యలుకమిమ్ము, దగ్ధమొనరించుగాక నాతమమునడఁచి
వెలుఁగఁజేసెనునాదుజీవితమునరయ, నింటికిని జ్యేష్ఠయగుఁబొరుగింటిలక్ష్మి. 51

ఉ॥ ఏమిటనాదొసంగు పరమేశ్వరుఁజేర్చుట దేమిదోసమా
తామసమానినీవు తెగుదారితెనమ్మన నాడఁజెల్లునే
తామసియెందునుంగనఁగఁదామసి యన్నదెఱుంగవోటు ని
న్నేమననేల నీకనులనీవె కరాంగుళిఁజొన్పిచీరఁగన్. 52

కం॥ వినుమిదిభవితవ్యమునీ, వొనరుపఁ దలపెట్టుయాగముగ్రనిరీక్షా
కనదగ్నిబూదియగునని, పనివినియెనునారదుండు వచ్చినత్రోవన్. 53

వ॥ అప్పుడాదక్షప్రజాపతియు. 54

గీ॥ పురుషసంతతి వమ్మయిపోవుకతనఁ, గనియెనేఁబండ్రుకూతుల ననుపమాన
రూపసౌభాగ్యలావణ్య దీపితలను, గీర్తిముఖ్యులఁగని సృష్టికృత్యమునకు. 55

కం॥ పదుగురఁ బదుమూవుర నిరు, వదియేడ్గుర ధర్ముఁడనఁగఁబడు మనువునకున్
విదితుఁడుగశ్యపునకు, స, మ్మదమునఁజందురుఁడు విబుధమాన్యునకిచ్చెన్. 56

వ॥ వారివలన, నాదిత్యులు, దైత్యులు, కాద్రవేయులు, మున్నుగానీనిఖిల విశ్వము నెల్ల
వెలసెనంత. 57

గీ॥ దక్షునిల్లాలు గావించు తపము మెచ్చి, యామె కాత్మజ యయి పుట్టి యాదిశక్తి
భవుని ధవునిగ వలచి చేపట్టెనంత, సతియు దాక్షాయణియు నాఁ బ్రశస్తిఁ గాంచి. 58

— * దక్షుని యజ్ఞము * —

మ॥ తన దౌహిత్రిమయమ్ము విశ్వజగముం దక్షుండు దానన్నిటన్
దనకుం బూజ్యుఁ డొకండు లేఁడని కడుం దర్పించి బ్రహ్మాత్మజుం
డొనరింపం దలపెట్టె యాగ మొకఁ డత్యుత్సాహియై, పిల్చె, దే
వనికాయమ్ముల నెల్లలోకముల, నాహ్వానింపఁ డయ్యీశ్వరున్. 59

ఉ॥ భావము లేని వాక్యము, విభావము లేని రసమ్ము, సత్యసం
భావన లేని కూర్మి, యనుభావము లేని ప్రియోపగూహమై
కేవలశబ్దసుందరము, కించిదపశ్రుతి గీత, గీత రా
గావిలమయ్యె జన్నమది యాయఖిలేశు నసన్నిధానతన్. 60

గీ॥ అరయ సర్వాంగసుందరి యయిన చెలువ తిలకహీనమ్ము మొగము నా వెలుఁగఁ బాతె
నఖిలవస్తుసమృద్ధమ్మ యయినఁ గాని, చంద్రశేఖరు లేని యాజన్నమపుడు. 61

గీ॥ అఖిలపదములయందును వ్యాప్తమైన, స్పష్టపడనట్టి ధ్వనిగల పద్యమయ్యె
నఖిలవస్తునిగూఢుఁడౌ నభవుమూర్తి, స్పష్టముగ లేని యాదక్షుజన్నమపుడు. 62

వ॥ ప్రణవరహితమ్మైన శ్రుతివ్యాహారమ్మును, నగ్రిగ్రహితంబైన దర్భయుంబలె నాయాగసం
విధానమ్ము శివవిహీనమ్మగుటకుం గుందుచు దధీచిమహాముని దక్షునిం జేరి 63

మ॥ సురమాతామహ! యేమి యాగమిది, యాశూలిం గపాలిన్మహే
శ్వరు రప్పింపఁగదయ్య, యీయెడను, యజ్ఞస్వామి లేకున్న, యీ
సురకార్యమ్మది యెట్లు సాగు, దమలో శోకించియు న్నీకునై
మఱుమాటాడరు దేవతల్మునులు నా మాట న్విచారింపుమా. 64

మ॥ అనవామాటలకల్గి దక్షుఁడపుడా హా,యెంత లోనెంతబు
ద్ధినిగన్నావుర! నాకు ధర్మములనుం దెల్పంగ విచ్చేసితే
చనుమాజన్న మహేశంకరమ్ముగనునే సాగించి సాధింతు, మిం
చినమాటల్వాచియింపఁబోకుర దధీచీ! యంచు దూషించినన్. 65

శా॥ పెద్దల్ మీరలు పిన్నవారలప యుంబెంపేద అాసిల్లుచున్
గద్దింపంబని లేదు నేను, ఋతమున్ ఘంటాపథమ్మెక్కి మీ
యొద్దంబల్కెదఁ దప్పులున్నయెడ మీరొప్పించి శిక్షించి మీ
పెద్దర్కమ్మునునిల్పఁ(నో)క్కొనుఁడీ, వేయేల వాదింపఁగన్. 66

కం॥ చేసెద నశేంకరమ్ముగ, నీసవనమునంచుమీర లింతకుముందే
యీసున మునువెనుగానక, రోసిలియాయన్న పలికె రూఢమ్ముగుతన్ 67

వ॥ యజ్ఞేశ్వరుండును సర్వజగత్కారణుండగు నీశ్వరు నిరాకరించి, నీచేయుయాగమ్ము, శుభా
వహమ్ముగానేర దదియట్లుండె. ౬౮

కం॥ పిలిచినవచ్చితిమప్పుడు, తెలియకనీదుష్టచేష్ట తెలిసినపిదపన్
నిలువంగఁగాదుమాకిటఁ, దెలిపెదఁదెలిసినది చెప్పి తీఱఁగవలయున్. ౬౯

కం॥ అనుచుసదస్యులమొగమై, వినుఁడీ యోప్రాజ్ఞులార, వేగమజన్న
మ్మునువీడి చనుఁడి లేవ, న్ననుజింతించెదరుపిదప నానుడివినమిన్. 70

ఉ॥ రండటురాకపోందు పయిరాఁగలకష్టమెఱుంగ జెప్పితిన్
గొండికబుద్ధినీశ్వరునకుం బరిభూతిఘటింప నెంత, ద
క్షుండగుఁగాక కాళగళు కోపకటాక్షమొకింత సోఁకినన్
మండుచుఁదానబూదియగు మాన్పనశక్యమదెంత వారికిన్. 71

ఉ॥ ఇంతకునున్నమాట వచియించితి మీరలెఱుంగ నట్టిదే
సుంతయులేదు మీమతికిఁ జొప్పడుదానినొనర్పఁ డంచుదా
నంతటనాదధీచిచనె యజ్ఞగృహమ్మును వీడికాంతయుగా
జెంతలసంతలంజనువు శిష్యులురాఁదనవాస భూమికిగా. 72

గీ॥ ఆమునీంద్రునియరుగుటయచటివారిఁ కాత్మహృదయమ్ములరిగినయట్టులయ్యె
హృదయశల్యమ్ముపోయినట్లెంచిదక్షుఁ డరుగనుంకించు వారినల్లంతఁజూచి. 73

మ॥ దురహంకారప్రకార చిత్తుఁడఁగునీదుష్టుండు దాఁబోవుచే
మరిమేలయ్యెనుగాక, నాదుపలుకుల్మన్నించి, నాచేయున
ధ్వరముగా సాంగముగా నొనర్పఁడనుచుం బార్థింప వేల్పుల్మరల్
మఱుమాటాడక నిల్చి యజ్ఞవిధులుల్లాసమ్మునం జేయుచో. 74

వ॥ అప్పుడయ్యాగకుండమ్మునం దగ్నిభట్టారకుండు. 75

మ॥ తనవంశస్థుఁదిరస్కరించె నిపుడీదక్షుండటంచుం చెనో
మునులగ్నిప్రతిమాన మానసులునిర్మోహుల్ మహుర్యజ్ఞవ
ర్తననిష్ణాతులు వేదసూక్తములచేఁదర్పింపఁగఁ దర్పిన్ జగ
జ్జనకుండీశ్వరుమూర్తి దానగుటనోసాక్షాత్కరింపం డటన్.

—※ దాక్షాయణి తండ్రియజ్ఞమునకేగుట ※—

చ॥ తనపితజన్నముంగనఁగ స్థావరజంగమమైన లోకమె
ల్లనుజనుచుండఁజూచి సతి లాలితశంకరవృత్తచిత్తయై
యనఘ!యనుజ్ఞనీయఁగదవయ్య, యనుగ్రహమొప్పనాకు, మా
జనకుఁడుసేయుయజ్ఞమది చక్కఁగనేఁడిదె చూచివచ్చెదగా, 77

కం॥ తనయుంతేఁబిలువవలెనా. జనకుఁడుతనతనయ,నిట్టి చనువుగు చెల్లున్
వనితలకుఁబుట్టెనింట్లను, జనవున్ మన్నింపరనుచు సాగిలి వేఁడన్, 78

వ॥ నగుచు వాలోకశంకరుండు దనయిల్లాలి నీక్షించి. 79

కం॥ వినవో గాకిది నీమది, కనవో యోవికచవిమలకమలాక్షిరో నీ
యనుఁగుం దండ్రియు ననుఁగా, దని చేసెడిజన్నమునకు నరుగందగునే. 80

కం॥ అనుటయు భవాని యిట్లని యెను మిముగాదనెడియాగ మేలా చెల్లున్
జని యపుడ చూచివచ్చెద, ననుమతి యీఁగదవె నాకుఁ బ్రాణేశ దయన్. 81

కం॥ ఎన్నండు మిమ్ముఁ జేరితి, నిన్నాళ్లకుఁ బుట్టినిల్లు దెట్టిదో యెఱుఁగన్
నన్నపుడు గన్నవారిని జన్నము నెపమునను గాని చని చూతు విభూ. 82

కం॥ మిముఁ గాదనియనుఁగాక, నిగమచూడాచరణశీల! గనుగొనవే మిక్కా
తమమెచ్చుసుతను గాదన, సమయు టెకా, తప్పించనఁగ శక్యమ్మగునే, 83

వ॥ అనియిట్లు బహుప్రకారమ్ములఁ బితృగృహగమనాభిలాషమ్ము మరలింపనేరక. 84

కం॥ ఆర్య యటు దన్ను వేడిన, కార్యమ్మును ద్రోసిపుచ్చఁగాఁ దలఁపక యా
చర్యయసివార్యమని యా, యార్యకు సెలవొసఁగెనంత నాయమయు దమిన్. 85

కం॥ తనపుట్టినింటికరిగినఁ, గనికనరును బలుకరింపఁగా నొల్లరు పి
ల్చిన నొక్కరు బదులాడరు మునుఁదన పలుకెదురుచూచు ముఖ్యులయందున్. 86

సీ॥ అక్క కద్రివ యెప్పుడరుదెంచితే యన్న వెనుచూడక యయ్యామె వెడలిపోయె
నఁటతికి నెదురేగి యక్క సేమమె యన్న వినిపించుకొనకామె వెనుకనొదిఁగె
కృత్తికా! రోహిణి యెక్కడే! యననామె, గొణుగుచు విదలించుకొనుచుఁ బోయె
నమ్మరొ యెక్కడనున్నదమ్మ చిత్రా! యన్న, బనియున్నదనియామె పక్కకరిగెఁ

గీ॥ గానియచ్చట నొక్కరుగాని మాఱు పలుకరేమనియులుకుచు భవునిరాణి
చెఱచఱను బోయెఁ దనతండ్రిసవనమండపమును జేరంగఁ దమయంత
భటులు దోలఁగ, 87

కం॥ తనుఁజేరి పాదములఁబడు, తనయం బెడకాలఁ ద్రోఁచి దక్షుండంతన్
మునులెల్లఁ గాదు కాదని యనినన్వినిపించుకొనక యాగ్రహవృత్తిన్. 88

కం॥ ఓసీ నిను బిలిచినదెవ, రే సిగ్గింకమ్ము లేక, యేమనియిటకుం
ద్రోసికొనివచ్చినావే, పో సడికింజంకవలసెఁ బోలఁతుకవగుటన్. 89

కం॥ నలకాఁటఁదిరుగుమగనిం, గలియక మాగడపఁ ద్రొక్కఁగా బనియేమీ
తలఁదలఁగుమనియె వినఁడట, వలమునుగుంపనెసి భార్యవచన మొకంమన్. 90

కం॥ పతిమాటవినక వచ్చుట, పితసేయుపరాభవమ్ము వెతబెట్టులెగా
కతివలగుసగుసలును మతి, కతికష్టముగాఁగ సతియు నలుకవొడమియున్ 91

కం॥ నిట్టూర్చి యెట్టకేలకు, దిట్టతనమ్ములవరించి తిన్నని యెలుఁగుం
గొట్టిన కోకిలకుంబలె, నట్టిట్టయి వెడలననియె నల్లనసతియున్. 92

మ॥ తగునయ్యా విధియంతవాఁడవు, మహాధర్మజ్ఞుఁ డెందేని యుం
దగువాఁడంచనిపించుకొంటివి, మహాదక్షుండవే, కాని, యెం
త గుబుమల్ దనయిల్లుసొచ్చినసుతం, దర్పించి దూషింతురే
తగుఁబో నేటికి నైనమం దెలిసె నీతాత్పర్యమిం కేటికిన్, 93

ఉ॥ ఎ తయుభాగ్యుఁ డైన నగునింతలుసేయఁ నెకన్నకూతు వి
న్నింతకుమించ లేదిపుడు నేనియునీశ్వరుఁ బిల్వఁ బంపుమీ
సంతరియుంచు నిష్టికొన పొగఁడలంపది కర్గెనేని, నీ
కంతప్రియాస మేల జనకా! వలకాటికి నన్నుఁ బంపఁగా?, 94

గీ॥ అల్లుఁడయిన:తమామతోనలుకయయ్యె నేమి మీకంపజగదీశ్వరేశ్వరుండు 95
అభవ్రుతను వైనయగ్నియాయరణియందు, నెట్లుజనియించుహరునిగర్హించుమీకు

గీ॥ వల్లకాఁటనుదిరిగెడివాడటంచు, నొక్కదోషమ్ము వలికితివక్కటకట
అదియసిద్ధాంతపఱచునాహరునివిభుత, నేదివలకాఁడుకాదునీవెంచిచెప్పుమ. 96

కం॥ శుభమెఱిఁగి తెలుపవచ్చితి, సభవుండగగౌరవింపుమయ్యాయిఁకైనన్
విభవమ్మడరఁగ ననఁనా, సభయెల్లనుమెచ్చికొనియె సతివచనమ్ముల్. 97

కం॥ మెచ్చుసభమెచ్చిచూడక, మచ్చరమునఁబెచ్చుపెరిగి మండుచునతఁడున్
జెచ్చెరనడునడుమిఁక నీ, వచ్చినదారిని,బిశాచి, బదరకయనుచున్. 98

కం॥ నడవేని వెడలనడఁచెద, నుడిగింపఁగ నెవ్వరడ్డమో చూచెద;నీ
గడుసుఁదనమ్మిటఁజెల్లదు, వెడలుము వెడలుమయటంచు, విడివడుఁబలుకన్, 99

కం॥ ఆదక్షునిధూర్తత్వముఁ, గాదనఁగానేరరైరి కలవారిచటన్
గాదిలిసుతకష్టముగని యాదక్షునిజాయ తెరలి యవనింబడియెన్. 100

కం॥ తనతండ్రియహంకారము. తనతల్లియునవనిఁదెరలు తద్వ్యధమెల్లన్
గని మఱగెడుమదినిజగ. జ్జననిమహాపరుషరోష సంరంభమునన్. 101

గీ॥ ఓరిమహాత్మ! తెలియవో యొక్కమాట, చనువులేటికినీకుయుక్తమ్ములేల
యాలుబిడ్డలనేడ్పించునట్టినీకు, జయముగాదంచుఁ బలికెనిశ్చయముతోడ. 102

వ॥ గుండియయింతలేని నీయట్టివానికిం గూఁతురయిపుట్టుటకంటె నొక్కటాతికింగాఁకుఁబడుట
మేలుకాదె, యనినిరసించుచు. 103

గీ॥ భవునియిల్లాలు యోగవైభవముకలిమిఁ, బవరుబంధిపపభటిచ్చపాటువడియె
నామహత్త్వరతేజమ్మునరయునెడలఁ, గనులుమిలమిలమెఱసి చేతనతఁదొఱఁగె.

— * వీరభద్రావిర్భావము * —

శా॥ యోగాగ్నిం దహియించి దేహము మహాయోగీశ్వర ధ్యాన, గ
మ్యాగోదార వపుర్విరాజిత మహోవ్యాపారముల్ మీఱ, నా
యోగీయారణిఁ బుట్టి మెట్టి సతియుం బ్రాణేశు దేహమ్ము నా
యోగాగ్ని ప్రవిదహ్యమాన తనువహ్న్యుద్గార కీలావళిన్. 105

శా॥ రుద్రాంశమ్మున భద్రమూర్తి యొకఁడున్ రుద్రాణి యంశమ్మునన్
రౌద్రాకారత భద్రకాళియు వడిం బ్రావిర్భవించెన్ జ్వలత్
కద్రూపుత్రక రాళహాల మయరేఖాక్రూర వీక్షావళీ
విద్రావత్త్రిపురక్షకుల్ సవనవిద్వేషైక వేషార్భటుల్. 106

శా॥ ఉగ్రత్వుగ్రుఁడు వీరభద్రుఁడు మహాహుంకారముం జేయఁ బ్ర
త్యగ్రక్రూర మహాయుధుల్ వికటదంష్ట్రాభీషణాస్యుల్ బలో
దగ్రుల్ పుట్టిరి భూతనాథులు మహాహంకారమూర్తుల్ గవా
టగ్రద్వారనిబద్ధ ధావదమరుల్ యజ్ఞాంగ విధ్వంసకుల్. 107

శా॥ ఆకాళీ వికటాట్టహాసమున, సద్యస్స్రాతవిద్ధోఁగ్ర, సిం
హీకంఠధ్వనిఘోరగర్జితలు మధ్యేమాళిచంద్రాంకురల్
వ్యాకీర్ణాంబరలూర్ధ్వకేశలు, పిశాచాళీ పరీవారలే
కైకబ్రహ్మకపాలధారిణులు, దామే తెంచి రుగ్రాకృతిన్. 108

కం॥ వెఱఁగుపడి చూడ దక్షుఁడు, పఱతెంచిన భూతభటులు, పరివారమునం
దఱిముఱి యజ్ఞాంగమ్ములఁ, జెఱిచిరి విఱిచిరి వితాను చేసిరి యంతన్. 109

— * దక్షయాగధ్వంసము * —

కం॥ అమరీకబరీభార, మ్ము మునీంద్రశ్మశ్రుభారమును ముడియిడుచున్
దమునెదురు యజ్ఞరక్షక, సమూహమును ముట్టిగిట్టి చదుపుచు నలుకన్. 110

గీ|| అగ్ని నెసఁగొల్పి చేసిరం దాహుతులను, యాగవస్తుల నెల్లను యాగదండ 111
ములను వేల్చిరి యింధనములుగ విమల, మణులఁ జేసిరి లాజహోమముల వారు,

గీ|| ఒకరు నేరర యా బారినోసరిలఁగ, మంత్రతంత్రమ్ములను శౌర్యమహిమఁగాని
సప్తకోటిమహామంత్రజనకమగుట, నయ్యెశరణమ్ము మాకు పంచాక్షరమ్ము. 112

శా|| ఆక్రోశించెను దక్షుఁడంతట, మహాహంకారరూపుండు, మీ
విక్రాంతుల్ చెడిపోయెనేటికిఁ దపోవీర్యమ్ము శౌర్యమ్ముఁ? రం
డీక్రూరుల్ చెలరేగఁజూచెదరె మీరింతేసి వారయ్యు, నా
ర్తాక్రోశమ్మును దీర్పఁజాలియు వృథా ప్రాణమ్ము లర్పింతురే, 113

కం|| దక్షునిసంతానమ్మట, యక్షీణతపఃపరాక్రమాన్వితమఁట యీ
భిక్షుకపరివారమ్మున, భక్షింపఁగఁబడుటకన్నఁ బరిభవమున్నే. 114

శా|| రా రా! యింద్రుఁడ రా రా సూర్యుఁడవయున్ రావయ్య! యో పద్మగ
ర్భా! రమ్మా యియనంత యోరిగరుడా రారమ్ము జైవాతృకా
చేరం జూచెద వేల రాఁగదవె, యో శ్రీనాధ యంచు న్ననున్
జీరన్ వీరుని భూత సంఘములవిచ్ఛేదింప భేదిల్లుచున్. 115

మ|| భవితవ్యమ్మది దాటరానిదగుటన్ బ్రహ్మాదులుం గూడఁగా
వివిధోగ్రాహవకర్మ శౌండమగునావీర ప్రజమ్మేనుదాఁ
కివిపాటించితి, ఘోరదానవరణక్రీడా మహాసాధన
మ్మవుశార్ఙ్గమ్మున, బాణవాహినుల రాత్యాటోపముల్ నూన్పఁగా. 116

గీ|| చెల్లచెదరైన తనభూతసేనఁ జూచి, వచ్చి వీరుండు కహకహార్భటులతోడ
విఱుఁగ నేసెను శార్ఙ్గమ్ము మెఱపినట్లు, వాడితూపున గరుడి విభ్రాంతిపడఁగ. 117

ఉ॥ నందకమూనియేనతని నారిఁదటాలునఁ ద్రుంచి వేసితిన్
దండడిప్రీలవక్షము నతండుపకాలున, నవ్వి, నెత్తురుల్
చిందెడిచూపుతో విసరి చేగద వైచెజ్వలద్ధవాగ్నులం
దుందడపైన, దానిగడతోఁ గదియించిమరల్చి నవ్వినన్. 118

ఉ॥ ఆర్పఁగరానికోపమున నాతఁడుదగ్రము శూలమెత్తుచున్
దీర్పుముదీర్పుమింకఁ గడతేఱితివీవని వైవనంతలో
నార్పులుబొబ్బలుంజెలఁగ నడ్డముసొచ్చివిధాత, వేడి, ని
ట్టూర్పులభూమిపైనొఱఁగె నుల్లమునుచ్చచనంగ శూలమున్. 119

ఉ॥ అంతకుమున్నమాయజుఁడు దగ్రతఁబూంచినయస్త్ర మెంతయున్
వింతగవచ్చితాఁకెనల వీరులలాటముచిమ్మ నెత్తురుల్
కొంతగడస్సితేఱుకొని క్రుద్ధమృగేంద్రుని లీలచెంగునన్
గెంతుచునగ్గమాసురలఁ గీడ్వడఁజేసెనతండు వ్రేల్మిడిన్. 120

కం॥ తెప్పరిలియంతనజుఁడుం, గుప్పలుగూరలుగఁ దఱిగెకుమ్మువడంగాఁ
ద్రిప్పెడలంగాండీవము గప్పినయాభూతబలము కనుకనిఁ బాఱన్. 121

చం॥ అదిగనిసవ్యభారతి భయంకరమౌపెడవాతియమ్ము, నె
న్నుదురుననాటిధాతగడు నొచ్చికటాలున లాగిదానినిన్
గసిసివిధాతనెన్నొసలు గాడఁగవైచినఁ జూచిమిక్కిలిన్
బెదరెడువాణికింగలిసె వీరుఁడునంతటఁ గాళియుద్ధమై. 122

శా॥ మీకేలాయొకయాడు దానిగవియన్మీదాసి నేనుండఁగా
నాకీబాణమొసంగుఁడంచు నతనిన్ బ్రార్థించి, ప్రార్థించి, దా
నాకర్షించుచుడాసి, రోసమునవిద్యాదేవి ధర్షించుచున్
గోకొమ్మంచును కేసియా సుదతిముక్కుంగోసి గర్జించినన్. 123

మ॥ అజుఁడంతం దనయాలిపాటు గని బ్రహ్మాస్త్రమ్ము సంధించినన్
నిజవక్త్రమ్మున మ్రింగి, పొంగి మునికెవ్వీఁడుంచు, పండ్లూడఁద
న్నె జయింపం బయివచ్చు పూషు, విఱిచె న్గ్గ్లాలికిన్ గోసె, వా
యుజునాల్కల్ శశి ముద్దచేసె నుఱికెన్ హుమ్మంచు నామీఁదికిన్ 124

శా॥ సర్వాస్త్రమ్ములఁ బోరి పోరి యితనిన్ సాధింప, రాదంచు సా
పర్వశ్రేయము, శిక్షితాసురము, శర్వప్రీతిసంభారమున్
దుర్వారమ్మగు చక్రము న్విసరితిన్ ఘూర్ణిల్ల నాకాశమున్
బర్వెం జక్రము వీరభద్రు తలమ్రింగం పిత్రాజాండమై, 125

గీ॥ సకలశాస్త్రాస్త్రసారమ్ము సర్వహరము, ప్రళయభాస్కర తేజఃప్రభాసమాన
మయిన చక్రమ్ము శివుమూర్తి యగుటనపుడు వీరు కాలికి గండపెండారమయ్యె.

గీ॥ యజ్ఞ మప్పుడు భయమంది హరిణమగుచుఁ, బాఱెఁ బాఱిన వెంబడి బాణనిహతి
హరిణమును గూల్చి యట మృగవ్యాధుఁడయ్యె, దక్షుఁ బడఁదన్ని యతనిపైఁ
దాండవించె. 127

వ॥ అప్పుడు దక్షుని భార్యయగు ధరణి, శోకాకులయు, వికీర్ణకేశయు, ముకుళితకరాంబుజయు,
నగుచు నవ్వీరుని డగ్గఱి. 128

కం॥ హాహాకారము లెసఁగం, బాహి విభో పాహి పాహి పతిభిక్షాం మే
దేహి యని వేడు నాలో, ద్రోహి యితఁడనుచు దలను ద్రుంచి మతండున్. 129

కం॥ మా తామహి దుఃఖిల్లకు, మా తాతకు మంచి తల సమర్పింతు ననం
చాతగవరి యజశిరమును, దాతకుఁ దగునంచుఁ దెచ్చి తగ నతికించెన్. 130

గీ॥ అఖిలకల్యాణనిలయమా యాగశాల, వల్లకాఁడయి పోయె నప్పట్టునందు
భార్గవుని మాట సతియన్న పలుకులపుడు, పరమసత్యమ్ము లౌట మాశ్చర్యమయ్యె,

—※ దక్షుఁడు వీరుని స్తుతించుట ※—

ఆ॥వె॥ వీరభద్రపాదవికటతాండవమున, మదము వాసి సత్త్వమహితుఁడగుచు
మొగుపుకేలుఁ ఫాలమున గదియించుచు, దక్షుఁడనియె భక్తరక్షకునకు. 132

కం॥ పొడమిన దురహంకార, మ్మడఁగెను నీపాదకమల మంటినకతనన్
జెడెఁ బాపపటలి మాకిఁక, నిడఁగదె నీచరణసేవయే సతతమ్మున్. 133

కం॥ జ్ఞానలవదుర్విదగ్ధుఁడ, నీనిర్మలరూపమెఱుఁగనేరక పెక్కుల్
కానివి పరుసములాడితి, వానిని క్షమియింపఁగదవె వాత్సల్యమునన్, 134

కం॥ అను నెడ నేమనునాతని, వెనుకనె సాఁగిలుచు మ్రొక్కి వీరుని భక్తిన్
వినుతించితిమి కృపాబ్ధీ, యనుగ్రహింపవె మహాత్మ! యజ్ఞులననుచున్. 135

శా॥ యజ్ఞార్థమ్మయి పిల్వవచ్చి క్రతురక్షార్థముంగా బోరిమా
యజ్ఞానమ్ము ఫలమ్ము గంటిమిటు దేవా! పేర్మి పెంపార, మీ
యాజ్ఞాబద్ధుల బద్ధులన్ హతుల నిర్యత్ప్రాణులం బ్రోచి మా
విజ్ఞప్తిం గరుణింపఁగాఁగదె కృపాబ్ధీ వీరభద్రేశ్వరా. 136

శా॥ ఇంతింతంచు వచింపరానివి మహాహేయమ్ము లెన్నేనియున్
మంతుల్ మే మొనరించినారము మమున్మన్నింపఁగా రాదు, నీ
చెంతం జేరితి మన్నింటం దొలఁచి రక్షింపంగఁ బ్రార్థింతు మ
శ్రాంతమ్మున్ శ్రితపాళి పాలనవినిద్రా! భద్రకాళీశ్వరా. 137

కం॥ శ్రుతివేద్యుఁడయిన నిన్నున్, స్తుతివేద్యునిఁగాఁ దలంచి స్తుతియించెడి మా
మతిమాంద్యముడిపి ప్రోవుము, శ్రితరక్షాదీక్ష! భద్ర శిక్షితదక్షా. 138

కం॥ అనుచుం బెక్కువిధమ్ముల, వినుతించిన నల్లనగుచు వీరుఁడనియెన్
జననీపరాభవమ్మును, గని సైఁచిన దోషమింతగా ఫలియించెన్. 139

కం॥ మీకోర్కులుసిద్ధింపఁగ నా కాంచీవిభునిగొలువుఁడయ్య మహాత్ముల్
రాకేందుకలా శేఖరుఁ. డేకామ్రాధీశుఁడిచ్చు నిష్టములెల్లన్. 140

కం॥ అనిపరివారముఁగాళియు, వెనుకొనవనంతర్ధిఁ జెందె వీరుం డేముష్
జనికాంచిఁగామాక్షీ, మనోధినాధునిభజించి మంటిమిపిదపన్ 141

కం॥ ఇదివీరభద్రవిజయము, చదివినసమకూర్చునెపుడు సకలార్థమ్ముల్
మదిభద్రఁగొలుచువారల, కుదయింపవయీతిబాధ లొండొకఁ డైనన్. 142

వ॥ అని యీ లక్ష్మీశ్వరుండు పలుకుటయు 143

ఉ॥ డాచినకెంపుసొంపుల బెడంగుమెఱుంగుపసిండి కంకణాల్
చాచనిచేతికిందొడి, కెలంకులనిల్చి విశాఖపట్టణ
మ్మూచినయట్లుగానట మహోత్సవముంబొనరించినట్టె దు
గ్గాచిననూకయుంగరుణఁ గాచిన దేవరచేఁ గవీంద్రచే. 144

కం॥ భ్రమరాంబామ్రాత్కమల, భ్రమరగణార్చ్యచరితస్థ, పరమతపశ్శ్రీ
శమదమధనమునివరవీ, రమల్లయారాధ్యపుత్రి రత్నము చేతన్. 145

బంధరగానము॥ పరమశివకథా పరతంత్రునిచే
దురితహరణ, మే దురవీక్షుణుచే
స్మరహరపదపూ జనతత్పరుచే
సరళహృదయభా స్వరవర్తనుచే. 146

మ॥ స్థిరవాత్సల్యవిభూషితుండు ప్రతిభాశ్రీతోషి తాచార్యుఁడీ
శ్వరపాదప్రవణుండునగ్రిజు దయన్వర్ధిల్లు కాంచీపు, రీ
శ్వరమాహాత్మ్యమునందు నైదవదియాశ్వాసమ్ము దీనిన్మహే
శ్వరుఁడీక్షించుతఁబుష్ప వన్నయనసౌభాగ్యమ్ము దీపింపగా. 147





# కాంచీఖండము.

## షష్ఠాశ్వాసము 152 పద్యములు.



క॥ శ్రీదయితునిచేఁగరుణా, యాదోనిధిమల్లికార్జు నారాధ్యునిచే
నాదిమకవీంద్రకవితా, స్వాదుమహా కావ్యసర్గచతురాస్యునిచే. 1

క॥ శ్రీమన్నారాయణుచే, నామునులా గాధవినుచునలరిమహాత్మా
యేమయ్యెహరుఁడుదనసతి, యామెయుదేహమ్మువిడువనది తెల్పఁగదే. 2

—❋ శివుండు దక్షిణమూర్తియగుట ❋—

వ॥ అని ప్రార్థించుటయు నా మంగళదేవత, తన వల్లభుం గనుంగొని, యనఘాయయ్యాదిమ దంపతుల చరిత్రమ్ములత్యద్భుతమ్ములు ఇప్పటి యిమ్మునుల ప్రశ్నమ్ము మదీయ చిత్తమ్మున నాటియున్నదని మున్నఁగనియు వినియుండనివి తీఁరటు గావునఁ దేటపడ వచియింప వేడెదన నవుడు నట్లయగుఁ గాకయని యమ్మురారి సాదరమ్ముగా వారల నవలోకించి. 3

ఆ॥వె॥ అయుతసిద్ధమైనయయ్యాదిమిధునమ్ము, నొకరినొకరువిడుచుటొకటికలదె
కాఁక మొగిలుమాటుకనినఁబొద్దువెలుంగు, కలుగకున్నకనులుగానకున్న. 4

క॥ రవిచుట్టుఁగొలిచితిరుగుచు, వివిధగ్రహమండలములు వివిధాకృతులన్
వివిధఫలమ్ములనిడునటు, శివునిమహత్త్వములనెఱుక సేయఁగవశమే. 5

తే॥ పరమవాగర్థదివ్యసంబంధమెఱుఁగ, మాలిమొకచోటఁబండితమాని యొకఁడు
కలదులేదనుమాత్రనెకలుగకున్న, నిత్యవాగర్థభవ్యదాంపత్యమెందు. 6

తే॥ అట్టిసంబంధమెఱిఁగినయట్టివాఁడు, వాఙ్మనోఽతీతుఁడగుపరబ్రహ్మశివుని
యందువాగాదులర్పించియర్థసిద్ధి, నందునచ్చోటవసియించునిందుమౌళి. 7

కం॥ ఆదిమదంపతులవిహా, రాదులువాగర్థచిత్రితార్థములట్టుల్
మోదప్రదములుదురితవి, భేదకములుబహుళపుణ్యవిజ్ఞేయమ్ముల్. 8

ఆ॥వె॥ అవియునెఱిఁగియిట్టులనుటకెంతటివార, మయిననభవుకరుణననఘులార
యెఱుకగలిఁగినంతయెఱిఁగింతువినుఁడని, శివునిదలఁచిమ్రొక్కిసిరిమగండు. 9

ఉ॥ అమ్మయిదేహమున్విడిచి యాజగదంబజనించెఁ గ్రమ్మఱన్
నెమ్మనమెల్లఁజల్లనయి నిర్మలవృత్తిమహోన్నతిప్రభల్
చిమ్మహిమాలయమ్ము, సతిచేసినతీరనితొంటిపెక్కుపు
న్నెమ్ములపంటయైత్రిభువనీకమనీయతనూమనోజ్ఞయై. 10

ఉ॥ అప్పరమేశ్వరుండుసతి యోగమునం దనువుంద్యజించునా
ముప్పునెఱింగితానటకు మున్నమహత్తర యోగసంపదన్
జొప్పడియుండనయ్యనఘు సూరెలఁజేరుచు మౌనముద్రచే
నొప్పెడునీశుఁగొల్చిరి మహోజ్జ్వలయోగ విరాజితుల్మునుల్. 11

కం॥ వటమూలవాసియగుచును, స్ఫటికప్రభలీనువానిఁ బరమజ్ఞాన
స్ఫుటమూర్తిముక్తిలలనా, నటనస్థలదీక్షుదక్షిణామూర్తిశివున్. 12

శా॥ మౌనవ్యాఖ్యలనెల్ల సంశయములన్మాయించి తత్త్వమ్మునా
మౌనిశ్రేష్ఠులబోధసేయు నభవున్మౌళిస్ఫురన్మల్లికా

సూనేందుస్స్పృహణీయ పల్లవజటాశోభాభిరాముస్సనర్
జ్ఞానార్థుల్ మునిపుంగవుల్ చనిరటన్ దండోప తండమ్ములన్. 13

శా॥ ఆ(శ్రీ)గురుమూర్తిమానసులకుం దానారీతిగా మ్రోతు, భి
తౌ దానమ్మునుజేయుచోం దలంచెనిచ్చన్వారి చిత్తమ్ములన్
బ్రాదుర్భూతము తత్త్వమెంతవరకుంబండించి రోయుంచునా
లోదుద్రేప్రతు మహోగ్ర భూషణరుచుల్ దోచెం దదీయాకృతిన్. 14

కం॥ తాళకయదిగననమ్మని, పాళియుట న్వాజచిపఱచె,బ్రిమసె,సాగసె, బే
తాళుండెవ్వండోయనువగ, హేలావికృతాంగునమ్మ హేశ్వరుంగనుచున్. 15

శా॥ సంధ్యారంభకఠోర పశ్చిమదిశాజాగ్రన్మహా కాల సం
బంధ్యుగ్రోగ్రకృపాణ రేఖలయికన్పట్టెన్ శిరశ్చంద్రికల్
వింధ్యప్రాంశుఫణీంద్ర భీషణఫణావిర్భూతహా లాచ్ఛటా
వంధ్యప్రక్రియమైతమమ్ము గలిసెన్వారిన్మహా ఘోరమై. 16

గీ॥ వామదేవుండుమున్న గుపరమమునులు, ప్రస్తుతింపంగంగరుణనవ్వారిఁబ్రోచి
వారికోరికమన్నించిభవుండుపేర్మి, నాదిబేతాళరూపమ్మునపహరించి. 17

—※ శివుడు హిమగిరి కేగుట ※—

కం॥ ఎప్పటిముని వేసమ్మున, నప్పాలమున్వడచియేంగె. హరుండటచలువల్
గుప్పెడుతొలితెలిగట్టుం, దిప్పలకుందపము సేయం దిరుగనిమదితో 18

వ॥ అప్పుడా దేవతాత్ముండగు నన్నగసార్వభౌముండు జంగమరూపమ్మవధరించి, సముచిత
మ్ముగా నమ్మహాభాగు నెదుర్కొని. 19

స్వాగతము:- స్వాగతమ్మొసంగి చంద్రమఃకలా
భోగిభోగమణి ముగ్ధమూర్తికిన్

రాగియైయులవిరాగి కొసంగెన్
స్వాగతప్రసవ బంధురాంజలుల్. 20

చం॥ ఒసఁగుచు స్వాగతమ్మును, నిజోన్నతికిం దగునట్లు గాఁగఁ దా
పసమృదువేషుండుఁ గృపాపరుఁ గొల్చుచు నప్పరాత్పరున్
గిసలయరత్నపూర్ణమగు కేలుగవన్మొగియించి పల్కెన
య్యసమవిలోకనాగమ సమాదృతిఁ దాన సమానభక్తిమై. 21

కం॥ ఈశా! మహేశ్వర! గిరిశ! గిరీశా! యిటనన్ను నొక గిరీశునిఁ జేయన్
పేశలవిశేషకరుణా, వేశవశంవదుఁడవగుచు విచ్చేసితివే. 22

కం॥ ఎందఱు నిజవంశోన్నతు, లెందఱు గోత్రప్రసిద్ధు లెందఱు మహీభృ
చ్చందిరులున్నారిలన, య్యందఱ ననుధన్యుఁ జేయ నరుదెంచితివే. 23

కం॥ పనియేమిగలిగెనదినను, బనిగొమ్మాయనుచు వినయభరితుండయి, నె
మ్మనమలరఁ బలుకునతనిం గనుఁగొని యెలనవ్వు వెలయఁగ గఱకంఠుఁడనున్, 24

చం॥ తగునగసార్వభౌమ యతిధన్యుఁడ వీవు మహీభృదాళిలో
నఁ గలదె నీవిశుద్ధి యొకనాఁటఁ దరుంగని దేనెఱుంగనే
యగణితలీల నీదుకటకాళి జనించిన సింధుకన్యకల్
మిగులజగమ్ముఁ బ్రోచినది మెచ్చొనరింతురు మాకు నెప్పుడున్, 25

సీ॥ అనఘ రారాజవైన నీ యాశ్రయమునఁ గొన్నినాళ్లు వసించి యేఁగొన్న తపము
వ్రతము చెల్లించుపూనిక వచ్చినాఁడ. ననమహాప్రసాదమ్మని యానగమ్ము. 26

శా॥ రారాజంచొకగొప్ప సేసితివి నీ రాకం బునీతమ్ములై
మారాకుల్ దొడివెన్ హిమాలయమునన్ మారేళ్లు నీ యేఱులున్

నీరాగప్రతిబింబ మూర్తులగుచున్నిన్నెందెనో స్వామినీ
కారుణ్యమ్మునఁగానిదిం గలదెయీగట్టుల్ చిగుర్పెట్టఁగా. 27

శా॥ నాసర్వస్వమ్ము నీయధీనమగుటన్వాకుప్రువ్వఁగా నేలనీ
కోసర్వజ్ఞ యథేచ్ఛగా మెలఁగినీయుద్యోగ సిద్ధిన్మదా
వాసమ్మందుగణించి, భూభృతులనాభాగ్యమ్ము దీపింపఁగా
నీసేవన్ సతతమ్ము నాకొసఁగిమన్నింపంగ నర్థించెదన్. 28

కం॥ కాదనకనాకుమారిక, నీదుతపశ్చర్య వేళ నినుగొల్చెదునా
మోదమునను గ్రహింపఁగ, దే, దేవయనంగ దేవదేవుఁడనగుమన్. 29

కం॥ మునులమగుమాకువనితా, జనసేవలకెంతదవ్వొసన్మతినీ, వి
ట్లనఁ గాదనదగదటుగా, వున నీసుతసేవమాకు బోలునటంచున్. 30

మ॥ అతనిన్వీడ్కొని రమ్యనిర్ఝరదరీద్వార ప్రరూఢాగమా
న్వితమానోకకెలంకు నన్విడిసి,నందింబిల్చి యీనాతప
స్థితివేళన్ మనయాశ్రమమ్ముపొలమున్, జేరంగ రానీకవే
చితగంజూడుమయేరి నన్నటుశాసించెం గణవ్రాతమున్. 31

వ॥ అట్లుశాసించి యాప్రమథ ప్రథముండు. 32

కం॥ తానొకధర్మవేత్రము, పూనియటన్నిలిచెనంతఁ బురహరసేవా
ధీనమనోంబుజయగుచుహి, మానీగిరితనయభక్తి మనురాకృతియై. 33

కం॥ చనుదేరభృంగిదాతూ, యణివచ్చినచందమైన, నచ్చెరువడియున్
గనుదములానందాశ్రుల, మునుకలుగొనఁగనియుఁగనఁడపో చండియటన్. 34

శా॥ ఆలీలన్ జనుపార్వతింగనుచు, భక్త్యావిష్టమౌ చిత్తమున్
ఫాలమ్మంటినమోడ్పుఁ గేలునయికన్పట్టెన్ శిలాదార్భకుం

డాలోనన్ దెలివొంది, లోనెఱిఁగెనయ్యాహార్యపుత్రిన్ శివా
ర్చాలోలన్, గురుపూజనాహృతమహార్ఘ్యద్రివ్య భవ్యాకృతిన్. 35

మ॥ ఒకరుంగాదన నేరరా ప్రమథులందున్నారొ, లేరో, తపో
ధికులెల్లంబరమేశు శాసనము ప్రీతిందారు మన్నింపరో
ఒకయింతేని యెఱుంగునో యెఱుఁగదోయున్నట్టి యవ్వారినా
సుకుమారాంగియుఁ జేరె నీశ్వరుతపస్సిద్ధాంత భూమిన్వడిన్. 36

మ॥ మనదివ్యత్వము పొల్లుసేసె నెవరీ మాన్యాత్మ యంచెంచి నం
దినిఁ జేరంజని రమ్మహా ప్రమథులా దివ్యాత్మఁడా బాలికన్
దనరన్ శంకరసన్నిధిన్నిలిపి యంతన్ శర్వు నాజ్ఞావిధిన్
జనుదెంచెన్వినిపించెనా ప్రమథులన్ సర్వమ్ము, తెల్లమ్ముగా. 37

మ॥ ఒకయింతేని యలంతగానకెపుడా యుగ్రుం దగం గొల్చుచున్
సకలమ్ము న్ఘటియించుచున్ సమయపూజాకృత్యముల్ శంభునా
త్మకు రానేర్చనగేంద్రపుత్రి యతఁడున్మన్నించి తత్సేవలన్
బ్రకటమ్మైన మహోగ్ర యోగమహిమం బాటించె దివ్యాబ్దముల్. 38

—※ మదనుడు శివుని కడకువచ్చుట ※—

వ॥ ఆసమయమ్మున శూరపద్ముండు, సింహవక్త్రుండు తారకుండను రక్కసులటమున్న మహే
శ్వరు కృపం బెట్టిదమ్ములగు వరమ్ములం బడసి, మత్తిల్లి నిఖిలసురలం బరిభవించి పనిగొనిరి
వినుఁ డీసుదర్శనమ్మటఁ బిన్నటివాఁడగు తారకుకంఠమ్మున, నొక్కతారహారమయ్యెననిన
వారిమహిమ మ్మెట్టిదట్టిదననేల? దక్షయాగమ్మున శివవిద్రోహమొనరించిన దురితమ్మట్ల
ప్రతికార్యమ్మగుటయుఁ బరమేశ్వరు తేజోవిశేషమ్ము దక్క నొండొక్కఁడమ్మేటి
మగలనోంపజాలమి నిశ్చయించి, యేమంతంగుమారోదయమ్ము నభిలషించి, మదనుం,
బురమథనుండు పార్వతిం బరిగ్రహించునట్టి తెరంగు సంఘటింప నియోగించుటయు
నక్కుమారుండు. 39

ఉ॥ కాదనరానిమాపనువుఁ గైకొనివల్లభయందియిచ్చుపూఁ
గైదువులంది లేఁజివురుఁ గత్తళముందొడి, కంటి,విల్లు చే
నూఁదుచుఁబూవుతేనియల నొప్పెడిపుప్పొడి పీరచందన
మ్మాకృతిఁబూసిదివ్య దవళాబ్జకిరీటముఁ తీర్చి దిద్దుచున్. 40

ఉ॥ ఆరతిచూపు కేతువునొయారము హాసముచంద్రికాస శృం
గారము,నూర్పు తేరు నొడికారముకీరము వారువమ్ముగా
సారధియై వసంతుఁడట సన్నిధిఁ దేరఁగ నెక్కె-వీర శృం
గారరసోజ్జ్వలాకృతి, వికాసవిలాసవిశేష మూర్తియై. 41

వ॥ వెడలి యమ్మకరధ్వజుండు. 42

మ॥ చనుదెంచెన్ హిమవత్ప్రదేశమునకున్ జ్యాభృంగ ఝుంకారముల్
విననయ్యెంగలకంఠదర్పక భటస్తోమారవమ్ముల్ గడున్
మినుముట్టెన్, హరకర్ణభూషణమహాస్నిగ్ధాంబు జమ్మంత,న
ల్లనవ్రాలెన్గిరిజా, మనోహరశిరోలంకార రమ్యాకృతిన్. 43

కం॥ నుడిబడెనరదము తేజులు, మెడలొగ్గెనుబుడమిబడియె మీనుసిడము న
య్యెడఁజేరు నెడలగొనయము, విడివడెఁ జెలికాఁడునొగల విహ్వలుఁడయ్యెన్. 44

కం॥ నిట్టవిషుమాపులొలయఁగఁ, గట్టెమరంగాంచెనపుడు కందర్పుఁడు దాఁ
గట్టలుక వేడిచూపుల, నొట్టినమంటలను జిమ్ము నుగ్రునినందిన్. 45

ఉ॥ కాంచిరథమ్ముడిగ్గి, భయకంపితహస్తములల్ల మోడ్చు, న
ప్పంచశరుం "బురే" యెఱుగవా! యిటనుగ్రతపమ్ము నేయుచో
ప్పించుకయేని, యీవనము నింతతొలంగదు నాదునాజ్ఞ, నీ
పంచమనిస్స్వనమ్ము విసవచ్చునె పుణ్యతపోవనమ్ములన్. 46

కం॥ అటుతలఁగుతలఁగు మెప్పటి, కిట రాకురయంచదల్ప నెఱిఁగి యతనికో
ఘటనాఘటనధురీణా, యిటనొకవిన్నపము సురలకెల్లనుహితమై. 47

చం॥ కలదదివిన్నవింతు నవుగాదన కర్మిలిఁ జిత్తగింపుమీ
సలిపినశాసనమ్ము శిరసావహియించెదు మమ్ము బోంట్లపై
నలుగఁగనేల మీఁములుక కాఁగెడిపాటిదె యీజగమ్ము లీ
తెలియనితప్పుఁ జెప్మఁగడ తేర్పుమనంగఁ బ్రసన్నచిత్తుఁడై. 48

కం॥ వినుపింపుమనిన మీ తెలి, యనియనియే యయినవినుమనవధానమునన్
వినుడనుచు విన్నవించుమ, మునుముట్టఁగ నెల్లవృత్తమును నాతనికిన్. 49

ఉ॥ తారకదారకుండయిన దారకు నొక్కరు నీశ్వరాంశ వి
స్తారకు సర్వదైవతవిషాదవిషోగ్ర గభీరవార్ధి,ని
స్తారకుఁ గాంచ నీవరిగి, శంకరునిం గిరిజాకర గ్రహ
శ్రీరమణీయుఁ జేయుమని చేయుచు వేల్పులు నాకుఁ గట్టడన్. 50

కం॥ మార! యిదినీకుఁ దగున నె, వారిజగర్భుండు మాఱువలుకకుమనె జం
భారి, హరిపోయిరమ్మను, గారవముం దెలుపు, నగవు కన్నులనసిచెన్. 51

ఉ॥ ఇంతకుఁ బూనివచ్చితి మహేశ్వరుకంటికి నగ్గమాదునో
పంతముదీర్చి లోకముల ప్రస్తుతిగాంతునో, రెంటనెద్ది యే
సంతసమేయటన్న నెఱసాహసమూని శిలాదపుత్త్ర, నీ
వింతయెఱింగి నన్నునుపు మీ, సురకార్యము చక్కఁ జేయఁగా. 52

చం॥ అవవిని యోయి! నీయనిన యంతయు నిక్కమ, యెట్లు నిన్ను నే
జనుమనకుండుమంచుఁ బురశాసను శాసన మెట్లు దాటఁగా

ననువగునంచుఁ గొంత తడవారసి యారసి లోనికేఁగఁగా
ననుమతిసేసె నంతట శిలాదకుమారుఁడు శ్రీకుమారునిన్. 53

చం॥ అనుమతిలోనఁ దెప్పఱిలి యుల్లవసంతుఁడు తేరు దేరఁగాఁ
గొనుచు ననుజ్ఞ నందికి నకుంఠితభక్తిఁ బ్రదక్షిణమ్ముగా
దనయరదమ్ముఁ ద్రిప్పి సముదారఝషధ్వజ కింకిణీధ్వనుల్
మనమునిగుర్చునాహరిత మంజుళహేషలు మిత్రభాషలున్. 54

చం॥ వినుచుఁ దపోవనమ్ము పదవింజను దేర, లతాకుమారికల్
తనతనలోన నిందనుక దాచు నిసర్గవిలాస సంపదల్
మునుకలు వెట్ట వెల్వడిన మోదము సిగ్గసి యాడు మేనులన్
వనిచినయట్లు పాయన మొనర్చెను వానికిఁ బుష్పపత్రముల్. 55

చం॥ చనిచని యుల్లసల్లశివు నాశ్రమవాటికఁ దేరుడిగ్గి, య
మ్మనసిజుఁ డొక్కపూవుపొద మాటున కేగుచుఁ బొంచి చూచె, శం
భుని, నసమానయోగపరమున్, గిరిజాతఁ దదీయసన్నిధిన్
గని యెఁబ్రఫుల్ల పుష్పమృదుకల్పితదామని బద్ధమానసన్. 56

కం॥ వేచియుతఁ డవసరమ్మును, జూచి వకను వింటఁ దొడిగెఁ బురహార త్రైలో
న్మోచకమును, మధుధారా, సేచనమరుణాబ్జ మెట్టి సెలలు నొలంగన్. 57

మ॥ విరతమ్మైన మనస్సమాధి వశతన్విప్పారు నేత్రమ్ములన్
దరుణాబ్జస్ఫుర ముత్తమాంగుఁడు గనెన్ గౌరీ, సుకేశాంబర
స్థిరసంధ్యారుణసుందరమ్ము, మధువీచీపూర సమ్మోహన
మ్మరుణాబ్జమ్ము మనోంబరమ్మున సముద్యద్రాగముల్గూర్పఁగా. 58

ఉ॥ ఆగిరిరాజబిడ్డకరమల్లన యెత్తి యథాపురాకృతిన్
భోగివిభూషణోజ్జ్వలసమున్నత మంగళకంఠపీఠమున్
దాఁగయి సేయ నంబుజసుదామయదామము నంతలోనఁ ద
ద్రాగతరంగితానన నవిధమ్మగనుంగొని నిల్చె సిగ్గునన్. 59

కం॥ ఇదెపోయదనని మదనుఁడు, కదనమునకుఁ గాలుదువ్వి కనదస్త్రము వే
గఁ దిగిచి తెగవాపిన య,య్యదనునఁ జవురించె స్థాణుల చటియవర్ణల్. 60

భుజంగప్రయాతం॥ చలత్పుష్పమాలా స్మరన్మంజుధారా
వళీవిభ్రమమ్మల్ ప్రవర్తిల్ల వల్లీ
విలాసమ్మ లేచెన్ విలోకించె బాలన్
విలాసోజ్జ్వలుండై విభుఁడంతలోనన్. 61

శా॥ ఆకర్షించెను స్వామిచిత్తమును దానానమ్రబాలాతనూ
శ్రీకాంతిస్ఫురణమ్ము మోవులుచిగిర్చెన్ నవ్యనవ్యమ్ములై
రేకెత్తెన్ గిరిజాహృదంతరమునన్ బ్రేమార్ద్రభావమ్ములా
లోకాదిప్రియదంపతుల్ నిలిచిరాలోఁ జిత్రరూపమ్ములన్. 62

మ॥ హరుచిత్తమ్మున వోచె నంత నపుడా శ్యామాదరస్మేరమం
దరరూపమ్మయి విశ్వవిశ్వము తదుద్యద్రాగవీచీవళీ
భరితమ్మై యవదాతనీలకబరీపర్యాప్తమై సంచలత్
కరపుష్పస్రగుదారమై వదనచంద్రజ్యోత్స్నకారామమై. 63

మ॥ పృథువక్షస్థలతారహార సుషమాంఛోళీవీచీదృతిన్
శిథిలీభూత తపస్సమాధియగు నాశ్రీకంఠరూపమ్ము మ

న్మథకోటిప్రతిభాసమానము జగన్మాంగళ్యమాంగళ్యముం
విధుబింబాననఁజూచె విశ్వజగమున్విభ్రాంతచిత్తమ్మునన్. 64

క॥ శివుఁడంతదెలిసెనిజక, ర్ణవతంసము గౌరిశిరమునన్గలుగుట దా
నువివేకించెనుగారణ, మువిశదమునుగాఁగఁ జిత్తమును వెనుదిగిచెన్. 65

చం॥ శివుచుచుఁజూచెఁగట్టెదుర దియ్యనివిల్వల కేల దాపటన్
దివుచుచుఁబుష్పబాణముల శిత్వరఁజిమ్మెడు పుష్పబాణునిన్
భవభవపాహిపాహియని పల్కెననభమ్మున దేవసంఘముల్
శివశివయంచునాహరుని జేరిరినందియు భృంగిచండియున్. 66

క॥ వినెనోవినఁడోవారల, యనునయముల శైలతనయ యటుచూడఁగ నా
మినుసిగదేవరమూఁడవ కనుదెఱచుచునంతలోనఁ గన్పడఁడయ్యెన్. 67

క॥ చేయుచుఁగనుఁగొనిరట యు, మ్మారునిభస్మావశిష్ట మఘరాకృతి,న
వ్వారిసమలేమిచెప్పుదు, గౌరియుబలుమూర్ఛమునిఁగెఁ గనుఁగొనియంతన్ ,68

చం। హిమగిరివచ్చికూఁతుఁదన యింటికినింగొనిపోయె నారతి
ప్రమదవిలాపముల్వినుచు రాలు,నగమ్ములువేడివేడి బా
ష్పములస్రవించెధారలుగ, బక్షికులమ్ము నిరుద్ధకంఠమై
బ్రమసెహిమాలయమ్ము హిమవారిమిషమ్మున వీడెనశ్రువుల్. 69

క॥ పతిసహగమనోత్సుకరతి, మతికటవినిపించెనొక్క మధురస్వరమో
సతిసాహసమునువిడుమీ, పతిఁగూడెదవనుచుఁగర్ణపర్వముగాఁగన్. 70

మ॥ వినిపింపన్ రతితేరిచూచె నెదురన్వచ్చెసె నల్లల్లనన్
తనతేరుజ్జ్వలమీనకేతనవినూత్నప్రాభవమ్మై, వసం

తునిమోముం దెలివొంది కన్పడెనటన్ దుఃఖార్త కంఠమ్మునన్
వినిపించెన్ సహజాత కోమలమధుస్నిగ్ధప్రియాలాపముల్. 71

క॥ చల్లనితుషారకిరణము, లుల్లసిలన్మిగులవెలిఁగె నోషధిపతియున్
వల్లభునివార్త దెలిపెను, మొల్లమునన్నీలకంఠములు నటియించెన్, 72

— ❋ పార్వతి తపమ్ము సేయుట ❋ —

వ॥ అంత నప్పార్వతియు నల్లనగన్నులు విచ్చి. 73

చం॥ అదరెడు వామనేత్రమున నాసతి చూచె నవారవిందమున్
జెదరిన కేశపాశమునఁ జెన్నగు మోమునఁ దండ్రిఁ జేరి, నా
హృదయము గాసివెట్టు పరమేశ్వరు నెమ్మియొనైనఁ గొల్చి. యీ
చెదరిన చిత్తమున్ దృఢము సేసెద నన్ను ననుగ్రహింపవే. 74

క॥ అని వేడనీకుఁ దవమా, ననుఁగాంచిన తల్లి వలదనన్ జనకుని దా
వెనుదిరుగని నిశ్చయమునఁ, జనవున నొప్పించి. జయు విజయ, యనెడి చెలుల్, 75

క॥ తనతల్లి పనుప వెనువెం, టనరాఁగ నుమాకుమారి నవ్యతపో వే
షనితాంతమధురభావ, మ్మున వెడలి. వసించి యొక తపోవనభూమిన్, 76

మ॥ ఒనరించెం గిరిపుత్రి యేకపదియై, యుర్వీరధుం బేర్మిఁ గై
కొనకొన్నేండ్లు తపమ్ము మూలఫలముల్ గూరాకులున్ గొంచు, ధా
త్రినితాంతోద్ధతిఁ బట్టఁజాలక ధరిత్రీభృత్కులమ్మెల్ల, న
ల్లనదూగాడుచు నిల్చె నాసతియశోలశ్రీ తపోనిష్ఠలన్, 77

మ॥ వనమధ్యమ్మున నిల్చె చేసె తపమున్ వారాశి తూణీరుఁ జే
కొనఁగొన్నేఁడులు జీవనమ్మె కొనుచుం గోత్రాత్రి చిత్తమ్ములో

ల్లనునీరై సెలయేఱులై, కరఁగ బాలాదివ్య సంభావనా
వనపుణ్యమ్మునఁ జేసినిల్చె భువనప్రాకార రూపమ్మునన్. 78

మ॥ కనుగ్రీనలపంచ కాంతరమునన్గావించె నయ్యగ్ని నే
త్రినిమిప్పింపఁదపమ్ము కొన్నిసమముల్ రోచిఃకణాహారయై
తనువుల్ ఘోరవిషాగ్నులన్ దరికొనన్ ధాత్రీధర శ్రేణి ని
ల్చెను శైలేంద్రసుతామహోజ్జ్వల తపశ్శ్రీభాగ్య సంపత్తులన్. 79

మ॥ అనిలాహారవిభూషణుం దరియఁగా నాబాలకావించెఁ దా
ననిలాహారతఁ గొన్ని యేండ్ల తపమయ్యాహార్యముల్ దాము, వె
చ్చనినిట్టూర్పులు సందడింపఁ బొలిచెన్ శ్వాసానిలక్రూర, ద
ర్శన దర్వీకరదగ్ధగర్భగుహలై పాధ్వీతపశ్శక్తిచే. 80

మ॥ ఒనరించెన్ సతి యంబరాంబరునినా ద్యోవీధి కాకేశునిన్
దనియింపం బ్రణవార్థలీనమతియై త్యక్తాఖిలాహారయై
ఘననిష్ఠం గొనిగొన్ని యేండ్లతపమున్ క్ష్మాభృత్కులమెల్ల, బో
రనమ్రాగ్రోన్నయము నిల్చె నిశ్చలశివధ్యానైక చిత్తమ్మునన్. 81

మ॥ ప్రణవోదారశరీరుఁడై గురుతపఃప్రాగ్భార నిర్మగ్నుఁడై
యణురూపమ్ములకెల్లఁ దాన యణువై, యార్తాశ్రితత్రాణ, కం
కణసూత్రాయితభోగియై వెలుగునా కాంతుంగనెం గాంత, త
త్ప్రణవమ్మందు వెలింగె నా సుదతియుం బ్రద్యోత మానాకృతిన్. 82

మ॥ కనియెం దాఁ జిఱునవ్వు డాలునెఱయన్ గౌరీ మహాదేవి నా
ప్రణవాకారములోన శంకరుఁడు, నేవత్తున్ సతీ! చాలు తె
మ్మనుమాటల్వినవయ్యెఁ బార్వతి కనంతాకాశమధ్యమ్మునన్
జనుదెంచెన్మలయానిలమ్ము, సుఖమై, సౌరభ్య సంపాదియై, 83

క॥ కనుమూసియున్నహరునిం, గనుగొనునాప్రమథవరులు కలఁతపడఁగఁ దే
రునుధనువుందూణీరము, తనతనయంతటనెనిల్చి తబ్బిబ్బుపడన్. 84

క॥ చిఱునగవుమెఱయుకన్నులఁ, దెఱచుచునటుచూచి దేవదేవుఁడు మీరల్
వెఱవకుఁడని వెఱపుడుపుచుఁ జఱచఱన చోటువిడిచె సంరంభమునన్. 85

— ※ శివుఁడు పార్వతింబరీక్షించుట ※ —

గీ॥ ఆహిమాచలపుత్రికయాత్మతపము. పుణ్యఫలమునుదలపోసిపోసియంతఁ
దనదునెచ్చెలితోడమంతనముసేయు. నవసరమ్మననొక్కమాయావటుండు. 86

క॥ అటుదవ్వులఁదనయాశ్రమ, తటభూమింగానిపింపఁ దడవుగఁబనిచెన్
బటుభక్తిఁదోడితెమ్మా, వటునింబూజింపమనకు వలెననివిజయన్. 87

క॥ అటుసేరవచ్చి,కొనియు, వ్వటుఁడున్స్ఫుటభక్తినొసఁగు పరమాతిథ్య
మ్మటునిటుచూచుచు, నేవరీ, కుటిలాలకయేలతపము కోరియొనర్చెన్ 88

ఆ॥ వె॥ గట్టుపట్టియనుచుఁగాన్పించుమామది, నిట్టికోమలికమునెందుఁజూడ
మవురకన్నవారలావంతతలఁపరా, తపమువేడ చిఱుతతనమువేడ. 89

ఆ॥ వె॥ ఎంతతపముసేసి రేని యెవ్వరుగూడ, గాంచఁజాలరట్టికాంతయీమె
ఎవనిగోరిదానయీరీతిఁదపియించు, నకటయట్టికతినుఁడొకఁడుగలఁడె. 90

వ॥ అని సవితర్కముగా నొక్కింతయూఁగి విజయంజూచుచు. 91

క॥ వటుచపలతఁటుంటెసి• గుటిలుఁడగా నేనువినఁగ గూడునయేనిన్
స్ఫుటముగవినుపింపుమునీ, చటుసూక్తులుమానిమీదు సఖివృత్తమ్మున్. 92

క॥ అనవిజయదేవియానతి, (గొనియిట్లనెనోయివిప్రకులభూషణ, నీ
మనమునఁదలఁచినయటునీ, వనినదినిజమగుచుమాకు నక్కజమయ్యెన్. 93

గీ॥ ఈమెగిరిరాజబిడ్డమహేశుగోరి పరమతపమొనరించుటెవ్వరికిఁదెలియ
దకట సర్వజ్ఞభావమ్ముప్రకటపరచి, యర్ణీయుఁడవైనవిందైతిమాకు. 94

గీ॥ కఠినుఁ డంచుననొక పల్కుఁ గటువుగాఁగఁ, బలికితిఁక మీఁద నిటులాడవలదు నీవు
నిచ్చవచ్చిన యన్నాళ్లు నిచట నుండి, మా సపర్యలఁ గొనుము నెమ్మనము దాక. 95

గీ॥ అనినఁ గోపము వచ్చిన యటుల చూచి, మొగము చిట్లించి యటనుండి పోవఁ దలచు
నట్టి చందము సూపి యాయగజఁ బలుక, రించు తలఁపున నుడి సవరించుకొనుచు. 96

కం॥ ఈయమ్మ పిలువవచ్చితి, మీ రొసఁగిన పూజ మాకు మెచ్చొనరించెన్
మీ యితివృత్తము తెలియఁగఁ, బోయిన పోకడలు మఱచి పొందిక మీఁదన్. 97

కం॥ మాయా శ్రీమసీమలు గఱ, వాయెను కాపురము లుండ నరుదెంచితి నే
మీ! యేమన్ననునందురు, పోయెదనొక మాట చెప్పి పోవఁ దలఁచితిన్. 98

కం॥ వినియుంటను గ్రొన్నొక్కనిఁ, బెనటిగాఁ గోయొక్క తెట్ట్రిపడుచు పూ
వినయది ఘోరతపమ్మని, కనవచ్చితి నావెయి మొగడయ నకొంటిన్. 99

కం॥ తనుచూచుచుండ మన్మథుఁ, డెను బూడిద సేసినట్టి, పెళుసు మనసు, వా
నిని గూడి యేమి సుఖపడు, వనితకు మీ రైనఁ జెప్ప వలదా! చెలులై. 100

కం॥ తన యంతఁ దెలిసికొనలే, దనుచును పేక్షింపఁ దగునె యక్కట కష్ట
మ్మనుసుఖము నీ మెతోడిది యని యెఱిఁగియు నిట్టులుండ నగునే మీకున్. 101

కం॥ నా మహిమ తేన చెప్పిన, మీ మదికేఱొండు తలఁచి మిత్రిత్వమ్మున్
బోవఁ జతురో యని వెఱచియు, నా మెయి మైత్రికి విరుద్ధ మగుటఁ బలికెదన్ 102

గీ॥ అనుచు మఱియును బలుకు బ్రాహ్మణిని జూచి, సఖికి నయ్యావి శ్రవణదుస్సహము లగుటఁ
బలికె జయ, యంతనో మహా బ్రాహ్మణుండ, వరలుమన మైత్రి నిజము శాశ్వతము
గాఁగ. 103

కం॥ గడుసుంబోకలఁబోయెద, వుడుకుమన న్వాడకయూడె దుగ్రినిపేరల్
పడఁతులనియలుకఁ జూచెదొ, వడుగా యుడుగుడుగుమింకఁ బలుకకు పెక్కుల్.

కం॥ వెడ తెరువులిచటఁ జెల్లవు, గడుసరిపలుకులకు నేర్పు కల దేనిశివు౯
మృదుఁబొగడి చెలియ మెచ్చం, బడయుము సమకూరునీకుఁ బరమశుభమ్ముల్.

కం॥ ఆమాటకువటుధూర్తశి, ఖామణి వెడనవ్వుఁదోఁపఁగమలాక్షిరో, న
న్నామహితుఁ బొగడుమని యెదొ యామాటకునింత యేల యటులయొనర్తున్.

కం॥ ఒనరించిమీఁదు నచ్చెలి, యనుగ్రహవిశేషమంది యరిగెదననుచున్
దన నేర్చినటుల యాతఁడు మునుకొని యెరుశివునిస్తోత్రము నుజేయంగా. 107

కం॥ తొలిబిచ్చగానిబ్రహ్మన్, దలద్రుంచినవాని నెద్దుతత్తడివాని౯
గులహీనుగోత్రహీనుని దలిదంష్ట్రలులేనివానిఁ దలచెదవాత్మ౯. 108

కం॥ విషకంఠువిషమనేత్రుని, విషధరభూషణుని,ఘోరవిషమాద్రిదరీ
విషయుదిగంబరుఁదలఁచెద, విషధిశరాసుని శిరస్థవిషమయభూషున్. 109

వ॥ అను నెడల నాజయవిజయ లాంకోయల సప్రశ్నమ్ముగా నుపలక్షించి, తమ చెలిహృద
యమ్ము నెఱింగి యతనిఁజూచుచు 110

కం॥ వ్యాజస్తుతియో,యిదినీ, నైజస్థితియోయటంచు, నగిరెనొకతె, కా
దేజయ రెండునునగునని, పైఁజూచి మఱి నతనిఁజూడ వటుఁడును నగుచున్. 111

కం॥ శ్రీకంఠాశకపాల, శ్రీకమనీయా! భుజంగశేఖర! శివ! దో
షాకారశిరోమణీ! మా. కీకల్యాణమ్ముగూర్పు మీకన్నియకున్. 112

మ॥ అనినన్ దిగ్గనలేచెఁ బార్వతి యమర్షాటోపదుర్వారయై
వెనుమున్ జూడక యెంతమాటవలికె న్విప్రుండు దుర్బుద్ధి వీ

విని బోనిత్తు వెఱంచు లేచిరి చెలుల్ నిర్మోక నిర్యద్భుజం
గనిభమ్ముల్ వరగంగఁ జూడ్కులపుడా కల్యాణి పోనున్న చో. 113

మ॥ నిలుమీ శంకరుఁడన్ సతీ నిలువుమీ నీభక్తి తాత్పర్యముల్
విలిచెన్నన్నిటు చూడుమా యనునుడుల్ విన్పించెఁ గారుణ్య ని
శ్చలముల్ సంభృత నిర్మలప్రణయముల్ సౌహార్ద సౌహార్ద్రముల్
నిలిచెం బార్వతియప్పరాత్పర వచోనిర్యత్సుధా మాధురిన్. 114

శా॥ ఆలోకించుచు గౌరి కట్టెదుర నీహారాంశు సాంద్రచ్ఛటా
జాలమ్ముల్ సుకుమార పల్లవ వనీసంక్రాంత సౌభాగ్య ము
ద్రాలక్ష్మీ సుభగమ్ములన్ గనుకనిప్రాగిల్లు చిత్తమ్మునన్
లోలాక్షుల్ మరలించెఁ దోరణులుగన్ ఱోలంబ ముక్తావళుల్, 115

శా॥ ఆలోకించెను గౌరి తానెదుర నీహారాంశు రేఖా విభూ
షాలీ వామల శేషహార రుచులన్ శార్దూల చర్మాంబర
శ్రీలీలాపరిగుంభితోజ్జ్వల తనూరేఖా విలాసమ్ములన్
కేళీమోహర సార్ద్రవీక్షణ దరస్నిగ్ధాస్య హాసమ్ములన్. 116

ఉ॥ ఆగిరిపుత్రి చూచి యటు లాత్మపురా ప్రణయప్రసంగ వి
ద్యాగురుమూర్తియా గిరిశు నర్చనసేయ, నవారవిందముల్
స్వాగతమిచ్చెనో యన విశాలవిలోలదృగంబుజమ్ములన్
రాగిలివచ్చు భృంగ మధురస్వర లీనమనోజ్ఞ భావయై. 117

కం॥ సుడిబడు సెలయేఱు గిరిఁ, బొడిచిన నదివోలె వెనుక ముందడుగిడఁగా
నొడబాటు గననివడువున, బెడఁగుఁ గనటు నిలుచు వడఁతి విధముం గనుమన్. 118

ఉ॥ మెచ్చితినీతపమ్మునను మెచ్చితినీదు విశుద్ధవృత్తికిన్
నచ్చిరినీచెలుల్ మనమునం దడవేటికిరమ్ము రమ్మ వి
ద్యుచ్చపలాక్షి వర్ణియను దోసము నెంతయొ మేలు మేలు నే
నిచ్చితినీకుఁ గోరుకొనుమీ వరముందగ శైలబాలికా. 119

కం॥ మనవృషభమదిగో వచ్చెన్, జనుదెమ్మాసఖులునీవు శైలేంద్రునకున్
బనిచెద వార్తను నిప్పుడ, యనుమానము లేదు వెడలుమంబుజవదనా. 120

మ॥ అనినంబార్వతిస్వామిమీతలఁపు వేఁడౌరీతిఁగావింపఁగాఁ
జనదెన్నండనియేనెఱుంగుదునినున్ సామాన్యుగానెంచియీ
వనితల్ పల్కినమాటలొండు మెయిగాభావింపకీపాటికిన్
ననుమన్నింప వరమ్మొసంగుమనుచున్ గైమోడ్పులర్పించినన్. 121

కం॥ చెలులంతఁ దమ్ముఁగలయం, దిలకించు కృపారసార్ద్రదృష్టినిహరునిన్
వలగొనుచువిన్నవించిరి, లలితప్రియమృదువచోవిలాసములొలయన్. 122

శా॥ సర్వజ్ఞుండవునీకువిన్నపము దోషమ్మెనఁగావింతుమీ
యుర్వీధ్రమ్ముల సార్వభౌముఁడగు మాయొజ్జల్ భవత్సేవకై
పూర్వమ్మిచ్చినకన్య నేఁడుగొనుటన్ పుణ్యమ్మపండించుటల్
సర్వమ్మున్ శుభమయ్యెఁగాని యొకవాంఛందీర్చిమన్నింపవే. 123

శా॥ కల్యాణమ్ము ఘటిల్లెమీకపుడె మాక్ష్మాభృత్కులస్వామి యీ
కల్యాణిందగనీకు బాంధవసమక్షమ్మందునర్పించి తాఁ
గల్యాణమ్ములనందఁగాఁ దలఁచుమా గౌరీమహాదేవి యీ
కల్యాణమ్మునుజూడ మామనములం గౌతూహలమ్మయ్యెడిన్. 124

కం॥ ఇవియెల్లఁ జేయుమనియు, మ్మదవతులకు నెడల మదనమథనుఁడు గౌరీ
వదనమ్ముఁ జూచియవ్వున, నిది తెల్పయటంచు నెక్కె వృషభేంద్రమ్మున్. 125

## —※ శివకల్యాణము. ※—

మ॥ హిమవంతుండు కుమారికం జెలులతో నిల్లాలిఁ గర్పించి స
ర్వమహీభృత్కులమున్ బ్రియమ్ము మెఱయన్ రప్పించె నాలోన స
ప్తమహర్షుల్ చనుదెంచి రీశ్వరుఁడు పంపన్ స్వామికల్యాణమా
హిమవంతుండట నిశ్చయించెఁ దగవా రేర్పాటు గావింపఁగా. 126

కం॥ ఆ మునులు వచ్చి చెప్పిన, యా మాత్రమ్మునకు వెడలనఖిలజగమ్ముల్
దామపుడు విడిసె నగ్గిలా, సామలను శిఖాంబకటక హరిగృహములన్. 127

కం॥ జగమెల్లఁ బెండ్లివారయి, నగకులపతిగృహము చేరినన్ బ్రియముమెయిన్
దగువారి నెదురుకోలనఁ, గఁగఁ బనిచె నతండు వారు గారవమెసఁగన్. 128

కం॥ విడియించి తగువిడుదుల, విడిసిరి వారెల్లఁ బెండ్లి వేడుకలోలయన్
బుడమి యపుడొడ్డగెడవయి, కడుఁ దడఁబడ శివుఁ డగస్త్యుఁ గను మంత్రిమమునన్,

శా॥ లోపాముద్రమనోహరా! వినుము యీలోకమ్ము నీ గాసికిన్
బాపన్ దక్షుఁడు లేఁడు దక్షిణదిశాభాగమ్ము మిన్నందె నీ
వే పోవన్వలె నేనపోవలయుగానీ లేక శాంతింప దా
టోపమ్మిట్టటుచూడుమా యన శుగాటోపమ్ము దీపింపఁగన్. 130

శా॥ నీ కల్యాణమహోత్సవాతిశయమున్వీక్షించు సౌభాగ్యమున్
నా కెట్లో దేవ యనుగ్రహింపు మనుచుం బల్కె సమేతమ్ముగా
నా కల్యాణధురన్ సమానమహిమం జా దక్షిణాశావధూ
దేశమ్మున్మరలింపగా నరిగెఁ జెందెన్ ధాత్రి స్వాస్థ్యమ్మటన్. 131

మ॥ చతురాస్యుండు పురోహితుండగుచు మెచ్చం దీర్చె వైవాహిక
క్రతువందుం గిరిపుత్రి సన్నికలుద్రొక్కన్ బాదముం జూచినన్
మతితప్పెం బరమేష్ఠి కద్ది గనునంతన్ వాలఖిల్యాఖ్య వి
శ్రుతమౌనీశులమ్ము నయ్యనఘు తేజోజాతమై వెల్వడన్. 132

కం॥ అంగుష్ఠమాత్రదేహము, లంగడునక్కజపురూపులం గనుపడువా
రింగనినగియెడుసభన, ల్లంగనిపరమేష్ఠి దాఁదొలంగి చనునెడన్. 133

కం॥ భూసారవారిసారము, లాసర్వజ్ఞుఁడు గ్రహించి యద్భుతముగఁ దాఁ
జేసి కమండలువున వే, కైసేసి విరించిదాన గౌరవమెసఁగన్. 134

మ॥ విడువన్నేరక విశ్వసుందర జటావీథిన్వడిం దాల్చె నా
మృడుఁడట్టుల్గను వారిసారమును నేనీక్షింపఁగా గౌరియున్
గడకంటం బరికింప దానిఁ గొనిచక్కన్ ధాతశుద్ధాత్ముఁడై
నడపించెం గిరిజామహేశ్వరులకుం గల్యాణ ముద్యన్మతిన్. 135

ఉ॥ అంగజుఁడాత్రియంబకుఁ డనంగునొనర్పఁగ నొచ్చి శైలజా
పాంగసుధారతిప్రమదహా రిపురారిహృదంతరంగ, సం
సంగశుభాంగమూర్తియయి చాపలతాంచల చారుపుష్పవృ
ష్టింగురిసె,న్నభమ్మున గవిసె న్మెఱసెన్ సుమనఃప్రకాండముల్. 136

మ॥ అది లోకైకమనోహరమ్ము, బహుపుణ్యాలోకనీయమ్ము, సం
పదనల్పమ్ము సుహృత్పుష్టజనతామాంగళ్య వాచాసుధా
స్పదమై స్థావరజంగమమ్మగు ప్రపంచమ్మెల్లనానంద వీ
చిదరాందోళితమయ్యె శంకరుఁడు మెచ్చె న్నామహౌన్నత్యముల్. 137

మ॥ ఒకనాఁడిందుధరుండు నా గిరిజతో నోడ్డోలగమ్మున్నచో
వికటాకారవినోద వేషుఁడగుచున్విచ్చేసి యొక్కండు త

కృశయ పార్వతిఁ జూచిచూచి యెవరీకన్యావతంసమ్ము స్వా
మికి నా చేయు ప్రదక్షిణమ్ము లటులగున్ మీరెల్ల వీక్షింపుఁడీ. 138

మ॥ అని నానృత్యంగని యేఁ బ్రదక్షిణము సేయ న్నేనకానేకాంతమున్
మును నా కాత్యాయణి నిల్చి పీఠమున నీ పూబోడి నిల్చెన్ బళా
గనుఁడీ యంచును భృంగరూపి యగుచున్ గావించె నా నీలకం
ఠుని కంఠమ్మున కుం బ్రదక్షిణము నెన్నమ్మౌను చిత్రమ్ముగన్. 139

మ॥ సతిచూచెం బతి నాదర ప్రణయలజ్జాకోపగర్భమ్ముగాఁ
బతి నీవోడకుమంచుఁ గన్నుల నగెన్ వాగర్థదాంపత్యసు
స్థితి నానవ్యపురాణదంపతుల మూర్తిం గంటి మేళమ్ముగన్
శ్రుతివేద్యమ్మగు దాని జన్మశతముల్ సూఁ గంగ బుణ్యాకృతిన్. 140

కం॥ భృంగరటనమున మాకీ, మంగళమని మురము గదిరి మఱచిన మదులన్
భృంగరటా' భృంగిరిటీ', భృంగిరిటా' భృంగి' యనుచుఁ బిలుచుచు వానిన్. 141

కం॥ నుతిసేయఁగ నా ప్రమథుఁడు, స్తుతిసేసెను శివుల నా విదూషకుఁ గనుచున్
మతి మెచ్చించితివని శివుఁ, డతనికిఁ గరుణించె నప్పుడా నామములన్. 142

మ॥ హిమవంతుండు కృతార్థచిత్తుఁడగుచున్ హేమాంబరశ్రేణితోఁ
గమనీయోజ్జ్వల రత్నవస్తువులతో గౌరీమహాదేవి నా
ప్రమథస్వామికి నప్పనమ్మొసఁగి సంభావించె మమ్మెల్లరన్
రమణీయప్రియవస్తుసంతతుల సర్వమ్ముం బ్రతుష్టింగనన్. 143

కం॥ జయవిజయులు నా పార్వతిఁ, గయిసేసిరి శివుని మధురగంభీరశుభో
దయవేషమ్మేఁ దడవుగఁ, గయిసేతలసటులనిటుల గాఁడవుననుచున్. 144

శా॥ ఆకల్యాణమనోజ్ఞవేషములతో నా స్వామి వేంచేసెఁ దా
శ్రీకాంచీనగరీ గృహమ్మునకు, విచ్చేసెన్ సతీయుక్తుఁడై

యాకల్యాణమహోత్సవమ్ముఁ గన వింధ్యారాతియాశంకర
శ్రీకారుణ్యవిశేషముం బొగడుచుం జెందెన్మహానందముల్. 145

కం॥ ఇటులచ్చటముచ్చట లచ్చటఁదీరవసించి శైలజాసహితుండై
నిటలాక్షుఁడు కాశీముఖ, కటకములన్వీడిసి చేరెఁ గైలాసగిరిన్. 146

కం॥ ఆదేవుననుమతిఁ గొని, వేదరవిరి పెండ్లివారు విశ్వపతిదయన్
మోదపడఁ గాంక్షితము విడఁ, గాఁదమతమ వాసములకుఁ గదలిరి ముదులన్. 147

వ॥ అనుటయు నమ్మునీశ్వరులు సంతుష్టచిత్తమ్ముల మహాత్మా! యుమారోదయమ్ము నెఱిం
గింపవేయని యడిగిన. 148

శా॥ ఆరాధ్యాన్వయభాస్కరుండు బహుశిష్యారాధితుం డుజ్జ్వల
క్షీరాంభోధితుల్యనైజ కవితా శ్రీనాథుఁ డుద్యత్కృపా
వారాశిప్రభవేక్షణావృతి సదావర్ధిష్ణుసంతాన, భూ
సౌరభ్యప్రథమాన పద్యసుమన స్స్రగ్భూషితుఁ డర్మిలిన్. 149

కం॥ విదళితవైరికుమారా, భ్యుదయమహాకావ్యరస సమున్నతికీర్తి
ప్రదపీఠుఁడు నిరంతర, మ నహరస్మరణ పరమమానసుఁడెలమిన్. 150

మంజుభాషిణి॥ పరమేశదివ్య పదపంకజద్వయీ
స్మరణోత్సవుండు నిడమర్తి భూషణే
శ్వరమంత్రి భక్తి పరిపాకరూపకా
వ్యరమావిభుఁడు గుణబంధురుండిలన్. 151

మ॥ హరభక్తిస్థిరవిశ్వనాథ నృపసింహారాధ్యమానోల్లస
చ్చరణాంభోజు గురున్ భజింపఁగ నొనర్పంబూను కాంచీపురీ
శ్వరమాహాత్మ్యము నందునా ఆవదియాశ్వాసమ్ము దీనిన్మహే
శ్వరుఁడా సేతుహిమాలయమ్ముగను శశ్వత్ప్రీతిపోషించుతన్. 153



# కాంచీఖండము.

## సప్తమాశ్వాసము 115 పద్యములు.



కం॥ శ్రీమద్దుర్గామానస, తామరసవిహారిహారపదక్షీరసేవా
కామి కమనీయవిగ్రహ, ధాముఁడు సౌజన్యపరమధాముఁడుజగతిన్. 1

వ. అయ్యంబికారమణుం డమ్మునీంద్రుల కిట్లనియె. 2

### —※ కుమారజననము. ※—

చం॥ వినుఁడు సతీసమేతుఁడయి విశ్వవిభుండల వెండికొండపై
ఘనపుతుకమ్మున న్మెలఁగఁగా బహుకాలము చెల్లె నంతన
య్యనిమిషు లక్కుమారునుదయమ్మును వేడి మహేశుపాలికిం
బనిచిరి జాతవేదసుని బన్నములంబడి రాక్షసాళిచే. 3

కం॥ పరమేశ్వర తేజోమయము, శరీరమయ్యగ్నితనదు సహచరుతోడన్
స్మరహరుశుద్ధాంతమ్మున, కరుదెంచె నలంఘ్యమైన యమరులపనికై. 4

వ॥ అట్లరుదెంచి సముచితమ్ముగా నంతఃప్రవేశ మొనర్చి. 5

శా॥ అంకమ్మందునఁజేర్చి పార్వతిని ముగ్ధాలోకనాళిచ్ఛటా
శంకస్ఫూర్జెడి ముంగురుల్ చిగురుచేసారించి యుట్టుట్టుగా
వంకల్ దిద్దుచు నేఁడు నీసొబగులన్ బండింతుగాకంచుఁ బ్రే
మాంకమ్ముల్ ఘటియించు శంకరుని దానల్లంతటన్ జూచుచున్, 6

కం॥ నిలిచెను బెడమోమయియు, వ్రాలనయ్యెరు మొగము వేల్పు పవనాంకురసం
చలితమయి గౌరిపయ్యెద, తొలఁగినదొకయింత యామె తోట్రుపడంగా. 7

చం॥ కనుఁగొని శంకరుండు మృదుగాఢరతిన్ సతిఁ గౌఁగిలించె జం
కెన నెఱిచూపు లేర్చె పులకించిన మేనఁ బెనంగి యోరఁగా
స్తనఘనసారకుంకుమరసమ్మునఁ బంకిలమైన హారముల్
పెనఁకువ లేర్చు వింతమురిపెమ్మున నిల్చె లతాంగియంతటన్. 8

ఉ॥ ఆ నెఱిచూపులున్ జలితహారము లౌచిలు వెచ్చనూరుపుల్
మేనిరొమొయారముల్గనుచు మెచ్చుఘటించెను మారునిప్పుడో
మానిని నీదుచిత్తసుకుమారము లీతరి తీపుభావముల్
గానముగాదె యిందనుకఁ గల్గెనొ నేఁడొకక్రొత్తలెవ్వియున్. 9

చం॥ కనముగదా యటన్నఁ దనకాంతునిఁ జూచి జగమ్ములన్నియున్
గనినమహానుభావులరు గానరుగాక క్రొత్తప్రాతలున్
విసరునుగాక యుల్లవనవీథులు సల్లని తేటబారులై
కనుపడె సంచలించెని వెకంటిరె యీలవలీనికుంజముల్. 10

కం॥ చీమయుఁ జిట్టాడదుగద, యీమనరొమెలదోటలోన నెఱుకపడదొ నేఁ
డీమహిఁ గలిగినవింతలు. నామనమటుకొంత తెలియనా యిటులనుటల్. 11

చ॥ అనుటయు నవ్వి నీదునయనాంచలకాంతి తనూవిలాసముల్
మొనసెనొ గాక వింత వనమున్ మనమున్ సరిగాఁగఁ బల్కుతీ
వనమున నొంచిచూడఁ బెఱవారలుగల్గరు గల్గిరేనియున్
గనుపడకుండఁ జాలుదురె కాంత! భవన్మతిశంకదక్కుమీ. 12

చం॥ అనిప్రణయమ్ముపల్కి సతినల్లనజేరెనతండు నామెయున్
గనుకనిలోడనవ్వనమునల్గడ నట్టిటుచూచి జూచుచో
ననలుఁడునిల్చెనట్టయెదురై సతియంతట కోపవిభ్రమ
స్వనమున నవ్వఁడీతఁడని శంకరునింగెరలించెఁ జూపులన్. 13

కం॥ ప్రణిపాతపూర్వకమ్ముగఁ, గనలకుమో దేవియనుచు గౌరీపదభూ
మినిబడియెవహ్నియీశ్వరుఁ, డనునయమున వారిఁజూచి ఱుపునపుననుచున్. 14

కం॥ అలుగకుమునీవు వేల్పులు, దలఁచినపని నిర్వహింపదలఁచిననామూ
ర్తులనొకఁడువహ్నియీతని, వలనను ఫలసిద్ధిగలుగు వదలుముశంకల్. 15

కం॥ అని తెలుపఁగఁ దెలిసియుసతి, వనితాజనసులభదుర్నివారక్రోధ
మ్మున నోయికృష్ణపథుఁడా, చను నేనీకింత పాటి సాహసము పురా. 16

కం॥ వినుమేకతముననుండుట, గనియును దెగుదారితనముగా వచ్చిననీ
కును నినుబనిచిన వేల్పుల, కును సంతతిగలుగదిద్ది గఱుతుగనింకన్. 17

మ॥ అనుడున్ శంకరుఁడోసతీ! నీతగునెయీయగ్నిన్ శపింపంగ నే
ల, నితాంతార్తులు వేల్పులున్ గనుమ స్వల్పమ్మైనదోసమ్మునీ
కినుకంబెంచితివింతగాఁగఁజను నగ్నిన్ వేఁబ్రసాదింపఁబు
త్రునిగాంచంగ నతండురక్షకుఁడగున్ దోడ్తోసుర శ్రేణికిన్. 18

మ॥ ననుమెప్పించుచుమున్ను వేడికొనియెన్గంగామహాదేవి పు
త్రుని, నీకుంగలదట్టివేడుక సురద్రోహిన్ జగద్రక్షగాఁ
దునుమంజాలు కుమారుఁడింకగలఁగున్ దూలించికోపమ్ము నీ
యనలుంజూడుమటన్న దేవియదియట్లౌటన్ విభావించుచున్. 19

మ॥ కనియెన్వహ్నినను గ్రహమ్ము మెయినాగంగామహాదేవియున్
మినుముట్టెన్ దమకమ్మునన్ హరుఁడులోమెచ్చెన్ దదాలోకన
మ్మునఁ దేజమ్ముకఁడుద్భవిల్లుటయు శంభుండగ్నినీక్షించి యా
ఘనతేజమ్ము భరింపుమీవనుచుఁ జక్కన్వానిశాసించినన్. 20

గీ॥ ఆఱుమొగముల నిటులొక్క చూఱువెసలు, పారమేశ్వరతేజమ్ము పవనసఖుఁడు
దానుభరియింపఁగాలేక తచ్చియాడి, చనుమనోకచోటసురధునిఁగనుచునిలిచి.

కం॥ భరియింపరానిపరమే, శ్వరతేజము విడిచెనతఁడు జాహ్నవియందున్
భరియింపరామినదియును, శరవణమున విడిచె నట్టిసమయమునందున్. 22

కం॥ ఆశరవణమును గాల్చుచు, నా శరవనమిటులగాల్చునన నొక్క మహో
రాశికుమారుఁడు రవిసం, కాశుఁడు జనియించె జగముకనుపండువుగా. 23

వ॥ ఆసమయమ్మున. 24

కం॥ మునిపత్నికాముకుఁడగు, పెనిమిటిస్వాహావధూటి వివిధాకృతులన్
దనియించెనదియెఱుంగక, మునులాస్వరుదమదుసతులఁబోవిడుచుటయున్. 25

కం॥ వారలుసుగుణోదారలు దారలుగృత్తికలనంగఁ దారావీధిన్
జేరుచునాయానతినిఁ గు, మారునకుం దాదులగుచు మహివెలసిరటన్. 26

వ॥ ఆయ్యాదిదంపతు లయ్యుపవనమ్ము విడిచి శుద్ధాంతమ్ము ప్రవేశించుటయు నందలి నవరత్నస్తంభమ్ములం బ్రతిఫలించిన గిరితనయాప్రతిబింబమ్ముల నాజగజ్జనకుండు సాభిప్రాయంబుగావీక్షించు నెడల నందుండి వీరబాహుప్రముఖులగు కుమారులుదయించినం గని యాహ్వాన్యతి. 27

కం॥ తనయెడలగలుగుకూరిమిఁ, దనప్రతిమలసుతులఁగన్న ధవునింగనుచున్
మనమిష్టమైన నెంతటి, పనికైనం దలఁకరనుచుఁ బరమప్రేమన్. 28

ఆ॥వె॥ వారిఁగౌఁగిలించి పరమేశ్వరునిజూచి, యాకుమారుఁడుదయమయ్యెనోకొ
యనిన నిప్పుడవియు నరసివత్తమటంచు, సుతునిసుతలఁగూడిశంకరుండు, 29

వ॥ వచ్చునెడల నయ్యార్వురు తల్లులకుమదమ్ముగా నారురూపమ్ములఁ గ్రీడించువారిం గని గౌరి నాఁడు పరభిన్నమ్మున నక్కుమారుల నెల్ల నొక్కటఁగౌఁగిలించిన వారక్కజమ్ముగ నొక్కటియై పుట్ట యద్భుతమయ్యె నంత నావీరబాహుప్రముఖులతనిం దమ యన్నగ నెఱింగి నమస్కరించి యుచితరీతింగొలిచియుండి రిట్లక్కుమారుండు కార్తికేయుండు, గాంగేయుండు, శరవణభవుం డగ్నిభవుండు పార్వతీనందనుం డనంబరఁగె నంత. 30

గీ॥ ఏనుమున్నుగ వేల్పుల య్యెడకువచ్చి, దేవసేనలకతని నధీశుఁ జేయ
నతఁడు సేనానియగుచునయ్యసురకోటిఁ, దునిమి తూటాడిలోకవిద్రోహమణచె

వ॥ అనుటయు నమ్మునీంద్రు లక్కుమారు పరాక్రమం బెఱిగింపవేయన నతండు. 31

— ※ కుమారవిజయము. ※ —

చం॥ వినుఁడది విస్తృతమ్ము సరవిన్వచియింపఁగనాకకాద యె
వ్వనికి నశక్యమైన నిటబల్కెదమీదగుకోర్కెదీర్ప న
య్యనలభవుండు దేవగణమంతటఁగొల్వఁగ మ్రొక్కి యాజగ
జ్జనకు ననుజ్ఞమై వెడలె దైత్యునిరాసనిబద్ధబుద్ధియై. 33

కం॥ వెడలియటమున్నతోడరినఁ, గెడపెదుదారకునిఁ గొంచుఁగీటడచేఁబయిన్
నడపించె రాయబారము. వడిమూపకకొంత వీరబాహుని చేతన్. 34

వ॥ అట్లునడపినం గటకటంబడి రాక్షససార్వభౌముండగు శూరపద్ముండు. 35

చం॥ పయిఁదెగివచ్చెనప్పలుకు పాటిగఁబట్టక సర్వలోక దు
ర్జయభుజసారశోభితుఁ డజయ్యపరాక్రము లైన పుత్రులున్

నయవిముఁడైనతమ్ముఁడు ననంతబలమ్ములు చేరికొల్వఁదు
ర్ణయఫలపాకముంగుడువ రమ్యరథస్ఫురదుగ్రమూర్తియై. 36

వ॥ కయ్యంపు మొన సేరుటయు నందు నింపుఁ జేయుంగలుగ లొనఁక్రమ్మడి సింహనాదమ్ములు
పెలంగం దలపడుటయు పోరుఘోరమ్మయ్యె నట్టియెడ. 37

క॥ నిస్త్రింశానిస్త్రింశియు, శస్త్రాశస్త్రియును గాఁగ జరిగిన సమర
మ్మస్త్రాస్త్రియగుచు నట్లైదె, వస్త్రీ వరపదము వీరభటులకు నొసఁగెన్. 38

గీ॥ భానుశాసించినట్టి యాభానుకోపుఁ, డాదిదేవరు శూరపద్మాత్మభవులు
వీరబాహుండు మున్నగువారిచేత, సమసిపోయిరి యప్పుడా సంగరమున. 39

క॥ ఆవీరబాహు వేగము, కైవెన్నిచ్చినబలమ్ము నరసి వ్రీళయుగ
ర్జావేగవిధురుఁడగుచున్, దావచ్చె నుసింహవక్త్ర దనుజుండనికిన్. 40

మ॥ బహుకాలమ్ము మహాస్త్రశస్త్రములతో వారిర్వురుం బోరుచో
గుహుఁడంతం జనుదెంచి యక్కటిలు నిం గూల్చె న్మహాక్రోధ. దు
స్సహుఁడై వచ్చిన శూరపద్మువిరథున్ శస్త్రాస్త్రధారాముహు
ర్ముహురున్మజ్జితుఁ జేసె వాఁడు పెలుచన్మార్తిభవత్క్రోధుఁడై. 41

మ॥ ఒకబ్రహ్మాండము దన్నుఁగానపుడు దైత్యుల్ శూరపద్మాకృతుల్
వికటాభీలబహుప్రకార వదనుల్ విచ్చేసి యాక్రాంచ దా
రకశక్తిన్మటుమాయమైరి నుగుడన్ బ్రహ్మాండముల్ దన్నుఁగా
నొకమాత్రన్ హరియించె నాతఁడతఁడున్ హుంకారముల్ సేయుచున్. 42

క॥ మాయాబలమునఁ గెడసిన, యాయసురులఁ బ్రదుకఁ జేయు నల్లననగుచున్
మాయించి వారిమగుడున్, వేయేండ్లును నీకు నిండె నిలునిలుమనుచున్. 43

శా॥ ప్రాఁబల్కుల్ చిఱుగజ్జలై యలరుసుబ్రహ్మణ్యదేవుండు, తే
జోబాభాసము విశ్వరూపము తపశ్శుద్ధమ్ము దాల్చెం దపః
ప్రాంబల్యమ్మున నమ్మహాత్మునికృపా భావప్రభావమ్మునన్
మాబోటుల్ దరియింపఁగంటిమి జగన్మాంగళ్యమారూపమున్. 44

కం॥ మిలమిలను మెఱయుగన్నులఁ గలిగినవిషయమ్ము తెలియఁగా నేరమటన్
దల తెగినశూరపద్ముఁడు, కలనంగనిపించి మరలఁ గన్పడఁడయ్యెన్. 45

వ॥ మేమెల్లర మమ్మహాద్భుతమ్ము వితర్కించునెడల సుబ్రహ్మణ్యుండు విశ్వరూపమ్ము
నుపసంహరించుటయు. 46

మ॥ శిఖివాహమ్మును కుక్కుటధ్వజమునున్ సేవింపఁగా వచ్చెనా
మఖనాథుండు కుమారు నిన్మనములన్నెల్లఁ జిత్రమ్ముగా
శిఖిపైఁ దాండవమాడి యాధ్వజము గైసేసెం గుమారుండు వే
సుఖమై వీచెను మందమారుతము స్వస్స్రోతఃకణాన్వితమై. 47

మ॥ అరుదెంచెంబరమేశ్వరుండు సతితో నాతల్లి కౌఁగిళ్ళలోఁ
జిఱునవ్వుల్ గురియంగ స్వామి విడిసెన్, జేయెత్తి యాబాలునా
శరశస్త్రవ్రణశంకలన్ సడవెనా శర్వాణి, దానవ్వుచున్
బరికించెన్ హరుఁడా సతీసుతుల సర్వప్రాణిసంఘమ్ములన్. 48

కం॥ ఇదెసమయమనుచు నిందుఁడు. గదియఁగఁ జనుదెంచినన్ను గాఁబనిచిన నే
నిది తెల్పయనుచు శివునకు విదితముగా నతనికోర్కి వినిపించుటయున్. 49

శా॥ ఆసర్వజ్ఞుఁడు దీనికింత వలెనా! యల్లుండు నేడయ్యెనా!
యీసందర్భము నీసహోదరకునీవే చెప్పుమంచాడె, నే
మీసేనానికి మాతనూజల కిఁకం బెండ్లింగటాక్షింపు మా
నాసంతోషతరంగితాక్షి యగుచున్ గౌరీ మహాదేవియున్. 50

గీ॥ ఇంతకంటెను మఱియునింకేమి వలయు, ననుచుఁ బతిఁ జూచె శివుఁడు తథాస్తటంచు
నగియెఁ జగమెల్లఁ గొనియాడఁదగినరీతి, జరిగెఁ గల్యాణమహము నా స్వామికంత. 51

కం॥ కన్యాదానము సేసితి, మాన్యను లవలీకుమారి మఘవుండును సా
జన్యయుత దేవసేనను, గన్యాదానమ్మొనర్చె స్కందున కురహిన్. 52

కం॥ నాకొమరితలయి యొక్కట, నాకొమరునికై తపించి యభవువరమునన్
నాకాధీశ్వరసుతవై, యాకన్యక లిష్టఫలము నందిరియట్టుల్. 53

గీ॥ అతని భజియించి పడసి యిష్టార్థకోటి నెల్లవారును దమతమయిరవులంతఁ
జేరి రా స్వామి సేవించువారికెపుడు, కలుగదాపద శుభములు గలుగుచుండు. 54

వ॥ అనుటయు నమ్మునులు సుబ్రహ్మణ్యప్రతిష్ఠాది విశేషమ్ములు మాకెఱిఁగింపవే యనిన నా
రి మారమణుండు. 55

— ❊ ప్రతిష్ఠాది విశేషములు ❊ —

కం॥ అడుగఁగవలసిన యర్థము, నడిగితిరో యనఘులార! యవనిఁ గుమారుం
గడు భక్తి నిలుపువారలు, పడయుదురత్యయ్య పుణ్యఫలములు పెక్కుల్. 56

కం॥ లవలీమనోహరుండా, శివనందను గుహుఁ బ్రతిష్ఠ చేసినవారల్
వివిధాభీష్టములం గని, శివలోకమ్మున వసించి చెందెద రఘముల్. 57

వ॥ మఱియు నొక్క విశేషమ్ము గలదు. 58

కం॥ సుతకాములు చితకాములు, వ్రతకాములు నమ్మహాత్మువలన నిజార్థ
స్థితిఁ గందురతనిఁ దలఁచిన, సతతము జయమగును గార్యసంగతులందున్. 59

వ॥ మఱియుం బ్రతిష్ఠావిశేషమ్ములు చెప్పెద నాకర్ణింపుఁడు. 60

కం॥ దేవీప్రతిష్టసలిపిన, కోవిదులిలఁ బుత్రపౌత్ర గురుభాగ్యయశ
శ్శ్రీవడసిపార్వతీపద, పావనలోకములు పడయువారలుసతముల్. 61

కం॥ ఉర్విఁవినాయకునిలిపిన, నిర్విఘ్నఫలోదయమ్ము నిస్తులకవితా
సర్వకలాకౌశల్యము, నిర్వాణముగలుగునతని నిర్మలకరుణన్. 62

గీ॥ వీరభద్రుని నిలిపినవారుభువిని, గార్యసిద్ధిని శాత్రవహానమ్ము
గాంచియిహపరలోక సౌఖ్యమ్ములందు, వారువారికి దొరయగువారులేరు. 63

గీ॥ కాలభైరవుని ప్రతిష్ఠకలిహరమ్ము, వృషభునిప్రతిష్ఠ ధర్మార్థ విభవకరము
సంగతానేకజనన విస్తంద్రపుణ్య, కలనలభియించు నరయలింగప్రతిష్ఠ 64

కం॥ శివసిద్ధాంతవిశారదు, శివభక్తజితాశుశాంతు శివవర్తనునిన్
భువిమనుపఁగలుగు సంతత, శివలోకనివాసఫలము చెలఁగుశుభమ్ముల్. 65

కం॥ ఇవిపుణ్యక్షేత్రమ్ములు, నవునందువిశేషఫలము లఖిలజగమ్మా
శివమయమయగుట చెందును, భువిఁదిరముగఁబూర్ణఫలముపొసఁగంజేయున్. 66

సీ. కరవీరమునబ్రహ్మ కర్ణికారమ్మున, వాణిబిల్వమునందు భార్గవియును
ఓకమున నేనర్క పత్రిసుమమ్ములఁ, గపిలుండుసంపెఁగం గార్తికేయుఁ
డలరు,నమేరుల నఖిలగణమ్ములు, మందారమున శతమఖుఁడు వెలయు
బున్నాగమున వాయువును బావకుఁడు కమిన్, గనకమ్మునను యక్షగణవిభుండు

గీ॥ పుండరీకమ్మునందుఁ దానుండుశివుఁడు, నుమయునివసించు నెమ్మినీలోత్పలమున
నెఱిఁగివీనినుబూజింప సిష్టసిద్ధు, లలరు భక్తులయిండ్లనిత్యమ్ములగుచు. 67

కం॥ ఇవిమొకటిపడయ నేరని, శివభక్తుఁడకంపవిమల శివభజనసుధా
నవనవమనోరవిందము, శివునకుసర్పించిపరమ సిద్ధింబడయున్. 68

కం॥ ఆలయమంటపగోపుర, శాలలుగట్టించుపుణ్యశాలులుతుదకుఁ
కైలాసమునవసించెద, రోలినివ్వారివంశ మున్నతిఁజెందున్. 69

గీ॥ కనులఁదారసినసతిమహాగౌరియనుచు, నరయుభక్తులుశివరూపులనుచునొసఁగు
నదిశివార్పణమనుబుద్ధినరసిపాయ, కుందునాతండునిత్యముక్తుండుధరణి. 70

కం॥ తనుఁగొలుచువారికంటెను దనభక్తులఁగొలుచువారిఁ దనియించుశివుం
డనుటకన,నాదిదేవుఁడు, ననునాభక్తులనిదర్శనములుగఁ జేసెన్. 71

కం॥ అదిగనక కుయుక్తులతో, నదియిదియనివాదమాడు నధములుజగతిన్
దుదిమొదలులేక చెడియెద రిది యెఱిఁగిభజింపవలయు నీశ్వరుసతతమున్. 72

గీ॥ నాదుభక్తులనఁగనున్నారెవ్వరు, సకలమీశ్వరుఁడావేదజనకుఁగనక
వాదులాడుచుఁగాలమ్మువ్యర్థపుచ్చ, పతితులుందురునరకకూపములయందు. 73

కం॥ శివధర్మమునఁగశుభకర, మపుధర్మముజములువిద్య నందెడిలేకన్
దవుమేల్మొనుసమయమ్మున, శివునిఁ ధ్యానింపవలయుఁ జెవరనిబుద్ధిన్. 74

గీ॥ స్నానభోజనపానాదిసమయములను, మౌనమునశివుఁగొలువనొమానసమునఁ
తపముదానమ్ముయజ్ఞమ్ముజపమునలువు, వారువానికిదొరయగువారుగారు. 75

గీ॥ ఆస్తిఁదగుగాకయితరులకార్తియిడఁగఁ, జనదుచేతనుమాటనుమనముచేతఁ
బరధనమ్ములకయియాసపడఁగఁజనదు, ఋతమహింసయుఁదగదెన్నఁడేనివిడువ

గీ॥ ఇంద్రియమ్ములనోడుచుటయాహవిమట, సర్వభూతసమత్వమ్ముసాధుసేవ
శాంతిగురుజనశుశ్రూషశతుర్వుచకు, నైనయుపకృతియిడఁజాలునమృతపదము

కం॥ తనధర్మమ్మువమడిసినఁ, జనుఁబరధర్మమ్మ్ముఁదగుల జనదెన్నండున్
ఘనదుర్గంధయుతమ్మగు, తనువున్ వ్యాధిగఁదలంతురి తత్త్వజ్ఞులిలన్. 78

కం॥ శివమయమఖిలజగమ్మని, యవిరళనిష్ఠన్ భజించునది, యదియెఱుఁగం
గవిశిష్టధర్మమగుటన్, భువినిదియెవ్వరికిఁగాని ముఖ్యమ్మరయన్. 79

కం॥ శివునకుఁబరమ్ములేదని, శివమంత్రమ్మునుజపించు సిద్ధులుమాన్యుల్
భవరోగహరణకర్మఠు, లవువారలునాకుఁబ్రియత మాగ్రణులెందున్. 80

— ※ కాంచీపదనిర్వచనము ※ —

వ॥ అనినంగృతార్థచిత్తమ్ముల నమ్మునులు గాంచి పదనిర్వచనమ్ము తెలియఁగఁదెలింప వేడు
టయు శ్రీ లక్ష్మీశ్వరుండు. 81

గీ॥ అఁగకారమ్ముబ్రహ్మరుద్రార్థకమ్ము అంచితమ్మయిదానిచేఁగాంచియయ్యె
నుత్తమాంగమ్మవలెనుత్తమోత్తమమ్ము, నఖిలసుఖహారమ్మయి కాంచియయ్యె

గీ॥ వినుత్రిమూర్తులమగునమ్మవిశ్వవిభుఁడు, కాలకంధరుఁడెలుపుఁగకారపదము
అమృతమానందమయమునిత్యమ్మపరము, కానయవ్యాదియయ్యెనుగాంచిపురము.

గీ॥ అయ్యెశునకమ్ములమ్మహావ్యాధునకును, నాదిభిక్షునికౌపీనమయ్యెఁద్రిపుర
హరునియశ్వమ్ములెవ్వియయ్యఖిలవేద, ములునునటరాజుకాలియుందెలుగనయ్యె

గీ॥ అట్టినిగమమ్ములయ్యనేకామ్రవృక్ష, మందుశివుఁడుజ్యోతిర్లింగమగుచువెలసె
నయ్యెవాచకరూపకామాక్షియతని, కతఁడువాచ్యుడమేయుఁడేకామ్రవిభుఁడు.

వ॥ కావున నప్పరమేశ్వరుండు దనకుంబ్రీతికరమ్ములగు, శంభుమయోభూమయస్కర, శివ
శివతరమ్ములను నామమ్ములకంటె నేకామ్రనాథనామమ్మునం బరమహృష్టుఁడగు, భక్తా
నుగ్రహాకృతి బహువిధవిడంబనుండగు నప్పరమశివులీల లనంతమ్ము లమేయమ్ములది
యట్లుండె మున్నొకప్పుడు. 86

ఉ॥ దాగురుమూతఁలాడెడు బెడంగున మందరరమ్యకందరా
యోగికసంగవన్,గిసల యోదరకోమలపాణిమూయు, గౌ
రీగజయానకేల పసరించుచునోగిరిరాజపుత్రి,నీ
యాగడమింకఁజాలునని యవ్విభుఁడల్లన నవ్వియిట్లనున్, 87

కం॥ పొరపాటుగా దెలుపఁజే, సురలకు నన్నమ్ము భూమి సురవర కార్యా
చరణాధారము జగతీ, శరణముకనుఁగవను మాయఁ జను నెతలంపన్. 88

కం॥ ఉడుగుడుగుము ననునంటకు, వడఁతీయెడఁగలుగ నిలిచి పలుకుమటన్నన్
జిడిముడిపాటున బలుకుచుఁ, దడఁబడ వెఱఁగొను మగతియుఁ దనపతి కనిరెన్. 89

కం॥ చన వెంతయున్నఁ బెద్దలఁ, జెనకుట గనుసేగి యనుట సిద్ధమ్మయ్యెన్
గోసి తెచ్చుకొన్న యీతప్పును దొలఁచును పాయమేది పురహర చెపుమా. 90

కం॥ అనుటయుఁ గాంచికిఁ జనుమా, యనుకంపను దపముసేయ నడఁగును దటన్నన్
జని కాంచి ఘోరతపమును, బొనరిచె గిరిరాజుబిడ్డ పుణ్యవ్రతయై. 91

మ॥ అనుకంపానదపొంగి పొర్లగను నయ్యార్యన్ బరీక్షించి, కై
కొని యెన్ శంభుఁడు తస్కరుండగుచుఁ బెన్కల్ గ్రీడలాగారితో
నొనరించెన్ ముముబోంట్లు నోల్వఁగను దానొద్దోల గమ్మొండియె
ల్లను గోకమ్ములఁ గాచు వెన్నెలలు చెల్లన్ బిల్లలేనవ్వులన్. 92

వ॥ మఱియు నిట్టి విశేషమ్ములు పెక్కులు గలవు గావున. 93

కం॥ నివసించిన స్మరియించిన, భువిముక్తి నొసంగు కాంచి పురమునకు నొకం
డపు హాటియనఁగఁ జెల్లను, తవునదితన సాటి తానె ధన్యత్వమునన్. 94

ఆ॥వె॥ కామకోటియనఁగఁ గాంచికి నగునటఁ, గామితములు కోటిగా ఫలించు
నటఁ ద్రిమూర్తులు పుట్టియుణఁగితి మొకకొన్ని, కోట్లు గానఁ గామకోటి యయ్యె. 95

కం॥ కాంచిని నేకామేశ్వరు, నంచితఁ గామాక్షి దేవి ననుకంపను సే
వించిన ధన్యుండగు వే. దెంచఁగ నీ త్రియము సాటియే భువనమునన్, 96

కం॥ అనివిరమించినవిష్ణునిఁ, గని మ్రొక్కుచుధన్యపదవి గనుఁగొనిమునులున్
జనిరిఁదిర కైలాసం, గొనిహరియునుదనదుకొలువు కూటమువిడిచెన్ 97

ఉ॥ మానినరేణ్యులార శుభమార్గముఁగంగఁగఁ జాలుగాక, యీ
దానముయజ్ఞముల్ దపము ధర్మమపత్యము సత్య మీశ్వరుం
డానతభక్తివశ్యుఁడగు నాతనిఁజేరఁగఁ జిత్తశుద్ధ్యను
ష్ఠానముమూలమింద్రియ వశంవదులవ్విభుఁ జేర నేర్తురే. 98

కం॥ అరిషడ్వర్గముత్రివ్వలఁ, బొర లెడుయతికన్నమిగులఁ బూజ్యుండగు,దు
స్తరసంసారమునందున్, గురుతరనిజధర్మవర్తనుండగు నేనిన్. 99

కం॥ మీ రెఱుఁగనియదియున్నదె, యారయ నాపలుకులందు నయిననునన్
బేరిమిమన్నించుకృపా, వారాన్నిధులార పోయి వచ్చెద సెలవా?. 100

కం॥ అనుసూతువిడువ నేరక, యునుపిడి చిరివినువఁదప్ప మునికిన్ మానుల్
చనెనాతఁడంత వారలు, చని రా కాంచీశుఁ గొలువ సంభ్రమపడుచున్. 110

— ✽ మునులు కాంచీశ్వరుని భజించుట ✽ —

వ॥ అట్లు వెడలి వారలెడతెగని ప్రయాణమ్ములఁ గాంచీపురమ్మునొచ్చి యథోచితమ్ముగం
దీక్షవిధులాచరించిన. 102

— ✽ చతుర్ముఖీ కందము ✽ —

కం॥ సోమార్ధమౌళినిరుపముఁ, బ్రేమన్ జగములనుగనిన వేలుపుసగుణున్
సోమసఖభక్త జననిధి, స్వామిన్నగధరునిబా దభాసురనిగమున్. 103

కం॥ కనివినయభరితహృదయులు, మునులటస్మరహరునిహరుని బురహరునభవున్
మనములనిముడనినుతుకము, ననుబాగడిరివివిధమధుర వచనవగతులన్. 104

కం॥ స్మరహరహరభవశంకర, వరదమహాఃప్రభవయభవ భర్గవరతవః
పరపరమభక్తసంగత, గరకంఠయనంతశర్వ గంగాధరణా. 105

శా॥ శ్రీకాంచీనగరీశ్వరా, శ్రుతిశిరశ్శుద్ధాంత పాదాంబుజా
రాకాచంద్రికలావిభూషణ, సువర్ణక్షోణిభృన్మందిరా
శ్రీకాంతాకమనీయ సాయక!సతీశృంగారితార్ధాంగ, యో
యేకామ్రేశ్వర లోకరక్షక!పురారి!మమ్ము బాలింపవే. 106

స్రగ్ధర॥ మాళిస్రిఙ్మంజుభూషా మధురమరధునీమాజకీ మంజరీశ
శ్రీలేఖాచంద్రరోచిశ్శ్రిత కపిలజటాస్నిగ్ధ బంధాభిరామా
శైలేంద్రోద్దారపుణ్యోచ్చ్యయఫల తనుజాసంగతార్ధాంగ రంగల్
వ్యాళీచర్మోత్తరీయా, యభవ, పరమ, యేకామ్రలింగాశుభాంగా. 107

లయహారి॥ చదువులును గిదువులును జదువఫలమొదవునని
మఁదిదలఁచి మదమొదవ బదరితిమి పెక్కుల్
తుదిమొదలు గననితొలు చదువులను మొదవులను
ముదమొదవఁ బదిలగొను సదయునిపదమ్ముల్
గదియమదు లుదరినవి యిదెయదను దయపొదల
గదలుమృదుపదములను పదలమిట రమ్మా
మదనహర! పదనఖర! కదనపర హృదయచర
సదమహార ప్రదరహారి కదరిలయహారీ. 108

మ॥ తలఁపుల్ చేరనినీస్వరూపము నిటుల్ ధ్యానించు మాదోసముల్
దొలగింపంకయనేసి మాభవములన్ దున్మింగించినీపాద ని
శ్చలమాచిత్తమనుగ్రహింప గదెయోసర్వజ్ఞ! పాపాటవీ
దళనకూ్రరకుఠారవీక్షణ కృపాధారైక ధారాహతిన్. 109

శా॥ కామాక్షీ మృదులస్మితా, మృతఝురుల్ గంగా ప్రవాహమ్ముత్తె
సోమోత్తంస! శిరస్సరోజ మధులై శుభ్రాంశు రేఖాళులై
సామేనక్షఫణిహార సుందరములై సౌభాగ్యముల్దిద్దె. నో
సామీయామధురాకృతిన్మెఱసి నిచ్చల్మమ్ముఁ బాలింపుమా. 110

కం॥ ఆసివ్రస్తుతింపదమున, మ్మునులకుఁ బోడపూపిభుజగ భూషణుఁడెలమిన్
దను వేడునిష్టఫలముల, ననుగ్రహము సేసికనుల కగపడఁడయ్యెన్. 111

శా॥ శ్రీమన్మల్లమపల్లివంశ విమలక్షీరాబ్ధిమందార, శ్రీ
సోమారాధనతత్పరా! గురుమనశ్శుద్ధాంతసంచార, ని
త్యామోదోజ్జ్వలమానసా, బహులశిష్యామేయ పుణ్యాకృతీ
శ్రీమల్లేశ్వరపుత్ర మత్కృతిపతీ శ్రీదుర్గమాంబాపతీ. 112

కం॥ శివలెంకామృతలింగ, ప్రవరమనశ్చరణశీల, బ్రహ్మవిదగ్ర
స్తవనీయతత్సమర్పిత, సువర్ణరుద్రాక్షహార, సుందరమూర్తీ. 113

మాలినీ॥ సువినయమృదుభావా సూనృతాత్మానుభావా!
కవికులపరిగేయా! కావ్యవాగ్భాగధేయా
వివిధసుగుణభూషా! విశ్వదాతృప్రతోషా
శివకరమధుమూర్తీ! శిష్యచిత్తాబ్జవర్తీ. 114

మ॥ గిరిజాదేహవిలీనపుణ్యగృహిణీకీర్తి స్ఫురచ్చంద్రికా
భరితాంతఃకరణుండు వీరనయొనర్పంబూను కాంచీపురీ
శ్వరమాహాత్మ్యమునందు నేడవదియాశ్వాసమ్ము దీనిన్మహే
శ్వరుఁడాత్మీయసతీశిరఃకుసుమభూషారీతిఁ బోషించుతన్. 115



శ్రీ

# కాంచీఖండము.

## అష్టమాశ్వాసము.

...........

కం॥ శ్రీమద్దుర్గాహృదయున, భోమండల తరుణ మిహిరమోహనమూర్తీ
శ్రీమల్లికార్జునారా, ధ్యా మత్పద్యార్ఘ్యకమలదామాభరణా. 1

### — మూకకవిచరిత్రము —

గీ॥ కంచికామాక్షితల్లి సేవించి యొక్క, మూఁగ పంచశతశ్లోకములు రచించె
వాని చరితమ్ము విస్మయావహము కరము, విన్నవించెద మా తండ్రి వినఁగదయ్య!

చం॥ కలఁడొక బ్రాహ్మణోత్తముఁడు కౌశికనాముఁ డధీతవేదుఁడు
జ్వలశివభక్తిభాసురుఁడు సారవిచారుఁడు శాస్త్రవైభవుం
డ లఘుపురాణమర్మవిఖిలాగమకోవిదుఁ డార్యవర్తనుం
డలఘుఁడు పుణ్యతీర్థమహిమానుభవజ్ఞుఁడునై చెలంగుచున్. 3

మ॥ సకుటుంబుండు సబాంధవుండునయి, విశ్వక్షేత్రయాత్రాసము
త్సుకచిత్తమ్మున భక్తసంఘములు తోడ్తోరాగ సేవించె, న
త్యకళంకస్థిరభక్తి బెక్కులగు దివ్యక్షేత్రముల్ చేరఁగాం
చికిఁ గైవల్యసతీవలగ్నవసతిశ్రీలాలసత్కాంచికిన్. 4

కం॥ కామాక్షీకరుణాపీ, యూ మధురపవిత్రవారికంపాపీచిన్
దామెల్లఁగ్రుంకి చేసెను, సోమునకభిషేకములను శ్రుతిసూక్తములన్. 5

గీ॥ అచటి వేల్పుల నెల్లర నభినుతించి చేసి విధులెల్ల నాతీర్థసీమయందు
విడిసి యొక మండపమ్మున వెలదితోడ, ననియె, నాతండు వినబంధులాదరమున. 6

శా॥ కంటే మోహితమధ్య! యెయ్యెడలనిక్కాంచీవిలాసమ్ము ము
క్కంటిన్నైజగుణప్రభావమున నేకాంతామ్రభూచారిలోఁ
గొంటంజాలెడిసారసారస,సరఃకూజన్మరాళధ్వనుల్
వింటే సాధకపోతఘూంకృతిమరుద్వీధీశుకాలాపముల్. 7

మ॥ చరితార్థత్వముగంటె వల్లభదళచ్చాంపేయసౌరభ్యసం
భరితన్ సారస,సారసాంచదనుకంపంగోకిలాలాప, వి
స్ఫురితన్ సంచితశంకరప్రణయినీశుద్ధాంతరంగన్ శుభా
కర నీకాంచినిగాంచుపొంటెఁ ద్విజగత్కైవల్యసంధాయినిన్. 8

శా॥ ఆ భూమీసురమౌళి, బంధులమొగమ్మై యిట్లనుం గంటె రే
యీభూమింబరివర్త్య పుణ్యసుగమమ్మీనారికేళాటవీ
శోభల్ దుర్లభముల్ మఱొండునెడలన్ స్తుత్యమ్ములే నస్రవం
తీభంగమ్ములు వాహినుల్ పికరవోద్వేలమ్ములీయామ్రముల్. 9

ఉ॥ ఓ పృథుపుణ్యమూర్తి కనవో వినవో మునుతీర్థరాజి, నెం
దేపురమీపురమ్మునకు నీడగునే, నిగమాగమోజ్జ్వల
శ్రీపరిపాటిఁ జాలెడి, ధురీణములైన. పురీవనీధునీ
ప్రాపక సద్ద్విజప్రకరపాఠములోంకృతినాదమాధురిన్. 10

కం॥ అనునెడ నాగృహమేధిని మనమునఁ గాంచీనివాస మహిమము నిగులన్
బెనఁగొనఁ బెనిమిటికనియెన్ వినయమ్మును సిగ్గువెల్లివిరిసిననుదులన్ 11

మ॥ అనఘా మీదుననుగ్రహమ్మునను దివ్యక్షేత్రముల్ పెక్కుఁ గాం
చను, సేవింపను, బాపపుంజముల నొంచంగల్గె, నాత్మాశ్రయ
మ్మున వృక్షమ్ములు పక్షులున్ గిరినదుల్ పూజ్యత్వముం గాంచు, కాం
చినివాసమ్మది యెంతవారికొకదా సిద్ధించు జన్మమ్మునన్. 12

కం॥ అనఁదననిశ్చితమాయ్యం గన, వలుకటకలరియతఁడు కామిని యిదేసీ
మనసెట్ల యట్లయుండుద మనియెం దద్బంధుజనము నటఁగొనిదినముల్. 13

కం। నివసించి సెలవుఁగొనితమ నివాసములకరిగిరంత నెలతయుభక్తిన్
శివురాణిం గామాక్షిని వివిధవ్రతనియమములను విడువక గొలిచెన్. 14

కం। కొలిచినభక్తికి మెచ్చుచుఁ గలలోనంగానిపించి కామాక్షి; సతీ!
కలకోర్కి తెలుపుమనవుడు వెలఁదియు నాయమ్మ మ్రొక్కి వినయమెసంగన్. 15

కం॥ సుతునిమ్మనాకునొక్కని మతిమంతుని నీదుభక్తిమహితుననంగా
సతి! యిచ్చితిఁగొనుమని, యా, సతియంతర్ధానమందె నతికౌతుకమునన్. 16

గీ। విభుని మేల్కొల్పియతనికి విన్నవింప నగుచు నాతండు నెంతయుఁదగవు నీవు
భవుని యిల్లాలు దా మెచ్చి వచ్చినపుడు మోక్షమడుగక కోరితె పుత్రునొకని. 17

చం॥ అనిన వెఱంగుపాటున మహాత్మ! చిరంతనవాంఛితమ్మునా
మనమున నాటియున్నదది మాన్పగరాక కుమారు వేడితిన్
జనపుననా యొనర్చినది సాహసముం క్షమియింపుఁడంచు వే
డినమగనాలి మెత్తనినుడిన్ వగ డిందగ నాతఁడిట్లనున్, 18

పంచచామరము॥ విచారమంద నేల యిటులభీత హారిణనేత్రి! నీ
దుచింతితమ్మునాకు నధికతోషకరమునంచు, నా
శుచివ్రతుండు దేర్చెఁ దనదుసుందరిని గ్రమమ్మునన్
బచేళిమమ్ము పుణ్యఫలమనంగ నొకశరత్తునన్, 19

స్వాగతము॥ కాంతమోము తెలివి కాంతులనించెన్, వింతవింతలగు వేడ్కలు మించెన్
గొంత తగ్గెఁ దళుకుం జిగిచూపుల్, అంతకంతకుఁ బ్రయాసము హెచ్చెన్. 20

చౌపద॥ గగనముభూచక్రమ్మటుగ్రమ్మెన్, మొగిళులుమేరువుమోఁగలనుమొగిడెన్
ధగధగతెలివద్మమువికసించెన్, పొగరుడిగిననూర్పులువిడెఁ జేటల్ . 21

తోదకము॥ మంచిముహూర్తముమంగళవేళన్, గాంచెనుభూసురకామినియంతన్
బంచశరప్రియభాసురదేహున్, సంచితపుణ్యవిశాలునిబాలున్ . 22

మణిరంగము॥ బాలుఁడునాశశిబాలకులీలన్, గ్రాలుచుబెరుగనమ్మదమందెన్
బాలమాతయునాధునితోఁడా, నోలలాడెమహోత్సవమందున్. 23

రథోద్ధతము॥ నెమ్మిబాలునుపనీతునిఁగాఁగఁజే. సెమ్మహీసురుఁడుసెప్పెవేదముల్
ఇమ్ముగాఁదెలిపియెల్లశాస్త్రతం, త్రమ్ములందనసరాసరిదిద్దెన్॥ 24

వంశస్థము॥ జయించెవిద్వత్సభలన్ బుధేంద్రులన్, నయించెకీర్తుల్ నలినాల్గుదిక్కులన్
అయోజ్వలుండై యతఁడెల్లవెంటఁదం డ్రియంతవాఁడన్బికుదందెనల్లెడన్ 25

జలోద్ధతము॥ భజించెగురులన్ సహించెనయమున్ యజించెహరునిన్నభుంబరతరున్
బ్రిజల్ ప్రభులు తన్ భజింపగురుఁడై ద్విజాధరణమిందిరయమ్ములోడిచెన్

వ. అంత నాపుణ్యదంపతులు తమనుతుండు శివశర్మగుణసమృద్ధికినలరి యతనికిం బరిణయమ్ము సేయందలంచి రప్పుడాగృహమేధి. 27

ఇంద్రవంశ॥ ఇందీవరాక్షీహృదయారవిందముల్ కందించుసౌభాగ్యముగల్గువానికిన్
డెందమ్మునంబెండిలిసేయుకోరికన్ జె. దెన్విచారించెనుబుణ్యబాలికన్. 28

తామరస॥ కులవతిఁబావనిఁగోమలరూపన్ జెలఁగుచుఁబెండిలిసేసెఁగుమారుం
డలఘుఁడుపెద్దలయాదరమించన్ మెలగెనుగేహినిమేల్నడవడిచే 29

చం॥ కొడుకునునమ్రశీలయగుకోడలుఁ దమ్ముభజింప భక్తిమైఁ
గడపియొకింతకాలమును గౌశికుఁడీశ్వరసన్నిధానమున్

బడయఁగఁగోరి, పావనతపస్స్థితి, నంతటనిశ్చయించియా
కొడుకునుగోడలింబిలికెఁ గూరిమితోనొక కొన్నిధర్మముల్. 30

గీ॥ ఎఱుఁగునివిలేవుమీకు, మీరెఱిఁగియున్న, నెఱుఁగఁజెప్పఁగ, తప్పక, యొఱుకపఱతు
నన్నియాశ్రమములయందునఱయఁబెద్ద యగుగృహస్థాశ్రమమురత్నమట్లుశిలల. 31

గీ॥ ధర్మమర్థమ్ముకామమన్ త్రయము నెపుడు చెలగిపరస్పరరుద్ధమై చెడకయుండ
నడచికొనుటది లెస్స, దినమ్ముదినము వలయులింగార్చనము జేయఁబరమభక్తి 32

గీ॥ గురునకగుఁగాక తనదు కాపురము చెడఁగ నీతియొసఁగుటదోసమెందేనిఁగాని
యెంతలాభమ్ముకూర్చెడి వేనియైన గూడనిల్లాలిమదిచుఱఁజూఁడుపనులు. 33

గీ॥ పంచయజ్ఞమ్ములనువీడవలవ దెపుడు నగ్నిపూజనమగు దేవయజ్ఞమనఁగ
నమరఁబితృపూజనముపితృయజ్ఞమగును భూతయజ్ఞమ్ముప్రాణులపోషణమ్ము. 34

గీ॥ అతిథులభ్యాగతులువిప్రులనఘమతుల యర్చనమ్ముగుమానుషయజ్ఞమనఁగ
నమలఋగ్యజుస్సామవేదాధ్యయనము బ్రహ్మయజ్ఞమ్మునాభువిఁబరఁగుచుండు. 35

గీ॥ అరయశివలింగభూతిరుద్రాక్షలెపుడు విడకతాల్పంగవలయునువిమలభక్తి
జపముసేయంగవలయుఁబంచాక్షరమ్ము ప్రాణమున్నంతవఱకునుబ్రత్యహమ్ము 36

గీ॥ అన్నముభుజించు వేళనూర్యాభిముఖుఁడు ప్రాఙ్ముఖుండైనఁగావలెఁబంచజనుఁడు
అరయఁబరదారగమనమ్మునంతకంటె సకలశుభనాశకముదివాసంగమమ్ము. 37

గీ॥ జీవనమునిలుచుమాత్రభుజింపవలయుఁ గానిభోజనమాత్రమ్ముగాదుబ్రతుకు
ఇదియహింసనుసాధించుటెంతలెస్స హింసతగునొంటనిదియునుహింసయగుట. 38

కం॥ ఋతమమృతము, ప్రమృతమ్మును మృతమునుసత్యానృతముశ్వవృత్తులయందున్
క్షితిజనుఁడుతనదుదేహస్థితికై ధనసంచయమ్ము సేయగవలయున్. 39

సీ॥ ఋతముంచశిలము, నమృతయాచితమగు, మృతముయాచితము ప్రమృతముకృషి
యు, సత్యానృతమ్మనఁజనునువాణిజ్యమ్మ సేవశ్వవృత్తికుత్సితతమమ్మ
నరయనజిహ్మమ్మనశరమ్మనై నజీ వనముపాపులకెల్లవలయు నెపుడు
నాభిజాత్యమ్మనకర్మమ్మనకును సుకృతముపాపియమునకుఁగృతమునకును

ఆ॥వె॥ దగినవారితోడఁదగుఁజెల్మిసేయంగఁ దగనివారిదండఁదగదుచేర
ఋతముప్రియము పలుకఁడెన్నండుగానియు, ప్రియముఋతముపలుకులెడలఁ
జనదు 40

కం॥ అడుగుటయాలస్యముగా నడిగినదేయింతయైన, నగునీయంగా
బొడమెదునస్త్రమయమ్మగు, నెడలంగనరాదుతపను నెక్కాలమునన్. 41

గీ॥ నీటనుమియుట. దోసిటనీటఁగొనుట, సంధ్యభుజియించుటయుశూన్యశరణమందు
నొంటినిదురించుటయునిద్రనున్నవాని మేలుకొలుపుటయెన్నండు మేలుగాదు, 42

గీ॥ ఒకరుతాల్చెడువసనాదులూనరాదు గోటదురించుటగూడదే పాటిదాని
నగునుజూవఁగదోషమిందారయుధమ్మ వక్తసభలోనఁదప్పనిపలుకఁజనదు. 43

గీ॥ తగదుభోజనమేకవస్త్రమ్ముతోడ నొంటిఁజనరాదు పెద్దలయొద్ద నెపుడు
గూడదుయథేచ్ఛగాఁదానుగూర్చుండు టాత్మభూషణపరము పాపావహమ్ము 44

గీ॥ ఆవులింజెడు తుమ్మెడునారగించు సతి, రజస్వల, నగ్నను జనదుచూడ
నలసుఖాసీనఁదనసతినైనఁగాని యేకశయ్యనునిదురించు టెప్పుడుతగదు. 45

గీ॥ మనగృహాచారములనునేమఱఁగవలదు తల్లికామాక్షిసేవనిత్యమ్మనలుపుఁ
డనుచునొకవింత తెఱఁగైనమనముతోడఁ బ్రతుకఁగనుగొనిపలికెనా
పుణ్యగుణుఁడు. 46

గీ॥ పోయివచ్చెదమయ్యయీపుణ్యశీల మనసుమెత్తనిదనుకూల, మనము నెఱిఁగి
నెమ్మివర్తింపుమని వారికిమ్మగాఁగ బలికిసతితోఁడనిలుపి డెబాపిహ్మణుండు, 47

ఆ॥ వె॥ తమ్ము విడిచిచన నెడు తల్లిదండ్రులవీడఁ జాలకయును వారిశాసనమ్ము
దాటరాక పుణ్యదంపతుల్ వగచిరి నిముసమేడుగాఁగఁ గమలుమదుల. 48

కం॥ చనియతఁడు ఘోరతపమును బొనరిచి సతితోడఁ గొని యెముక్తి పదమ్ముల్
దినములవరుసం గ్రమమున మనములగురువిరహమింత మఱుఁగువడంగా. 49

వ. ఆ శీలవతీ శివశర్మ్మలు తమ గురుజనమ్ములు సెప్పినటుల వర్తించుచు 50

మ॥ తమయాచారము మేరమీఱక, గృహస్థశ్రేష్ఠులై వారలు
త్తమదాంపత్యవిభూషితుల్ మెలఁగిరంతం గొంతకాలమ్మునన్
బ్రమదారత్నము పుణ్యగర్భము ఫలింపం బొంగి నీలాభ్రియు
క్తములయ్యెం దరుణీస్తనమ్ములు పయోదత్వమ్ము నర్థించెనా. 51

— మూకకవి జననము —

ఉ॥ మూకములయ్యె నంచపదముల్గమనమ్ముల, మించు కాకలీ
కోకిలకంఠముల్ జిలుగు కుల్కులపల్కులడంచె. నెమ్మి రా
మూఁకలపింఛెముల్ విరిసె, భూవిపయోధరమధ్యమైన, యా
యాకస మొక్కటయ్యె జవరాలిమిటారిపిసాళి వేకటిన్. 52

మ॥ శరదబ్జాక్షి కుమారచంద్రమునిన్ శైలాధిరాట్కన్యకా
కరలీలాశుకడింభదంభపురుషాకారుం గుణోదారునో
ఙ్కారునింగాంచెఁ గుమారుధీధిషణు మూకాంబుణ్యలగ్నమ్మునం
దరుదై చూడ బుధుల్గురుల్గవులు నత్యాశ్చర్యసంపాదకున్. 53

ఆ॥ వె॥ జననకాలవిహితసంస్కారములనెల్ల సలిపిరతనికపుడు సక్రమముగఁ
గడచెఁ గొన్నినెలలు నెడనెడఁ బాలు వచ్చిచూచిపోయియచ్చటచట. 54

ఆ॥వె॥ గొడ్డువీఁగఁగాంచె బిడ్డనొక్కని నేఁడు మూఁకననుచు నిరుగుపొరుగవార
లవహసింపఁ బెనిచె నా రామ మంగళా కారులోకులరయఁగాఁకులనుచు. 55

శా॥ కామాక్షీకరుణాకటాక్షమును దక్కంగొన్న నాబిడ్డఁడే
లామూఁకుండగునంచుఁ జింతపడ నిల్లాలి నమ్మహీదేవుఁడో
వామాక్షీ! భవదుక్తిసత్యమగుచున్వర్ధిల్లు నీబాలుఁడా
కామాక్షీకృపనంచు నా సుదతి శోకమ్మింత చల్లార్చుచున్. 56

కం॥ పంకజముఖి యనుభోక్తవ్యం కర్మకృతం శుభాశుభమ్మనవిన వే
శంకిల్ల వలవదు నిరాతంకుండగు నీసుతుఁడు బుధప్రకరమునన్. 57

కం॥ అని యిట్లు పెక్కువిధముల మనస్వి యాతండు దేర్చె మానినిఁ బలుకుల్
నినుచు వసంతముకొఱకై వనప్రియకుమారుఁబోలి బాలుఁడు పెరిగెన్. 58

గీ॥ ఎన్ని యేఁగెను గ్రీష్మమ్ము లెన్ని యేఁగె, వానకారులు వెన్నెలనీను కారు
లెన్ని యేఁగిన మృదుసూక్తు లిచ్చి పెనుచు, జాణ యామని వచ్చెడి జాడ లేదు. 59

సీ॥ పలుకఁ గానుంకించుఁ బలుక నేరఁడుగాని పలికిన పలుకుల భావ మెఱుఁగు
భావమ్మెఱిఁగి దానిఁ బలువన్నె చిన్నెల గనపఱ్చఁ గన్నులఁ గట్టినట్లు
చూచిన వింతవస్తులలోనఁ గలిగిన సూక్ష్మభావమ్ము నచ్చగ గ్రహించు
విన్న కన్నది యెంతవింత దేయగుఁ గాక మఱచుట యెన్నండు నెఱుఁగఁడతడు
గీ॥ పలుకుబడులును విపులును గలుగనట్టి యాదికాలమ్ము వాఁడొ గాకభినయమ్ము
సరణిసకలమ్ముఁ గనునటాచార్యుఁడొక్క యనుచుఁ దలఁపించె జనులనా
యర్భకుండు. 60

కం॥ మానవ్రతుఁడగు బ్రహ్మజ్ఞాని యొకండిటుల వచ్చె నాయనిపింపం
గా నెవ్వరు మూఁకుండనఁ గానేరరు వాని రూపు గనుఁగొను వారల్. 61

క॥ వినయమ్మునయముగానమును సునిశితమగుబుద్ధిరూపసుందరభావ
మ్మును నాజననీజనకుల దినమునకొకవింతవగపు తెగులున నోడిచెన్. 62

క॥ ఉపనీతుఁ జేసి కొమరుని నుపనయముం జేయ వానికూహించు నెడన్
విపరీతకాలమున మాం త్రిపితలునొకమాఱె కాలధర్మమునందన్. 63

క॥ వందురుచెందముతోడం బొందుగఁ బ్రేతక్రియలనడపె మూఁడధరణి
బృందారకబృందారక బృందమ్ములుసంతసిల్లఁబృథుతరభక్తిన్. 64

గీ॥ అతిథిపూజనమభ్యాగతార్చనమ్ము నన్నదానమ్ముదీనపగ్వాంధజనుల
పోషణమ్మును దేవతాపూజనమ్ము నడపెనాతండుతనతండ్రినాఁటఁబోలె. 65

వ॥ ఇవ్విధమ్మునఁ బెక్కుశరత్సమయమ్ములు గడచుటయు నా మూకబాలకుండు
జననాంతరసంస్కారవిశేషమ్మున 66

క॥ దానములఁబెద్ద విద్యాదానముసేయంగఁదలచి తాఁగుందుచు, లో
లోనన్, భవానికరుణన్ దీనినిసాధింతుననుచు దృఢనిశ్చయుఁడై. 67

చం॥ కలధనమెల్ల నావటుశిఖామణి పేదలకన్నసత్రముల్
నిలుపఁగఁ బండితేంద్రులవనీపకు కాచుఁగలార్థికోటులన్
దెలుపఁగవెచ్చపెట్టి యవినిందితమాధుకరవ్రవృత్తిచే
వలిమలముద్దుపట్టిని భవానిభజించెజగత్కుటుంబినిన్. 68

ఉ॥ పుట్టకమున్నదాఁగెలిచె మూఁడవానుగర్మశుద్ధితోఁ
బుట్టినయట్టిదా మనము, బుద్ధియుఁజిత్తమహంకృతింగదున్
బెట్టసిబంటులై కొలువనిర్మధితేంద్రియుఁడైనవాని న
ట్టట్టనరాకయుండెను మునీంద్రులకైనమహత్వసంపదన్. 69

ఉ॥ వెఱ్ఱియితండుగాక యటుపెక్కుతరమ్ములుగూరుచుండి యే
జిఱ్ఱునజీఁదకుండఁ దినఁజెల్లినఁజెల్లని మొల్లమెల్లనా
వెఱ్ఱులకిచ్చి పొట్టకయి వేగుచుఁదూఁగుచు నెట్టులెట్టులోఁ
బుఱ్ఱయొకండుదెచ్చికొనెపోయని మూఁకహసింతురప్పుడున్. 70

వ॥ మఱియు నతని తల్లిదండ్రులందలంచి యంతకింతయయ్యోగదాయని పలువురు పలుతెఱంగుల దలంచుచుందురు. 71

గీ॥ వస్తువిజ్ఞానపూర్ణుఁడౌ వాఁడునొకటఁ బిచ్చివాఁడగు నగుఁగాకఁబిచ్చగాఁడు
రాలుఱప్పలగని లోనిరత్నశిలను గాజుముక్కనివిడువ నేఘనతతఱిఁగె. 72

సీ॥ తెలవాఱఁగాదీఁడు తొలికోడికూయుచో నలకంపలోఁదానమాడుటకును
స్నానమ్ముతోననుష్ఠానమ్ము నెఱవేర్చి యేకామ్రవిభురాణియిల్లుసొచ్చు
నాయమ్మ గుడియూడ్చి యచటనుభ్రము సేయుఁ బూవుబెత్తులగూర్చుఁబూజకొఱకు
నడినెత్తిపొద్దెక్కనంగానిగుడివీడి వెడలఁడేనాఁడును బిచ్చమునకు
గీ॥ బెట్టినను బెట్టకున్న నేపట్టునందు నయిదుగృహములుదాటిపైనడుగఁబోఁడు
రెప్పవాల్పనినిష్ఠతోఁ రేఁబవళ్లు నమ్మవారిని జింతించు నెమ్మనమున. 73

గీ॥ అమలమును నిశ్చలముదనయాత్మయందు నిలిచిజగములతల్లిదండ్రులనుచరింప
నాఁకలియుడప్పిమఱచియామూఁకుఁడొక్క వేళఁబిచ్చమ్మునకుఁగూడ వెడలఁ
బోఁడు. 74

చ॥ ఇటచనెఁ బెక్కుకాలము మహీసురసూతియు డెందమందు ము
చ్చటపడుచుండు నాకడుపుచల్లనితల్లికి ముద్దుబిడ్డఁడై
పటుతరసాహితీవ్యచనపాటవమందును గానరీతులన్
నటనలవిఘ్ననాథు, శిఖినాథుని, నందిని, భృంగిఁబోలఁగా. 75

గీ అఖిలజననియత్రికామాక్షి కభవునకును బ్రియకలహమ్ముగలిగినపట్టులందు
సాక్షియాతండుపలుకఁగాఁజాలకున్న వానిభాగ్యమ్ముజెప్పగావలనుగాదు. 76

ఉ॥ అంతటవచ్చెనామహిషమంతిరిణిగొల్వఁగ, శారదేందిరా
కాంతవిహారహర్మ్యము వికస్వరపద్మనికాంతముం దదా
నీంతనతన్మహీరుచిత్రణీకృతనవ్యవసంతభాగ్యసి
ద్ధాంతము, సౌఖ్యదమ్మగుశరదంబుదమై శరదంబుకాంతమై, 77

—* శ్రీ కామాక్షీ శివుల సంవాదము *—

కం॥ ఆ శారదనవరాత్రిశ్రీశుంభద్వాసరముల శ్రీమాతకు గా
రీశునకే కాంతమ్మున నాశంస్యమువాదుపుట్టె ననివార్యమ్మై 78

కం॥ ఏ కామ్రిఫలము గొనఁగే శ్రీకాననమందుఁదిపురులీలాశుకమే
దీ కానరాదయిపుడిటు నో కామినిమూఁగనోము నోచెనెచెపుమా. 79

ఆ॥వె॥ గట్టుపట్టువాడగానను కొంటివో, గట్టుపట్టి విడువగట్టిపట్టు
వలచి పలుకరింపఁబలుకెబంగారమా, పలుకుచిలుకపలుకుతోలకరింప. 80

ఆ॥వె॥ అబలచూడ దేలయమలముక్తాహార, మదిగొచిక్కె పదములంటఁబడియె
నరసికేలబట్టి యముక్తమైనయా హారముగను హృదయమవధరింపు. 81

మ॥ అటుగా దేని, పయోరుహాక్షి యి దెనీయాజ్ఞానుబద్ధుండ నీ
కుటిలభ్రూకుటి తేటగాఁగనుము, చేకూర్తుంగటీమండలీ
తుటితదుద్యన్మణిహారముం గగనసింధుప్రేక్షణీయమ్ముగాఁ
జటులోత్తుంగపయోధరాద్రిశిఖరింజందారింకురోల్లాసిగా. 82

ఉ॥ కొంచెపుబుద్ధు లేలయనుకూలుఁడఁగానొకో యష్టమూర్తిరా
పాంచితుఁడౌట దక్షిణసమాఖ్యయుఁజెల్లినఁజెల్లవచ్చు నీ
కాంచికిగట్టువడ్డ ననుఁగాదని యేఁటికివంక లెన్నుచుం
బెంచెదవీ వివాదమును బేరలుకంగరుణావిదూరవై. 83

మ॥ అనుచుం బెక్కువిధమ్ములం బలికి యయ్యాహార్యపుత్త్రీమన
మ్మును దెల్పన్ శిరమామె పాదమున నా ముగ్ధేందుకోటీరుఁ డ
ల్లన మోపెం బ్రథమాపరాధమను లీలం దానఖద్యోతిరం
గనలం దాఁకఁగఁ జంద్రమఃకిరణముల్ గంగాప్రధానమ్ముగా. 84

ఉ॥ మోపిన దత్తఱించి తనపుక్కిటదమ్ముల మొక్కపక్కగాఁ
"దూ" వడఁ జేసి గద్గదమధుస్రవదక్షరమంజులధ్వని
శ్రీపరిపాటిఁ దోఁనఁ జెమరించిన కేల్గవ నెత్తి మ్రొక్కి రా
రాపిళులాడుచనవసరమ్మను బయ్యెద నొత్తి దిద్దుచున్. 85

ఉ॥ చాలును జాలు మీఁదు సరసమ్ములి నెక్కడి వింత చేఁతలీ
వాలక మెల్ల నా సరుల వంకలు దిద్దెడి వేళఁ బోలినం
బోలఁగ వచ్చునో పరమపూరుష యీ సడి నాకుఁ గట్టఁగా
నేలొకొ మీ మనఃప్రియము లెవ్వరు గాదన నేర్తు రింతకున్ 86

చ॥ అనుటయు నీశుఁ డిట్లనియె నంగన నీతుది వాల్కు మాటలన్
విని భ్రమ జెందు వేళ గడవెళ్లెను జుమ్మటు కాక యిద్దినీ
కనభిమతంబ యేని తగవాడిన యిద్దఱిలోన నొక్కరిం
గినిసి శపింప నేల పరికించిన నిర్వురు దోషులే గదా. 87

వ॥ అనుటయు భ్రుకుటీసమాకుంచనసూచితరోష వేపదరుణితకపోలసుందరవద
దనమ్మునం జిఱునగవు మెఱయఁ బరుసని చూపుల నా గంగాభుజగుం గటాక్షించుచు, 88

చ॥ అవు నిది లెస్సమాటయె గయాళితనమ్ముగ గండుచిల్క త
ప్పు నసిలోనె ఱింగియు శుకాంగన వంతలు మాయలాడి దా
దివిచెను మత్ప్రసంగమది, తిట్టిన దిద్దినఁ బోవు దోసమే
మవినయశీలుఁడా ఫలము నందక యుండునే యంచు, గౌరియున్. 89

చ॥ పలికిననవ్వియెందుఁబొరపాటొనరించినవారలొక్కొర
వ్వలఁదగఁదత్ఫలమ్ముగలవారుమరొక్కరునైరిగాదె నీ
పలుకులఁజిందుదేనెచలువల్ శుకబాలికపాలిపెక్కునో
ములతొలిపంట తత్ప్రియుని పొత్తువిడంబడఁజేయనయ్యెనే. 90

చ॥ అనవుడునాథుఁజూచి తుహినాచలబాలిక నేనుబెంచిది
ద్దిన శుకడింభకమ్ము తెగ తెంపునవర్తిలినందు కియ్యెడన్
వనరునుగాక దానివరవర్ణినిదానొకవర్ణయై భువిన్
వనరునుగాక మూఁగయయిప్రాక్తనవర్తనమెల్లమాయగా. 91

ఉ॥ నావినిశంకరుండు లలనా! మగనాలి, భర్తతో
నావలఁద్రోసె దంగనవు న్యాయ్యమెనీకిది యౌనుగాక నే
నావరవర్ణినిం బెనుపనా! యిదెదానికినిన్ను వేడెదన్
కేవలముం దయార్ద్రమగు నిర్మలదృష్టిననుగ్రహింపుమా. 92

వ॥ అని పలువిధముల నొప్పించినను బట్టువిడక. 93

ఉ॥ తప్పదు నాదుమాటవితథమ్మె యనన్ సతి ఈశ్వరుండునున్
తప్పదునీదుమాట వితథమ్మయటంచును మూఁడలించివాఁ
డెప్పటికేని నీదయ నెయిచ్చటికిం జనుదెంచుచూడుమా
యిప్పటికయ్యెఁగాక సహియింతువె తద్విరహమ్ముకింతయున్. 94

కం॥ బింబాధరోష్ఠికనుమీ, బింబాశనురిత్తనీవు వేఁగింపక నీ
తాంబూలష్ఠీవన మా, బింబాశికి నిచ్చుఁదొంటివిద్యల నెల్లన్. 95

చ॥ ఇది ప్రథమాపరాధమని యెంతయుభక్తిని నిన్నువేడ నా
యదనను సైఁపవైతివిగదా! కుటిలాలక నీమరూపసం

పడ వచియించి మూఁగయగువాఁడిదె నేఁడును నీదురూపసం
పద్వచియించి సర్వకవివందితుఁడై తనతావుచేరుతన్. 96

కం॥ అది తనుయుపదానమ్మును, దనచెలులట నాడ విజయుదశమినిగొలువై
కనుచుండమూకుఁడు జిగ జ్జననింగనెఫలితసుకృతసంస్కారమునన్. 97

ఉ॥ ఆసమయమ్మునందొక శుకాంగన యాసతిపాదపల్లవ
శ్రీసవిధమ్మునంబడివచించె. జలుంకునెలుంగురాల్పడన్
జేసినసాహసమ్ము ఫలశేషముడి ద ననుగ్రహించి నీ
దాసిఁగృతాపరాధ నిఁకఁ దల్లి! ప్రియున్ ఘటియించియేలవే. 98

ఉ॥ ఎల్లవిధమ్ములంగొలువ నింతగడిద్దితి. విద్దెలన్నియుం
జల్లనితల్లి మీఁదుపరసమ్ములఁదీర్పులు దిద్దనింతగాఁ
జెల్లుబడిన్ ఘటించి దయసేసితి పక్షుల మమ్ము నేఁడు గా
సిల్లఁగఁజేయ నీమనసుచెల్లునె నిక్కము చెప్పుమంబికా! 99

ఉ॥ ఎల్లజగమ్ములమీకునొక నింతలునంతలు నాటవస్తువై
చెల్లఁగ నొక్కపక్షియట చెసెనహో పొరపాటు దానిఁగో
పిల్లగనేల మీ చదువఁజెట్టినపల్కులు పల్కుదోసమా
పిల్లలతప్పిదమ్ములవి పెద్దలఁజెందునొజెందనేరవో. 100

ఉ॥ ఎన్నిమహాత్వముల్గనిన హీనిపులుల్ పొరపాటుసేయరో
చిన్నతనంపుఁజేష్టలివి చెల్లునటంచును బ్రోవనేరవో
యిన్నిదినాలకూర్మిగణియింపవో, మావదుకష్టపాటు నీ
కన్నులగానవో తఱియు గావొకొ మమ్మననుగ్రహింపఁగా. 101

కం॥ మీ యెంగిలిఁదినిబ్రతికిన; మా యొనగుచుదప్పులెల్ల మన్నింపవె మా
కీ యెడబాటు దొలంగం; జేయవె, మముఁగన్నతల్లి శివశనువల్లీ. 102

క॥ మీరిదుమహత్వసంపద; మీరూపము దాల్చి మేము మెలఁగుటతీఱం
గా రాని దోసమగునే నౌరా మీరూపుకాని యదియొకదున్న. 103

శా॥ దోసమ్మేయగుఁగాక యద్దియు మహాదుష్టాత్ములంబట్టి కా
రాసంబద్ధులఁజేసియు న్విడువరే రాజేశ్వరుల్వారి యు
ల్లాసమ్ముల్ ఘటియిల్లువేళ బ్రజలెల్లంబేర్మిఁ బెంపొందఁగా
నాసంప్రార్థనమింతమాత్రమయిన న్మన్నింపు రాజేశ్వరీ. 104

గీ॥ చిలుకపలుకులుపరికింపఁ బలుకుఁగాక; సహజ భాషలఁదెలుపంగజాణయగునె
యనుచు నెంచెదో మీపెంచినట్టికవుల; పలుకులందును భావమ్ము వెలితిపడునె. 105

చ॥ అనునెడ గట్టుబిడ్డమనమల్లఁగరంగె నవర్ణచిత్తముల్
వనిచెను గాళికాననమున న్గలువ ల్వికసించెఁ, జండిమో
మున భ్రమరమ్ము లొక్కమొగి మూఁకలుగా విరియంగనింక మూ
కునకట వాక్యసంపదలొకో ఘటియిల్లని వట్టివేళలన్. 106

క॥ అది కాంచిమూకుఁడిఁకఁదన; ముదితను,గౌన,గనఁగనయ్యె ముదితమతిసతీ
వదనాభ్యుదితమ్మగు త; మిఁదగందానొక్క గ్రుక్కమ్రింగెడు వేడ్కన్. 107

ఉత్సాహము:- అల్లనల్లనగిరియెగిరి యమ్మవారిచేతిలో
నుల్లసిల్లుఫలముగొనఁగ నూహసేయునొక్కటన్
మెల్లమెల్లవ్రాలికొ లక్షమింపవేడఁగోరుఁ దా
నుల్లసిలుశుకాంగన బ్రియోక్తులందెమల్పగా. 108

శా॥ ఆలోన న్గిరిజాత జాతకరుణార్ద్రాపాంగవీక్షావళిన్
జాల న్వారల దప్పుగాచుటలు విస్పష్టమ్ముగావించి త
న్మూలక్రోధమువీడె నాఁగఁదములంపుంజిల్కలంబూని. తాం
బూలస్వీకసమాచరించి పలింకెం బోచున్నకోపమ్మునన్. 109

శా॥ మా రూపమ్ములు దాల్చి దోస మొకటా మామాటలం బల్కుచున్
మీ రంతఃపురచక్రవర్తు లయిన న్నేమేలమి మ్మేలగాన్
గారాకూరము లింతసేసి పిదప న్రక్షింప నర్ధింతురీ
నేరమ్మున్ సయిరింప మీరు మఱి యే నేరమ్ము గావింపరో. 110

వ॥ అను నాసమయమ్మున. 111

— ※ మూకుఁడు మహాకవి యగుట ※ —

ఉ॥ పుక్కిట తమ్ముల మ్ముమియు ప్రొద్దున కై యట వేచి యుండుటన్
గ్రక్కున మ్రింగి దానఁ ద్రిజగజ్జనయిత్రి ప్రసాదభక్షణన్
దక్కిన సాహితీచతురతా కవితా గురుతా ప్రభావముల్
పిక్కటిలంగ మూకుఁడు కవిప్రవరుఁ డయి మోద్పు చేతలన్. 112

కం॥ క్షమియింపఁగదవె తల్లీ; కుమారు నాగ్రాపరాధుఁ గోమలవీక్షా
క్రమమున నమస్కరించిన; క్షమియించునుగాదె దాసజనదోషమ్ముల్. 113

ఉ॥ మించిన ప్రేముడిన్ శిరసుమీఁదనుగంగ ఘటించుతప్పునన్
గాంచికిగట్టువడ్డ త్రిజగత్పతిపాదములంటి వేడఁగాఁ
గంచుకమున్ సడల్చు పులకం గిలికించితమూర్తి దాఁ బటా
పంచలుసేయు మూకకవిపావము కోరిక వీరికెత్తఁగా. 114

చ॥ కనుఁగొని పార్వతీప్రణయగాథల నామె యనుగ్రహమ్మునన్
దనరుట నట్టిరూపములు దాలిచియంతటఁ దత్ప్రసంగముల్
చనువునఁ జేయు నా చిలుకజంటను గన్గొని సిగ్గురోసమున్
మునుకొన ధాత్రినందొకరి మూకునిఁ జేసిన తల్లి ప్రోచుతన్. 115

చ॥ తన యిడునట్టిపీడియము తమ్మగ్రసించి యశేషవిద్యలన్
కొనుటనునట్టి తమ్మదినఁగూడిన నా పరిణయప్రసంగముల్
వినిచినదొంటి బుద్ధియు వివేకముగల్గ ననుగ్రహించునా
ధునిమది మెచ్చిమెచ్చనివధూమణి మమ్మ ననుగ్రహించుతన్. 116

చ॥ ప్రియు నెడబాసి దుఃఖపడు పెంపుడుచిల్కకుఁ దోడినీడయై
ప్రియునకుఁజిల్కకై తనకుఁబెద్దగ నౌ కలహమ్ముదిద్దఁగా
నయమిడిప్రోవనిందు కొలువై శుకకాంతవిలాపమెంతయున్
దయవినుతల్లి మా కొసఁగుతన్ బహుశాస్త్రములిష్టసిద్ధులున్. 117

మ॥ అని మూకుండు స్తుతించునయ్యెడల "నేలా వీరినీరీతి నిం
కనుగారింప" నటన్న పల్కు మనుగాఁగన్పట్టెఁ బేరోలగ
మ్మున శంభుండు నగేంద్రపుత్రి ధవుళింబూజించి సింహాసన
మ్మున నర్ధాసనసంస్థితిన్నిలిచి చూపుల్ చిందసింగారముల్. 118

మ॥ మునుమాటాడినవారలెవ్వరొ గడుంబూజ్యుల్ నుఁడీ నేఁడుగాఁ
గనుగొంటిన్విజయమ్మనంగ నగుచుం గామాక్షియీయున్నవా
రిని నీ యాపరిణయప్రసంగముల సంప్రీతిం బ్రబోధించువా
రినిఁబ్రశ్నింప నిజమ్మ దేలునని తర్కించెన్ శివుండంతటన్ 119

కం॥ కామాక్షినగుచు మూకస్వామిని గని వత్సమీకు జయమబ్బెను మీ
సామి యిడు నాజ్ఞ నెఱపెద వో; మూ నెదొ కాకన కునొకసడియేలా. 120

కం॥ అనవినిశంభుఁడు వత్సా మునునీగృహలక్ష్మికీవు ముచ్చటపడి చె
ప్పినయది పలుకుము యిది మీ; జననికి నెమ్మనమునందు సమ్మతమనినన్. 121

క॥ శిష్యులకును మెప్పిక్కియాసభ; చెవులారఁగఁ జేసి వినఁగఁ జిలుక చెలువయా
శిష్యరాశిఁ జేరికన్నన్; గవబెదరులు సిగ్గుచిలుకఁగా వినుమండన్. 122

క॥ పంచశతశ్లోకిని గవి; కాంచనగర్భుండు నోడువఁగాఁ గడు మెచ్చెన్
బంచాస్యుఁడు కామాక్షియుఁ; గాంచియనేక మూకుఁ బేర్మికడలుకొనంగా. 123

క॥ ఈనీస్తుతి విను వారల; కేనిచ్చెద నల్లశుభము లెడ సేయుకీర్తిన్
నానాకవిబుధవిజయ; శ్రీనాథుఁడవగుచు మూకుఁ జేరుమ యనుచున్. 124

క॥ కనమొఱఁగెనంత నాసభ; కనువిచ్చుచు మూకుఁడెదుటఁ గనుఁగొనె విద్వ
జ్జనములజనములవినయ; మ్మునఁ గేలుఘటించి ఫాలమున నిలువంగా. 125

సీ॥ ఒకమాఱుపరియింపు మో స్వామి, తరియింతు; మనియెడు కవిపండితనివహమ్ము
కామాక్షి నీకూపుఁ గైకొనె మా పనా చార్యుండవను మంత్రిశాస్త్రవిదులు
పుంభారతీ! గానమును దిద్దుమమ్మేలు; మను గాయనీగాయనావళియును
నింతవాఁడవటంచు నెఱుఁగము మా తప్పు; క్షమియింపుడను పౌరజనముగలిగి
గీ॥ చుట్టునిలిచిన వారలఁ జూచి యతఁడు; తల్లి కామాక్షి మహిమమింతయు నిజమ్ము
నేఁడ మూకుఁడ నేనేఁడ యిట్టిశక్తి; యేఁడ మాతల్లి దయతోఁడ నేలకున్న. 126

క॥ అనిపలికి సముచితమ్ముగ; జనములవీడ్కొనుచుఁ గాంచి జనులొనరుచు మ
న్ననఁ గొని విద్వద్విజయ; మ్మొనరుప దిగ్విజయయాత్రికుత్సుకమతియై. 127

వ॥ కతిపయచ్ఛాత్త్రసమేతుండై వెడలి యఖండాపురము వారలు దనవలనఁ దన పూర్వవిషయమ్ము నెఱింగి యబ్బురపడుచుఁ దన తల్లిదండ్రుల పుణ్యవిశేషమ్మునుగ్గడించుచు విడువనేరక యెట్టకేనియు దన్ను వీడ్కొలిపినం జని కొన్ని వసంతమ్ములకుం దన కవితాప్రపాఠనమ్ముల భృత్యత్వాపన్న వచనమ్ములుగా నెమ్మికోలు సేసిన కాంచీనివాసుల స్వాగతమ్మునందికొనుచు 128

క॥ తనకవితగీర్తియును దన; మునుగానతఁడెల్ల దేశములఁ బండితులన్
దనశిష్యులగుచుఁ గొలువం; జనుదెంచెనుగాంచిపురికి జయసహితుండై. 129

ఉ॥ వచ్చియతండు భక్తిని భవానికి మ్రొక్కుచు నమ్మ నీవు నాఁ
డిచ్చినదీవెనన్ జగము నెల్ల జయించితి నింకభూమిపై
నిచ్చయ లేదు నీపదము నెన్నఁడు చేరఁగ భాగ్యమబ్బునో
మచ్చిక తెల్పి నీ శుకకుమారుని నన్ను ననుగ్రహింపుమా. 130

—※ మూకమహాకవి దేవీసన్నిధిం జేరుట ※—

క॥ మూకుఁడను జటులదుర్గతి; శోకుఁడనగు నన్ను సకలసుకవిస్తుత్య
శ్లోకునిఁ జేసినతల్లీ; నీకిదె కైమోడ్పు శ్రితవినిద్రకటాక్షా. 131

శా॥ శ్రీపుంసాద్వయరూపమై వెలుఁగునన్ సింగారముల్ చూపు నీ
చూపుం బ్రాపుగఁ గొన్న మూఁగ చతురాస్యుండై బుధారాధ్యుఁడై
ప్రాపించున్ సుకవిప్రభుత్వమును శుంభన్మోక్షలక్ష్మీవిభుం
డై పాటించుఁ బరత్రయమ్ము నుపనిషద్వ్యాఖ్యానచిన్ముద్రలన్. 132

క॥ ధనపతిమిత్రుండగుటొక; ఘనమా యణిమాదిసిద్ధి గనుటొక ఘనమా
నిను మానసమున నిలిపిన; మనుజుండఖిలదేవముఖ్యుండనఁగా. 133

సీ॥ బహుళాంధకారవిధ్వంసనప్రక్రియా; భాస్కరమ్ములు నీదుపాదరుచులు
బుధలోకజీవనౌషధములు ఫలియించు; నమృతమ్యూతులు నీదుహాసరుచులు
పశ్యదళీకాగ్నిభస్మీకృతాంగజ; ప్రాణౌషధులు నీదుపాదరుచులు
రాగదూరదిగంబరమనోనురాగోపదేశకమ్ములు నీదుదేహరుచులు

గీ॥ బహుళపుణ్యపరీపాకపరిచయైక; లభ్యములు నీకటాక్షవాల్లభ్యములు గ
దమ్మ నీకయి కావించునర్చనములు; ముక్తిమంటపసోపానములుగదమ్మ. 134

సీ॥ నటనారటన్మహానటజటాజూటక; త్రుటినీతరంగమిత్రమ్ములగుచుఁ
గాద్రివేయేశ్వరగ్రైవేయకంఠహా; రావళీరత్నహారాళియగుచు
వేధనూపురముక్తి వేశ్మపాదద్వయీ; నాళీకవరమహంసాళియగుచుఁ
బుష్పవన్నయనసంఫుల్లాస్యనవమధు; పశ్యతోహారకృతబాంధవములు

గీ॥ నగుచు ననోన్యమును నీకటాక్షరుచులు; హాసరేఖావిలాసమ్ములస్మదీయ
రాకపరిభూతహృదయపరాగమడఁచి; ప్రోచుఁగావుతబంధవిముక్తినొసఁగి. 135

కం॥ ఝుమ్మలై సరులై విరులై; శిరమురమునఁగరమునందు శివునకునలరెన్
గుమ్మలైమరులైయురులై; పురుడయ్యెనునీకటాక్షములు నగవులతోన్. 136

కం॥ కలమృదుపదముల,వినినీ; గళపంజరమందునుండి కీరోనఁజిలుకన్
వలరాచవాఁడు పన్నిన; దలబింబమొకాని నీమ నధరమొ తల్లీ. 137

శా॥ నీవేతల్లివి నిన్నెనమ్మికొలుతు న్నీచేతపరిలబ్ధిన్
నీవాల్లభ్యముకైయజింతు జగముల్ నీవల్లనో నీకునీ
డౌవారెవ్వరు నాదుసర్వమును నీయందర్పణంజేసెదన్
భావమ్మందులనిల్పిప్రోవగదవంబా నన్నుఁగాంచీశ్వరీ. 138

కం॥ ఏకామ్రభాగధేయ; మ్మేకమ్మరుణారుణమ్మ నీదృశతేజ
మ్మాకల్పముకాంచీనగ; రీకల్యాణమ్ము మాకరిందము మగుతన్. 139

మ॥ కమలాంధకకరణౌషధీగ్రథితజాగ్రన్మూర్ధసౌభాగ్యమున్
కమలాకోటినిషేవ్యమాణవిలసత్కల్యాణపాదాబ్జమున్

కమలామోదముఁ గామితప్రదము శ్రీకాంచీనివాసమ్ము మా
కమనీపీకృతి దక్షమంజులకటాక్షమ్మం బ్రణామించెదన్. 140

కం॥ చలువలు వెలిఁజిమ్మెఁడు నల; గలువలచేఁ గమ్మతావి కమలమ్ములచే
మెలమెల్ల మెలఁగునగ్నిలి; గల చల్లనిచూపుచేతగను మాతల్లీ. 141

మ॥ చిరకాలమ్మయి వీడివచ్చితిని నాచింతామణీరత్నవం
జరబంధమ్మను డిందఁజేయుమిఁక నిస్సారమ్ము నీయస్థి వం
జరబంధమ్మను దల్లి నాదగు సమాచారమ్ము వేత్తైనఁ దె
త్తురొ వాకట్టుదురో యెన్నఁడేని మనమందు న్నన్నుఁజింతింతురో. 142

మ॥ అనియీరీతినుతించి మూకకవి కామాక్షీ కృపాసంగతిన్
గనియెం దొంటిపదమ్ము పావనయశః కాయప్రశస్తుల్ గనున్
మినుముట్టన్ శుకసార్వభౌముఁడగుచున్ మిన్నంది యాయమ్మచే
తను వ్రాలెం బ్రియమంది యాశుకియుఁ జెంతన్ వ్రాలఁ గూవెట్టుచున్. 143

కం॥ కామాక్షికి నేకామ్ర; స్వామికి నేకాంతమందుఁ బ్రణయములందున్
దామధ్యవర్తియయి ప్రియ; తో మూకకవీంద్రుఁ డిష్టతుష్టులఁజెలఁగున్. 144

కం॥ మూకుని చరిత్ర విన్నను
మూకుని కవనమ్మువిన్న ముదమంది యశ
శ్శ్రీకళ్యాణ సమృద్ధులఁ
జేకూర్తురు కాంచివిభులు శ్రితవత్సలులై. 145

మ॥ కలుగండింతకుముందొకండును భవత్కల్పుండు మాతండ్రి పు
ణ్యులు సాహిత్యకవిత్వపీఠమున దారోద్ఘోలగమ్మన్న యా

తొలిపుణ్యాత్ముల యుష్మదీయకరుణాదోవాహినీతీరమం
జుళసంతానఫలమ్మునంది కొనుమీ సువ్యక్తమాధుర్యముల్. 146

కం॥ శంకరసువర్ణహారిముఖ; కంకణ; పదవినతసూర్యకాంతావదనా
లంకారకుంకుమాంకిత; పంకేరుహసదృశచరణ భవహరణచణా. 147

వంశస్థము॥ సువర్ణరుద్రాక్షవిశోభికుండలా
భవార్ణవోత్తారణపాదమండలా
కవీంద్రసంభావితకావ్యమండలా
నవావతారాయితనాగకుండలా. 148

మ॥ పరిపూతాత్మ సతీవినిశ్చితకృతిప్రారంభసంభావనా
పరిణాహస్ఫురదంతరాళజననప్రఖ్యాతకాంచీపురీ
శ్వరమాహాత్మ్యమునందు నెన్మిదవ నాశ్వాసమ్ము నిక్కావ్యముల్
గరుణంజూతత శంకరుండు స్వశిరశ్శ్రీమణగంగాకృతిల్. 149



# తప్పొప్పుల పట్టిక.

| పేజి | పద్య. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧ | ౧ | శ్రేష్టుండు | శ్రేష్ఠుండు |
| | | జ్యోత్సలన్ | జ్యోత్స్నలన్ |
| ౨ | ౮ | స్వాధీ | సాధీ |
| | ౯ | మూర్తిభక్తి | మూర్త్భక్తి |
| | ౧౦ | మాలించుచుచీ | మాలించుచీ |
| ౪ | ౧౬ | యద్వ్యాదృతిక | యత్నాదృతిక |
| ౫ | ౨౫ | రాద్యూభవణ | రాడ్యూభవణ |
| ౬ | ౩౪ | లక్ష్మీదాక్షిణ్యా | లక్ష్మీదాక్షిణ్య |
| ౧ | ౩ | శ్రీకాంచి | శ్రీకాంచీ |
| ౨ | ౮ | పదాబ్జాళుల | పదాబ్జాతుల |
| | ౧౫ | యయ్యెను | మయ్యెను |
| ౪ | ౨౩ | దేశికాత్తము | దేశికోత్తము |
| ౫ | ౩౦ | చేహారి | బేహారి |
| | ౩౧ | తోడ | తోడ |
| | | నెట్టిని | నెట్టని |
| ౬ | ౩౬ | రసతిత్వ | రసతత్త్వ |
| ౭ | ౩౮ | కవితాది | కవితాతి |
| | ౪౧ | శేయదొాసఁగు వెసగవె | నేయదొాసఁగు లెసగవే |
| ౮ | ౪౭ | మహాత్మ్యశ్రీ | మాహాత్మ్యశ్రీ |
| | ౪౯ | కాకార్జున | కార్జున |
| ౯ | ౫౧ | కువీనుని | కులీనుని |
| | ౫౬ | పంసంతత | సంతత |
| | ౫౭ | తొల్లప | తొల్లప |
| ౧౧ | ౬౧ | చిత్రముల రంజిల | చిత్తమ్మున్ రంజిల |
| | ౬౩ | మహేంద్రి | మహేంద్రి |
| ౨ | ౭౬ | యొందుల | యొందనల |
| ౩ | ౮౩ | కాంతుండై | కాంతుఁడై |
| ౪ | ౯౧ | నిర్వాహాకు | నిర్వాహకు |
| | ౯౩ | నికని | నిదని |
| | | వినయమిత | వినయనమిత |
| | | కేలంగవ | కేలంగవ |
| | ౯౪ | యలట్టు | యట్టుల |
| ౫ | ౯౬ | సన్మమాషధీ | సన్మహౌషధీ |
| ౬ | ౧౦౦ | గానచట | గానని చెటు |
| | ౧౦౪ | ప్రిమథానికా | ప్రమథానీకా |
| ౭ | ౧౦౮ | దామెా | నామెా |
| | ౧౧౧ | వహించు | వహియించు |
| ౮ | ౧౧౭ | మప్పుడు | మప్పుడ |
| | ౧౧౯ | డిక్షించెక | డీక్షించెక |
| ౯ | ౧౨౪ | వైచునుకా | వైచునురకా |
| ౧౧ | ౧౩౪ | దర్శనమున | దర్శనమ్మున |
| ౧౨ | ౧౩౬ | ననునో | నను |
| ౧౩ | ౧౪౨ | నతండుక | నతడుక |
| | ౧౪౩ | గరాకదనంబుల | గధాకథనంబున |
| | ౧౪౪ | వాల్లభ్యా దను వెడ | వాల్లభ్యా దను వేడ |
| | ౧౪౬ | మంధాదిర్ | మంథాద్రి |
| | | దూలెన్నను | దూలెన్నన్ను |
| ౧౪ | ౧౪౭ | నక్షేణమోక్షు | నక్షీణమోక్షు |
| | ౧౪౮ | గణింపగ | గణియింపగ |
| | ౧౪౯ | సంతాపము | సంతానము |
| ౧౫ | ౧౫౫ | కవి | కలి |
| | ౧౫౭ | క్రియఘన | క్రియాఘన |
| ౧౬ | ౧౫౯ | వేళన్నము | వేళన్మము |
| | ౧౬౦ | చక్షుశ్శ్రితి | చక్షుశ్శ్రితి |

| పేజి | పద్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౬ | ౧౬౧ | మాకెలుక పడగ | మాకెలుకపడద |
| | ౧౬౨ | సేవయే | సేవయె |
| | ౧౬౪ | కల్పనవిచ్వ | కల్పనలిచ్చ |
| ౧౮ | ౧౬౯ | యమ్మహేశ్వరు | యమ్మాహేశ్వరు |
| | | నమృతాంధస్వామి | నమృతాంధస్స్వామి |
| | ౧౭౧ | కుహుకుహూ | కుహుకూహూ |
| ౧౯ | ౧౭౮ | తనబుద్ధి | తనదు బుద్ధి |
| | ౧౭౬ | మొగిడిక | మోగిడెక |
| | ౧౮౦ | వృత్త | నృత్త |
| ౨౧ | ౧౮౭ | వాలభ్యక | వాల్లభ్యక |
| | ,, | డిల్లంబోయి | డిల్లంబోయె |
| | ౧౯౧ | గానుగన | గానుగను |
| | ,, | వనజలా | మనుజులా |
| | ౧౯౨ | వియన్న్యవాను | వియన్నివాను |
| | ౧౯౪ | చెదవో | చెదవొ |
| | ,, | ఫలాలా | ఫలా |
| ౨౨ | ౧౯౭ | నొత్తిరించి | నొత్తిలించి |
| | ౧౯౦ | అతిథిపెవరో | అతిథులెవ్వరో |
| ౨౩ | ౨౦౦ | కకణ | కంకణ |
| ౨౫ | ౨౨౦ | వినుడు | ఇనుడు |
| | | జగముయగునొ | జగమునగునొ |
| ౨౯ | ౨౬౯ | నంబాడుచున్ | నంచాడుచున్ |
| | ౨౩౧ | సందగ్భమునన్ | సందర్భమునన్ |
| ౨౮ | ౨౪౧ | బూజుంచెన్ | బూజించెన్ |
| ౨౯ | ౨౪౫ | మఱవ | మఱువ |
| | ౨౪౯ | మంచునంచు | మందునంచు |
| ౧౧ | | గాస్వామి | గస్వామి |
| | ౨ | కామ | రౌమ |
| ౩౨ | ౯ | నిన్దెచ్చున్ | నినిదెచ్చున్ |
| | ౧౦ | డిల్లిపడి | డిల్లపడి |
| ౩౩ | ౧౨ | కాల్విడదెత | క్రాల్విడదెంత |
| ౩౪ | ౨౩ | శరణాటిం | శరణంటిం |
| ౩౯ | ౩౯ | దృంచిన | దు[illegible]ంచిన |
| ౩౬ | ౫౦ | దురంముదన్ | దురమ్మునన్ |
| | | వించినవించిన | వించిననించిన |
| | ౫౧ | దంగాప్రిహి | దండగాప్రిహి |
| | ౫౨ | చిప్పివెన్ | చిప్పిలెన్ |
| ౪౦ | ౫౬ | సాగరవేళ | సాగవేల |
| ౪౨ | ౯౭ | బల్కెను | బల్కెనొ |
| | ౩౬ | జగంబును | జగమును |
| ౪౫ | ౯౪ | విష్ణుదుర్మంత్రి | విష్ణుని దుర్మంత్రి |
| | ౯౫ | కార్ధమ్మగుచు | కార్ధమగుచు |
| ౪౯ | ౧౦౧ | కోతేరు | కోటీరు |
| ౪౭ | ౧౦౪ | మహేశ్వరీ | మహేశ్వరి |
| ౪౮ | ౧౦౩ | సుతబె | సుతలె |
| | | ననవిదనపతి | నవియెదనపతి |
| ౫౦ | ౧౨౬ | వెసరేగి | లెసరేగి |
| ౫౪ | ౧౫౯ | జూపగా | జూపగా |
| | ౧౫౭ | లెట్టు | వెట్టు |
| | ౧౫౮ | మేలెంచి | మేవెంచి |
| ౫౬ | ౧౯౭ | నిదించు | నిందించె |
| | | స్మశాన | శ్మశాన |
| | ౧౬౮ | కిట | కిటి |
| ౬౦ | ౧౬౧ | వంచించ | వంబించ |
| | ౧౯౫ | రాజ్యపద | రాజ్యపద |
| ౬౧ | ౧౯౭ | దుర్మార్గమ్మున | దుర్మానమ్మును |
| ౬౨ | ౨౦౩ | మువతోడ | ములతోడ |
| | ౨౦౫ | వీయగా | లీయగా |
| | ౨౦౮ | బాపకాప | చాపకాప |
| ౬౩ | ౨౧౨ | దిట్టవై | దిట్టలై |
| | ౨౧౭ | యశ్శేరతిన్ | యుశ్సేరతిన్ |
| ౬౪ | ౨౧౯ | రవన | రావణ |
| | ౨౨౧ | ఓంధ్య | వింధ్య |
| | | బోరాశి | భోరాశి |
| ౬౬ | ౯౩౨ | విశ్వేశ్వర | విశ్వేశ్వర |

| పేజి | పద్య | తప్పు | ఒప్పు | పేజి | పద్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|---|---|---|
| ౬౭ | ౬ | రాసి | రాశి | ౯౯ | ౪౬ | తామర వేఁత | తామరశేత |
| ౬౮ | ౭ | వీశ్వరరా | వీశ్వరా | ౧౦౦ | ౫౦ | యొదసి | యొడిసి |
| ౭౦ | ౨౫ | మూర్తుశ్ | మూర్తుల్ | ౧౦౧ | ౫౬ | జాటియున్న | జాట్టియున్న |
| ౭౧ | ౩౩ | బుట్లియుండి | బుట్టియుండి | ౧౦౨ | ౬౧ | కుర్విద్వ ద్విర్ధ | కుర్విద్వద్విర్ధ |
| | ౩౬ | దాల్చి | దాల్తు | | ౬౨ | యిటువింత | యిటులింత |
| | | సేసిరి | సేయరి | | ౬౩ | పిర్విదలి | పిర్విదిలి |
| ౭౪ | ౫౧ | జేశి | జేసి | | .. | నలుప | దెలుప |
| ౭౬ | ౭౩ | మేశ్నరుం | మేశ్వరుం | | ౬౪ | మిట్టుచన్కట్టు | మిట్టచన్కట్టు |
| ౮౫ | ౧౩౫ | గుమిూగూడి | గుమిగూడి | ౧౦౩ | ౬౬ | కుర్వంధుడయి | కుర్విధుండయి |
| | ౧౩౭ | ధాౕన్న ములుఁన్ | ధ్యానమ్ములఁన్ | | ౬౭ | యంతేసత్యమా | యొంతేసత్యమా |
| | | నాశీర | నాసీర | ౧౦౪ | ౭౨ | గదకరి | గరకరి |
| ౮౬ | ౧౪౭ | త్రుటిబో | త్రుటిలోబో | | ౭౪ | పినియోద్వృత్తుల | వినిరోద్వృత్తుల |
| | ౧౫౨ | కేధ్వజుఁడు | కేకిధ్వజుడు | ౧౦౫ | ౮౧ | యయ్యులు | యయ్యిలు |
| ౮౮ | ౧౫౫ | డేశ్వర | డీశ్వర | | ౮౨ | మోహన | మోహాన |
| ౬౧ | ౧౭౪ | పొంగునకు | పొఁగునకు | ౧౦౬ | ౮౫ | సుఫరసుందరుల్ | సుందరసుందరుల్ |
| | ౧౭౯ | సేముగఁద | సేయఁగద | | ౯౧ | కమ్యము | కయ్యము |
| ౯౩ | ౧౮౭ | బున్యమ్మైన | బుణ్యమైన | ౧౦౭ | ౯౭ | పనులం | పనులం |
| ౯౪ | మొదట | చతుర్ధఆశ్వాసము | చతుర్ధాశ్వాసమ్ | | .. | గావింపదే | గావింపవే |
| ౯౫ | ౯ | గుణా ము | గుణాల వాలము | ౧౦౮ | ౯౯ | స్థైరింపమిన్ | స్థైరింపమిన్ |
| | ౧౩ | దూషికులగుచున్ | దూపకులగుచున్ | | ౧౦౦ | మదాత్మ | మందాత్మ |
| ౯౬ | ౧౫ | రక్షనుల్ | రక్షస్సుల్ | | ౧౦౩ | ఎట్జివా వైన | ఎట్టివారలైన |
| | ౧౭ | అమర | అపర | ౧౧౧ | ౧౧౭ | మధురాలాపమ | మధుర లాపము |
| | ,, | గేసుగాంద్రు | గేస్తురాంద్రు | | ౧౨౧ | మమెల్ల | మమ్మెల్ల |
| | ౧౯ | సత్వాభిరమ్యమ్మ | సత్వాభిరమ్యమ్మ | | | దాసగుణము | దాసగణము |
| ౯౭ | ౩౧ | పక్షము | వక్షము | ౧౧౨ | ౧౨౫ | గదర | గదరే |
| ౯౮ | ౩౩ | నభిష్ట | నభీష్ట | ౧౧౩ | ౧౩౪ | వెదికి | వెదకి |
| | ౩౭ | చొక్కిని | చొక్కిన | | ౧౩౯ | తెచ్చనడుచు | తెచ్చవడుచు |
| | ౩౯ | యదార్ధ | యథార్ధ | ౧౧౪ | ౧౪౧ | పొమామ్మట | పొమ్మమాట |
| ౯౯ | ౪౦ | వెదలింటి | వెదవింటి | ౧౧౫ | ౧౪౭ | పదమ్మనూత్రి | పదమ్మనూత |
| | ౪౨ | సుంకించ | నుఁకించి | | ౧౫౧ | గ్రిట్టించె | నిట్రించె |
| | ౪౩ | యునురుసును | యునురుసను | | | హుమంచు | హుమ్మంచు |
| | ౪౫ | ఈషాదరిని | ఈషాదరని | ౧౧౬ | ౧౬౫ | గోపమ్మెక్కించె | గోపమెక్కించె |
| | ,, | ఆషాదరిని | ఆషావరని | | | మున్వడచె | మున్విడిచె |

| పేజి | పద్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౧౬ | ౧౭౬ | జల్లలు | జిల్లలు |
| | ౧౫౯ | నిలుఁడే | నిలుఁడీ |
| | ,, | గళుకు | దళుకు |
| ౧౧౭ | ౧౬౧ | చూఱ వెట్టి | చూఱవెట్టె |
| | ౧౬౪ | రేఖదూఁకే | రేఖందూఁకె |
| ౧౧౮ | ౧౬౫ | డేడంబోవక | డీవంబోవక |
| | ౧౬౮ | కండెకరముల్ | కండెఁగరముల్ |
| | ,, | మోమెత | మోమెంత |
| ౧౧౯ | ౧౭౩ | యయనిమ్ము | యఁయిమ్ము |
| ౧౨౦ | ౧౭౯ | యెట్టిదయని | యట్టిదయని |
| | ౧౮౧ | సందరీ | సుందరీ |
| ౧౨౧ | ౧౮౫ | గైకొనుచు | గైకొనుచు |
| | ౧౯౦ | బిక్షాం దేహి | భిక్షాందేహి |
| ౧౨౨ | ౨౦౩ | నీయిల్లిదె | నీయిల్లిది |
| ౧౨౩ | ౨౧౦ | నగియెక్లైవన్ | నగియక్లైనన్ |
| | ౨౧౧ | నీసాదలె | నీసాదవె |
| ౧౨౫ | ౨౧౭ | తడని | తడవి |
| | ౨౨౦ | వెంపడిం | వెంబడిం |
| | ౨ ౧ | కంసనీలికిన్ | కంసశిలికిన్ |
| ౧౨౬ | మొదట | పంచమ ఆశ్వాసము | పంచమాశ్వాసము |
| | హెడ్డింగులో | వేదమునీశ్వరు | వేదముళీశ్వరు |
| ౧౨౭ | ౧౬ | ఖాతుఁడు | ఖ్యాతుఁడు |
| ౧౨౮ | ౨౨ | పైన | పైని |
| ౧౨౯ | ౩౨ | శిక్షింకుట | శిక్షించుట |
| ౧౩౨ | ౫౧ | యాయలుక | నీయలుక |
| ౧౩౫ | ౭౭ | వృత్తచిత్తయ్యె | చిత్తవృత్తయ్యె |
| ౧౩౬ | ౮౩ | వేమిక | లేమిక |
| ౧౩౭ | ౯౩ | తగుబుదుల్ | తగుబుద్ధుల్ |
| | ౯౪ | ఎత | ఎంత |
| ౧౩౮ | ౯౯ | విడివడు | విడివడ |
| | ౧౦౦ | వారిచటన్ | వారచటన్ |
| | ౧౦౨ | దుషాత్మ | దుష్టాత్మ |
| ౧౩౯ | ౧౦౯ | వేషార్భటల్ | వేషార్భటుల్ |
| | ౧౦౭ | గవాటగ్రి | గవాటాగ్రి |
| | ౧౦౮ | చంద్రాశ్రికరల్ | చంద్రాశ్రింకకల్ |
| ౧౪౦ | ౧౨౬ | శాఙ్జమ్ము | శార్ఙ్గజ్ మ్ము |
| ౧౪౧ | ౧౨౦ | మాయజుఁడు | యాయజుఁడు |
| | ౧౨౨ | నాటు | నాటె |
| ౧౪౨ | ౧౨౫ | బర్వేం | బర్వాం |
| | ౧౨౬ | సర్వహారము | సర్వాహరము |
| ౧౪౩ | ౧౩౪ | గదెవె | గదపె |
| | ౧౩౮ | మన్నింటం | మన్నిటిం |
| ౧౪౪ | ౧౪౩ | లక్ష్మీశ్వరుఁడు | లక్ష్మీశ్వరుండు |
| ౧౪౭ | ౧౩ | తండమ్ములన్ | తండమ్ములై |
| | ౧౬ | కలిసెన్ | కవిసెన్ |
| ౧౪౮ | ౨౨ | గిరిశ | గి-శ |
| | ౨౪ | నవ్య | నవ్వు |
| ౧౪౯ | ౩౩ | తానొక | తానునొక |
| ౧౫౦ | ౩౬ | తేరా | తే- |
| ౧౫౨ | ౪౯ | యమునవినుడు | యమునవినుతు |
| ౧౫౩ | ౫౬ | యల్లనల్లశివునా శ్రీమనాటిక | యొక్క పూచినరసా లమునీడను |
| | ౫౭ | చూచిన | పూచిన |
| | ౫౮ | స్ఫారముత్త | స్ఫురదుత్త |
| ౧౫౪ | ౫౯ | మదామయ | సుధామయ |
| | ౬౦ | జవిరించె | జివురించె |
| | ౬౧ | స్మర | సర |
| | ౬౨ | బ్రెమార్ద్రి | బ్రేమార్ద్రి |
| ౧౫౫ | ౬౬ | ననభమ్ము | నభమ్ము |
| ౧౫౬ | ౮౪ | మేగ్వరునెమ్మయి | మేశ్వరునెమ్మ |
| ౧౫౮ | ౮౮ | వటుఁడుస్ఫుట | వటుఁడునుస్ఫుట |
| ౧౫౬ | ౭౯ | వినియుఁట | వినియుంట |
| ౧౬౦ | ౧౧౨ | షాకార | షాకర |
| | ౧౧౩ | అసినసన్ | అనినన్ |
| ౧౬౧ | ౧౧౩ | బోనిత్తుపె | బోనిత్తుమె |
| | ౧౧౪ | మాధీన్ | మాధురన్ |

| పేజి | పద్య | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| | ౧౧౫ | కట్టుదుర | కట్టెదుర |
| | ౧౧౫ | సౌభాగ్రి | సౌభాగ్య |
| ౧౬౩ | ౧౨౭ | కటహారి | కటిః హారి |
| ౧౬౪ | ౧౩౨ | వేల్వడన్ | వేల్వడెన్ |
| | ౧౩౩ | పరమేషి | పరమేష్ఠి |
| | ౧౩౪ | గ్రింహించి | గ్రహించి |
| ౧౬౫ | ౧౩౮ | యపార్వతి | యప్పార్వతి |
| ౧౬౬ | ౧౪౭ | మతిగొని | మతి గొని |
| | ,, | దరవిరి | దరలిరి |
| | ,, | కాంక్షితమువిడ | కాంక్షితములిడ |
| | ౧౪౯ | షితుఁదర్మ్మిలిన్ | షితుండర్మిలిన్ |
| | ౧౫౦ | మనహర | మదనహర |
| | ౧౫౧ | రమావిభుఁడు | రమావిభుండు |
| ౧౬౮ | ౮ | పులకంచిన | పులకించిన |
| ౧౬౯ | ౧౮ | సతి! నీతగునె | సతీ! తగునె |
| | ,, | వేల్పులున్ | వేల్పులన్ |
| ౧౭౨ | ౪౩ | మగుడున్ | మగుడన్ |
| ౧౭౩ | ౪౪ | పాంబల్యమ్మ | ప్రాబల్యమ్ము |
| | ౫౦ | బెడ్డిం | బేడ్లిం |
| ౧౭౪ | ౫౩ | సుత్తైవె | సుతలై |
| ౧౭౫ | ౬౧ | ప్రతిష్ట | ప్రతిష్ఠ |
| | ౬౫ | శిద్ధాంత | సిద్ధాంత |
| | ౬౬ | చెందును | నెందును |
| | ౬౭ | జీకము | బకము |
| | ,, | గళమ్మ | గణమ్ము |
| ౧౭౭ | ౮౦ | శివమతి్ర | శివమంత్ర |
| ౧౭౮ | ౯౬ | వేదెంచ | లేదెంచ |
| ౧౭౯ | ౧౦౦ | నసున్ | నన్నున్ |
| | ౧౦౨ | చిత్తమ్మ | చితమ్ము |
| ౧౮౦ | ౧౦౭ | రంగలీ | రంగద్ |
| ౧౮౨ | ౪ | సముత్సక | సముత్సుక |
| ౧౮౩ | ౯ | యిట్లనుం | యిట్లనుం |
| ౧౮౪ | ౧౬ | నతిసుతుకము | సతిసుతుకము |
| | ౯ | పంచచామరము | చామరము |
| ౧౮౫ | ౨౩ | బాలుఁడునాళశి | బాలుఁడున్ శశి |
| | ,, | గ్రాలుచుబెరుగ | గ్రాలుచున్ బెరుగ |
| ౧౮౬ | ౩౩ | నీతియొసఁగుట | నీవియొసఁగుట |
| | ౩౯ | ప్రిమృతమ్మును | ప్రమృతమ్మును |
| ౧౮౭ | ౪౦ | నమృతయా | నమృతమయా |
| | ,, | సుశృతము | సుశ్రుతము |
| | ,, | పలుకుడెన్నిండు | పలుకుడెన్నండు |
| | ,, | లెడల | వెడల |
| ౧౮౮ | ౫౨ | భూవి | భూమి |
| | | వేకటిన్ | వ్రేకటిన్ |
| ౧౮౯ | ౫౯ | సూక్తువిచ్చి | సూక్తులిచ్చి |
| | ౬౦ | విపులును | లిపులును |
| ౧౯౦ | ౬౩ | మాంత్రపితలు | మాత్రపితలు |
| | ౬౪ | వత్క్రియల | దత్క్రియల |
| | | మూకుఁడ | మూకుఁడు |
| | | సంతిసిల్లు | సంతసిల్ల |
| | ౬౫ | పగ్వంధ | పంగ్వంధ |
| | ౬౬ | బాలుకుఁడు | బాలకుఁడు |
| ౧౯౧ | ౭౪ | తల్లిదండులును | తల్లిదండ్రులు |
| | ౭౫ | ఇటచనె | ఇటుచనె |
| ౧౯౨ | ౭౯ | యిపుడెటునో | యిపుడెటనో |
| | ౮౦ | విడువ | విడువు |
| | ౮౧ | చూడదేల | చూడ వేల |
| | | యముక్త | యవిముక్త |
| ౧౯౩ | ౮౪ | ఖద్యోతి | ఖజ్యోతి |
| | ౮౫ | చనవసరమ్ము | చన్నవసరమ్ము |
| | ౮౯ | వంతలు | నంతలు |
| | | యుండునే | యుండునె |
| ౧౯౪ | ౯౦ | లూక్కెర | లూక్కర |
| | ౯౨ | లలనా—మగనాలి | లలనాతగునామగనా |
| | ౯౪ | సతిఈశ్వరుండు | సతియీశ్వరుండు |
| | ౯౬ | యదనును | యదనున |

| పేజి | పద్య. | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౯౫ | ౯౩ | అది | అని |
| | | జిగ | జగ |
| | ౯౭ | జేపిన | జేసిన |
| | | శేషునుడిద | శేషము డింద |
| | ౧౦౦ | జెందునొ జెంద | జెందునొ చెంద |
| | ౧౦౧ | హీనికులుల్ | హీనకులుల్ |
| ౧౯౬ | ౧౦౩ | యొకడున్నె | యొకడున్నే |
| | ౧౦౪ | బ్రిజతెల్టం | బ్రిజలెల్గం |
| | ౧౦౫ | పరకింప | పరీకింప |
| | ౧౦౬ | నవర్ణ | నపర్ణ |
| | ౧౦౭ | తమిదగం | తమ్మిదగం |
| | ౧౦౮ | శుకాంగనబ్రియో | శుకాంగనన్ బ్రియో |
| ౧౯౭ | ౧౦౯ | పలింకెం | పలికెం |
| | ,, | కోపమ్మునన్ | కోపమ్మనన్ |
| ౧౯౮ | ౧౧౨ | ప్రవరుఁడయి | ప్రవరుండయు |
| | ౧౧౪ | కోరికవీరికెత్తఁగా | కోరిక లీఁ కెత్తఁగా |
| ౧౯౯ | ౧౨౩ | య నెమూకు | య నెన్ మూకు |
| ౨౦౦ | ౧౩౧ | శ్లోనికు | శ్లోకుని |
| | ౧౩౨ | బరత్రయమ్ము | బురత్రయమ్ము |
| | ౧౩౪ | నీదు పాద | నీయపాంగ |
| ౨౦౧ | ౧౩౫ | వేధనూపుర | వేదనూపుర |
| | | రాకపరిభూత | రాగపరిభూత |
| | ౧౩౬ | నలరెవ్ | నలరెవ్ |
| ౨౦౨ | ౧౪౨ | వేశైన | లేరైన |

మఱియును బట్టువడు తప్పులను సవరించుకొనఁ బాఠకులకు విన్నపము.

ఎం. వి. శర్మ.
8-1-49



## మల్లంపల్లి మల్లికార్జునారాధ్యుల వారిచే రచింపబడిన గ్రంథములు.

1. భోగేశ్వర మాహాత్మ్యము.
2. సత్యవత్యుపాఖ్యానము.
3. చోరేశ్వరము.

## మల్లంపల్లి వీరేశ్వరశర్మ గారిచే రచింపబడిన గ్రంథములు.

1. గురుదక్షిణ.
2. కాంచీ ఖండము.
3. శంకరారాధ్య చరిత్ర.
4. నందన వనము.
5. దుర్గా శతకము.
6. మృత్యుంజయ శతకము.
7. లుబ్ధకాగ్రేసర శతకము.
8. దుర్గా త్రిశతి.
9. పాంచరాత్రము, [నాటకము.]

## శర్మగారి సోదరులచే రచింప బడినవి.

1. విఘ్నేశ్వర చరిత్ర.
2. హాలాహలపానము.

# విశ్వేశ్వర గ్రంధమాల.

---

1. బ్రహ్మసూత్రభాష్యము, — జగద్గురు నీలకంఠారాధ్య విరచితము.
2. శైవ సర్వస్వము, — ముదిగొండ కోటయ్యశాస్త్రి.
3. శంభు శతకము, — ముదిగొండ నాగలింగశాస్త్రి.
4. నలవిలాసము, — ,,
5. నిత్యోత్సవ తంత్రము, — చల్లా గోపాలకృష్ణశాస్త్రి.
6. శివసందర్శన విధి, — మల్లంపల్లి జ్వాలా వీరభద్రశాస్త్రి.
7. శైవమతము – అతిప్రాచీనము, — ,, కనకదుర్గా వరప్రసాద్.
8. గౌరీ కళ్యాణము, — ముదిగొండ వీరభద్రారాధ్యులు.
9. పుత్రప్రదాన లీల, — ,,
10. కుమార కళ్యాణము, — ,, జ్వాలాపతి లింగశాస్త్రి.
11. శివతాండవ లీల, — ,,
12. శివకవచము,
13. జ్ఞాన సుధారసము,
14. లింగాష్టోత్తర శతనామాబ్జమాలిక,
15. శంకరారాధ్య చరిత్ర, — మల్లంపల్లి వీరేశ్వరశర్మ.

అడ్రస్:- మ॥ రా॥ ఆకారపు నరసింగం గుప్తగారు,

విశ్వేశ్వర దేవాలయ ధర్మకర్త.